

కుశలవులు గానమొనర్చించిన

# శ్రీరామాయణ కథాసుధ

(వచనము - ఉత్తరకాండసహితము)




ర చ యి త :

శ్రీ అన్నంరాజు సత్యనారాయణరావు

పండరీపురం — గుంటూరు.

ప్రథమ ముద్రణము : వెయ్యి ప్రతులు
రౌద్రి, కార్తీకము
1980 నవంబరు



వెల : రు 12-50

ప్రాప్తిస్థానము
అన్నంరాజు సత్యనారాయణరావు,
5వలైను, పండరీపురం
గుంటూరు. 522002

జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్ 7-వ లైను, అరండల్ పేట, గుంటూరు-2.

అట్టపైబొమ్మ - చిత్రకారుడు : శ్రీ కె. ఎస్. రామచంద్రమూర్తి, గుంటూరు.



హిందూమత గ్రంథరచయితలకు ప్రోత్సాహమునిచ్చు

పథకమున

**శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు**

ఈ గ్రంథముద్రణమునకై

రెండు వేల ఐదువందల యేబది రూపాయలును,

ఇందు చేర్చబడిన

శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీ పద్మావతీ అమ్మవార్ల

చిత్తరువులను దయతో నొసగిరి.

---

గుంటూరు నివాసులు, ఉదారహృదయులు, ఆస్తికతాభిలాషులు,

వ్యాపార నిపుణులు

*శ్రీ దేవినేని రామకృష్ణ, M. A; L. L. B.*

వీరి ధర్మపత్ని

*శ్రీమతి బాలాత్రిపురసుందరమ్మగార్లు*

ఈ గ్రంథ ముద్రణమునకైన శేషించిన వ్యయమును

విరాళ మొసగి

శ్రీ సీతారామచంద్రుల అనుగ్రహమునకు పాత్రులైరి.

## అంకితము



శ్రీ హనుమల్లక్ష్మణ భరత శత్రుఘ్న కుశలవ సమేత

శ్రీ సీతారామచంద్రుల

దివ్యచరణారవిందములకు—



పూజ్య మాతా పితరులు, కీర్తిశేషులు

**చెంచు రామమ్మ**

**సుబ్బరాజు పంతులుగార్ల**

స్మృతి చిహ్నముగ గ్రంథము ప్రకటితము

—సత్యనారాయణరావు




THIS BOOK IS

PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

UNDER THEIR SCHEME

"AID TO PUBLISH RELIGIOUS BOOKS".

# మనవి

శ్రీ రఘురాముని చరిత్రము శతకోటి ప్రవిస్తరమైనది. ఎందఱో మహాత్ములు ఎన్నియోరీతుల శ్రీమద్రామాయణమును రచించిరి. ఎందరెన్ని విధముల రూపొందించినను తనివిదీరని పవిత్రగాథ. నిజమున కిది మహాసాధ్వి సీతయొక్క చరిత్రమని వాల్మీకిమహర్షియే నుడివి యుండెను. సీతారాములు సాక్షాత్తు లక్ష్మీనారాయణ స్వరూపులు. ప్రపంచమున మానవుని ధర్మములు ప్రతిబింబింపజేయు తలపునభూమిపై అవతరించి, ప్రవర్తించిన ఆదర్శపురుషుడు రాముడు. అందువలననే "ఆత్మానం మానుషమ్మన్యే రామం దశరథాత్మజమ్" అని పలికినాడు. "రామోవిగ్రహవాన్ ధర్మః" అనియు వాల్మీకి పలికినాడు. ఏదృష్టితో జూచినను రాముడు ఉత్తమపురుషుడు; పురుషోత్తముడు.

సీత అగ్నిప్రవేశముచేయు సందర్భమున బ్రహ్మాది దేవతలు, సుగ్రీవాది వానర ప్రముఖులు, విభీషణుడు మున్నగువారుండిరి. అందరి సమక్షమున సృష్టికర్తయగు బ్రహ్మ దశరథరాముని,

'వివిధరూప ధరుడవైయుండు దచ్యుత!
సరసిజాక్ష! శార్ఙ్గచక్రగదాధర! జగజ్జనాథ!'

అనియెను. నీవు శ్రీమన్నారాయణుడవనియే స్పష్టముగ బలికెను. ఈవాక్యములను శ్రీరాముడువిని హర్షించి మిన్నకుండెనేగాని ఖండింపలేదు. రాము డెన్నడును "నేను భగవంతుడను" అని చెప్పలేదు. రామావతారమునందలి విశిష్టతయే యిది!

శ్రీమద్రామాయణమును రచించిన వాల్మీకి మహర్షి "ఆదికవి" యయ్యెను. వాల్మీకి రచించిన రసవత్తర దివ్యచరిత్రమును లోకమున కందించిన ప్రప్రథమ ప్రచారకులు "కుశలవులు". ఇది వెలుగులోనికి వచ్చి పదిమందివలన మెప్పుబడసినది వారివలననే. శ్రీరామచంద్ర ప్రభువును సహితము ముగ్ధునిచేసినది ఈ ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలే! శ్రీ రామాయణకథాసుధను శ్రోతలు తనివిదీర సేవించిరి.

మధురగాయకులగు నాబాలకులు గానముచేయుటతో నారంభించి, ఉత్తరరామాయణమును గూడ జేర్చి. సీతారాముల సమ్ముఖమున మహాసభయందు కవలు సీతారామ కళ్యాణ ఘట్టమును మరల వినిపించినటులను, ఎల్లరును కుశలవులను దీవించినటులను సుఖాంతము గావించితిని. తుదిని మహామనీషి వాల్మీకి "సర్వేజనాః సుఖినోభవంతు" అని పలికి లోకకళ్యాణమును కోరినాడు.

పాఠకులకు అభిరుచి, ఆనందము కలిగించు నుద్దేశ్యముతో ముఖ్యమగు సన్నివేశములందు వాల్మీకిరామాయణమునందలి శ్లోకములను, ఇతర రామాయణములనుండి హృద్యములగు పద్యములను కొన్ని అటనట జేర్చితిని.

మధ్యతరగతి చదువరులును, స్త్రీలును చదువుకొనుట కనుకూలముగ, సంధులను సహితము పాటింపక సులభశైలిలో వ్రాసితిని. విదేశ భాషలలోనికి సహితము తర్జుమాచేయబడి బహుళ ప్రచారమునందుగల అత్యుత్తమ గ్రంథము రామాయణము. ప్రజానీకమును ధర్మ ప్రవర్తకులనుగ రామచరిత్ర తీర్చిదిద్దగలదనుట నిర్వివాదాంశము.

ఇట్టి పవిత్ర ఉత్తమ గ్రంథమును వ్రాయ సాహసించిన నాకృషి ఎంతవఱకు సఫలీకృతమైనదో నిర్ణయించవలసినవారు పెద్దలు, పండితులు, పాఠకులు! ఆంధ్రపాఠకజనకర విరాజితమై, ఈగ్రంథకుసుమము లేశమాత్రమేని సుగంధము గుబాళింపగలిగిన యెడల నేను ధన్యతముడనగుదును.

—సత్యనారాయణరావు

అవధాని శేఖర, ఆశుకవి కేసరి, ప్రౌఢ భారతి, కవితాసుధాకర,
సాహిత్యప్రవక్త, సరస్వతీ కంఠాభరణ

## డా॥ శ్రీ ప్రసాదరాయ కులపతి, M. A., Ph- D.

## అభిప్రాయము

—: ౦ :—

శ్రీ అన్నంరాజు సత్యనారాయణరావుగారు నాకు చిరకాలము నుండి తెలిసినవారు. సరస్వతీసముపాసకులై సరసరచనలెన్నో చేసినారు. కావ్యనాటక నిర్మాణములలో వివిధ ప్రక్రియలలో ప్రజ్ఞాసమన్వితులైన వీరీనాడు శ్రీ రామాయణ కథాసుధ నిర్మించుట సముచితము.

తెనుగుదేశమున గద్యపద్యాత్మకములైన రామాయణములెన్నో ఉన్నవిషయమందరికిని తెలిసినదే. అయినను రామకథ రచించుటలో రచయితలకు తమ పూర్వులెందరో వ్రాసిరి గదా యను సంతృప్తియు, అసంతృప్తియు లేవు. ఎవరి మార్గము, సమాధానము వారిదే.

సీ॥ మరల నిదేల రామాయణం బన్నచో
ఈ ప్రపంచకమెల్ల నెల్లవేళ
తినుచున్న అన్నమే తినుచున్న దిన్నాళ్ళు
తన రుచిబ్రతుకులు తనవిగాన
చేసిన సంసారమే సేయుచున్నది
తనదైన అనుభూతి తనదిగాన
తలచిన రాముని తలచెద నేనును
నాభక్తి రచనలు నావిగాన

గీ॥ కవి ప్రతిభలోన నుండును కావ్యగత శ
తాంశములయందు తొంబదియైనపాళ్ళు
ప్రాగ్వివశ్చిన్నమతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథా కృతినిమించి.

అని విశ్వనాథవారు పలికినట్లు అన్నంరాజువారును భావించియుందురు. ఆయనలోని జీవుని ఆవేదన యిట్లు పురికొల్పియుండును.

రచయిత రచనలో కొన్ని చమత్కారములు చేసెను. అనేకులవలె వాల్మీకిరామాయణము నాధారముచేసికొనియే రచన కొనసాగించెను,

గద్యము, పద్యము, చంపువు, అను మూడు మార్గములలో నీయన చిత్రమైన మార్గము నెన్నుకొనెను. వచనములో కథ చెప్పుచు పోయినాడు. మధ్యలో మూలశ్లోకములు మంచి వుదాహరించెను. పద్యములుదాహరించెను. ఈపద్యములు రచయితవికావు. భాస్కర రామాయణము మున్నగు గ్రంథములనుండి పద్యము లేరి అందించెను.

లోకములో రామాయణమును పురాణముగా, ఉపన్యాసములుగా, పండితులు చెప్పుదురు. కథ చెప్పుచు మధ్యలో ఆయారచయితల మంచి శ్లోకములు, పద్యములు ఉదహరించుచు సదస్యుల మనస్సులలో తమ ఆలోచనలను దృఢముగా నాటుదురు. పాయసములోని జీడిపప్పు, ద్రాక్షపండ్లవంటివి శ్లోక పద్యములు.

పాఠకుల మనస్తత్త్వము నెరిగిన అన్నంరాజు వారిట్టి మార్గము ననుసరించిరి. ఈగ్రంథము చేతబట్టుకొని ఎవరైన జనరంజకముగా రామ కథ పురాణముగా చెప్పవచ్చును; ఉపన్యాసముగా పలుకవచ్చును.

సత్యనారాయణరావుగారు ప్రాస్తావికముగా ఇతర పురాణముల నుండికూడ విషయసేకరణచేసి చెప్పిరి. వాల్మీకికథ ప్రవేశికలో వివరించిరి. కృణు ఋషికథ సూచించిరి. అది శంభుడను మహర్షి చెప్పినట్లు పురాణములలో కలదు. తైత్తిరీయ ప్రాతిశాఖ్యములో, పద్మస్కాంద, ఉత్తర నారదీయములలో వాల్మీకికథ భిన్నభిన్నముగా గలదు. ఆ విశేషములు కొన్ని వీరు సూచించిరి.

పుష్పకమును (పుట 126), రంభను (పుట 175), సీతను (పుట 189), రాముని (పుట 102) వర్ణించిన సందర్భములలో, మరి ఇటువంటి చోట్ల వీరు ఏరితెచ్చిన పద్యములు రత్నములవంటివి.

ఇక వీరి వచనరచన సరళగ్రాంథికములో లలితముగా సాగినది. పుస్తకము చేతబట్టినచో తుదివరకు విడువక చదువవలెనని అనిపించు నన్నచో ఇక వేరుమాట చెప్పవలసినపనిలేదు. ప్రజలకెంతో ఉపయోగకరమైన ఇటువంటి మంచి గ్రంథమునిచ్చి సత్యనారాయణరావుగారు తెలుగువారికి వెలకట్టరాని ఉపకారము చేసినారు.

[సం] ప్రసాదరాయకులపతి

# కరుణశ్రీ "కల్యాణవాణి"

మీ హస్తాలను అలంకరించిన గ్రంథంపేరు శ్రీరామాయణకథా సుధ. దీనిని రచించినవారు సుప్రసిద్ధ నాటకరచయితలూ, కవులూ, ఆదర్శ ఉపాధ్యాయులూ విశేషించి శ్రీరామభక్తులూ అయిన శ్రీ అన్నంరాజు సత్యనారాయణరావుగారు.

రామకథ రామనామం వలెనే ఎంతో మధురమైనది. "పాఠ్యే గేయేచ మధురం" అని వాల్మీకి మహర్షులవారే అన్నారు. మరొక మహాకవి—

"కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్"

అని ఆదికవికి అంజలిఘటిస్తూ వాల్మీకులవారి వాక్కు మధురాతి మధురమైనదని ఉగ్గడించారు. భోజదేవుడుకూడా "మధుమయ ఫణితీనాం మార్గదర్శీ మహర్షిః" అని వాల్మీకి రచనా మాధుర్యాన్ని ప్రస్తుతించాడు. సహజంగా మధురమైన రామకథ వాల్మీకి వాక్కుతో మరింత మధురమైనది. అందుకనే అన్నంరాజువారు తమ గ్రంథానికి "శ్రీరామాయణకథాసుధ" అని పేరుపెట్టారు. శ్రీరామచంద్రునికి సంబంధించిన ఈ కథ "సుధ" కావటంలో సందేహమేముంటుంది!

అయితే ఇంతకుముందు మనభాషలో పద్యరామాయణాలు, గద్య రామాయణాలు, ద్విపదరామాయణాలు, గేయరామాయణాలు ఎన్నో, ఎన్నెన్నో వచ్చిఉన్నాయికదా మళ్ళీ వీరు రామకథ వ్రాయటంలో ప్రత్యేకం ఏమున్నదనే ప్రశ్న ఉండనే ఉన్నది. దానికి కంకంటి పాపరాజుగారు తన ఉత్తరరామాయణంలో సమాధానం చెప్పనే చెప్పారు—

"రాఘవేశ్వరు చారిత్రము లెందరెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే" అని. అంతేకాకుండా "చారుకవిత్వము నేర్చి జానకీ జాని కథల్ రచింపక అసత్కథ లెన్ని రచించెనేనియున్ వాని వివేక మేమి

టికి వాని కవిత్వ మహాత్వ మేటికిన్" అని ఆయన తన రామాయణ రచనా ప్రవృత్తి హేతువును నొక్కి వక్కాణించినాడు.

ఈ సందర్భాన్నే మురారి మహాకవి "అనర్ఘ రాఘవ నాటకం"లో

"యది క్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితం
గుణైరేతా వద్భిః జగతి పునరన్యో జయతి కః?"

(శ్రీ)రాముని చరిత్రాన్ని పురాతన కవీంద్రులెందరో సమృద్ధిగా అభివర్ణించారు. మళ్ళీమళ్ళీ మనం వర్ణించటం దేనికని వైముఖ్యం వహిస్తే ఇటువంటి లోకోత్తర గుణోత్తరుడైన ఉదాత్తనాయకుడు మరొకడు మనకెక్కడ లభిస్తాడు?" అంటాడు.

ఇటువంటి అభిప్రాయాన్నే "ప్రసన్నరాఘవం"లో జయదేవ కవిచంద్రుడు ప్రకటించాడు మరింత చమత్కారంగా-

స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కో దోషః సతు గుణగణానా మవగుణః"

రఘుకుల తిలకుడైన రామచంద్రుణ్ణే కవులు తమ కావ్యానాయకుణ్ణిగా ఎన్నుకున్నారంటే అది ఆ (శ్రీ)రామునియందలి సుగుణాల దోష మేగాని కవులదోషము ఏమాత్రమూ కాదుట. లేకపోతే లోకంలోని సమస్త సద్గుణాలూ రాశీభూతమై మరెక్కడా చోటులేనట్లు ఆ శ్రీరామ చంద్రుణ్ణే ఎందుకు ఆశ్రయించాలి?

రామకథ ఆబాలగోపాలానికి ఆదర్శపాత్రమైనది. అందులో విశేషించి ఆంధ్రులకు సీతారాములు ఆరాధ్యదైవాలు. తెలుగుదేశంలో రాములవారి గుడి లేని గ్రామం లేదు. తెలుగునాడులోని గోదావరీతీరం సీతారాముల పవిత్రపాదపరాగాలచే పొంగి పులకించింది. '(శ్రీ)రామ' చుట్టకుండా తెలుగువాడు ఏవ్రాతా ప్రారంభం చెయ్యడు. తెలుగు దేశంలో "రామయ్య"లకూ "సీతమ్మ"లకూ కొరత లేదు. అసలుసంగతి

చెప్పాలంటే తెలుగులో ఉన్నన్ని రామాయణాలు మరేభాషలోనూ లేవనటంలో అతిశయోక్తి ఆవంతకూడా లేదు.

ఈవిధంగా ఆంధ్రజాతికి ప్రాణసమానమై ఆంధ్రులజీవితాలలో పెన వేసుకొనిపోయిన రామకథ ఎందరు ఎన్నివిధాల వర్ణించినా ఎన్నిమార్లు చదివినా నిత్యనూతనంగానే ఉంటుంది. అందుకనే శ్రీ అన్నంరాజు వారు వాల్మీకిరామాయణ మహోదధిని మథించి ఈ కథాసుధ ఈ విధంగా ఆంధ్రులకు అందించారు.

సత్యనారాయణరావుగారి భాష సరళమై సరసమై సహజసుందర గమనంతో సాగింది. పాఠకుల సౌకర్యం కోసం విసుగుపుట్టకుండా ఉండ టం కోసం చిన్నచిన్న శీర్షికలు – తాటకవధ, దివ్యాస్త్రములు, యాగ సంరక్షణ, శివధనుస్సు – మొదలైనవి ఉంచారు.

ఇంతేకాకుండా రసస్ఫూర్తికోసం సందర్భానుసారంగా వాల్మీకి రామాయణంలోని సంస్కృత శ్లోకాలనుకూడా సుమారు నలభైదాకా ఆయాస్థానాల్లో నిక్షేపించారు. అంతేకాదు–భాస్కరరామాయణం,గోపీ నాథరామాయణం, మొల్లరామాయణం, ఆంధ్రవాల్మీకిరామాయణం, శ్రీరామకథామృతము, తిక్కనగారి నిర్వచనోత్తరరామాయణం, కంకంటివారి ఉత్తరరామాయణం నుంచి కూడా మంచి మంచి కమల కళికలవంటి పద్యాలను ఏర్చికూర్చి తమగ్రంథాన్ని తీర్చిదిద్దారు. అందు వల్ల గులాబీలతో కూడిన కుందమాలవలె ఈగ్రంథం సుగంధబంధు రమై సుమనోమనోజ్ఞతను సముపార్జించుకున్నది.

శ్రీరామ పట్టాభిషేకంతో ఆగకుండా ఉత్తరరామాయణకథ కూడా ఇందు చేర్చటం మూలంగా ఈ గ్రంథానికి సమగ్రత సమకూ రింది. సప్తకాండ సమలంకృతమైన ఈ సరసకృతి కుశలవుల రామా యణగానంతో ప్రారంభంకావటం ఒక క్రొత్త సొగసు. కథవిషాదాంతం కాకుండా శ్రీరాముడు చిరంజీవులను చేరదీసి శిరములు మూర్కొని

దీవించటంతో సమాప్తమవుతుంది. ఈ దృశ్యాన్ని తిలకించి సీతకూడా మనలాగే ఆనందబాష్పాలు రాలుస్తుంది.

"ఏకోరసః కరుణఏవ" అన్న భవభూతి మహాకవికూడా తన ఉత్తరరామ చరిత్రలో సీతమ్మ అమ్మ గర్భంలో కలసిపోవటాన్ని సహించలేక ఛాయానాటకంలో చూపించి చివరకు సీతారాముల పునస్సమాగమంతో కథను సుఖాంతం చేసి "అమ్మయ్య!' అనుకున్నాడు. అంతటి జాలిగుండె ఆయనది. శ్రీ అన్నంరాజువారు కూడా భవభూతి అడుగుజాడల్లో కథను శుభాంతం చేశారు.

శ్రీమద్రామాయణకథ అంతా సుమారు రెండువందలపుటలలో ఇమిడ్చి చెప్పటం మూలాన పాఠకులు ఎక్కడా విసుగుచెందకుండా ముందుకు సాగిపోతారు. ఒక్కపట్టులో రామాయణగాథ మొత్తం పఠించి ఒక్కగ్రుక్కలో రామకథాసుధను తనివితీర త్రావి సంతృప్తులవుతారు.

ఇందలి కథ అంతా వాల్మీకి రామాయణాన్ని అనుసరించే నడిచింది. అయితే కాలనేమి కథమాత్రం (వీడు సంజీవికోసం పోతున్న హనుమంతుడికి అడ్డుతగిలినవాడు) అవాల్మీకం కన్పిస్తున్నది. ఈకథను కవయిత్రి మొల్లకూడా తన రామాయణంలో రసవంతంగా వర్ణించింది.

రామాయణం పూర్తిగా ఆలకించిన శ్రీరాముడు తన తల్లుల కోరిక ననుసరించి సీతాకళ్యాణ ఘట్టాన్ని మరొకమాటు వినిపించమని కోరటం వాల్మీకులవారి అనుజ్ఞానుసారం కుశలవులు తమ మధుర కంఠాలతో "సీతాకల్యాణఘట్టం" మళ్ళీగానంచేయటం ఎంతో హృదయంగమమైన సన్నివేశం.

శ్రీరామాయణకథాసుధను ఆంధ్రావళికి పంచిపెట్టి శ్రీ అన్నంరాజు సత్యనారాయణరావుగారు తమ జీవితాన్ని ధన్యం చేసుకున్నారనటంలో ఏమాత్రం సందేహంలేదు. అన్నంరాజువారు ఇటువంటి ఉత్తమ రచనలను ఇతోధికంగా రచించి తమ కవితాశక్తిని మరింత సార్థకం చేసుకోటానికి వారికి శ్రీరామచంద్రమూర్తి దీర్ఘాయువు ప్రసాదించాలని కోరుతున్నాను.

గుంటూరు
1-11-80

కరుణశ్రీ
జంధ్యాల పాపయ్యశాస్త్రి

## శ్రీ దేవినేని దంపతులు

సీ. గుంటూరు పురవాసి - గురుతర వాణిజ్య
మొనరించు నిపుణుండు - వినయశీలి
ఆస్తికతాభావ - మలరగ మెలగును
దైవభక్తి వెలయు - తలపు గలిగి
అణకువ, దయయు, ని - రాడంబరంబును
ననుదిన చర్యల - నరయనుండు
కడు నుదార హృదిని - గడగి వర్తించును
రైతు జనావళి - రద్దిగలిగి

తే. గీ. దేవినేని వంశాబ్ధి నం - దీప్త మనగ
రామకృష్ణాభి ధానుండు - రాణజెలగు,
అవని బాలాత్రిపుర సుంద-రమ్మ ప్రియము
ధర్మపత్నియై సుఖముల - దనుపుచుండ॥

## కృత్యంజలి :

తే. గీ. జానకీప్రియ ! శ్రీరామ - చంద్రమూర్తి !
రామకృష్ణయు, నేనును - రక్తి భక్తి
అంజలించియు నర్పింతు - మయ్య కృతిని
ధన్యులనుజేయుమో ప్రభూ ! ధరణిపైని॥

—రచయిత

# కృతజ్ఞత

ఆర్థికసహాయమును, శ్రీ వేంకటేశ్వరస్వామి, శ్రీ పద్మావతీ అమ్మవార్ల చిత్తరువులను దయతో నొసగిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికిని,

పుస్తకమును పాఠకలోకమున కందించుట కాదుకొనిన దంపతులు దేవినేని రామకృష్ణ, శ్రీమతి బాలాత్రిపురసుందరమ్మగార్లకును,

ఈ గ్రంథ రచనమునకు తోడ్పడిన

| గ్రంథములు : | ఆయారచయితలు : సర్వశ్రీ |
|---|---|
| వాల్మీకి రామాయణము | ఆదికవి వాల్మీకిఋషివర్యులు |
| భాస్కర రామాయణము | మంత్రి భాస్కరుడు |
| గోపీనాథ రామాయణము | గోపీనాథం వేంకట కవి |
| మొల్ల రామాయణము | ఆతుకూరి మొల్ల |
| నిర్వచనోత్తరరామాయణము | తిక్కన కవీంద్రుడు |
| ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజు |
| ఆంధ్రవాల్మీకి రామాయణము | వాసుదాసుకవి |
| శ్రీమద్రామాయణము | దాశరధి రంగాచార్య |
| జగత్పురాణము | చుండూరు నాగభూషణరావు |
| శ్రీరామకథామృతము | తాడేపల్లి వేంకటప్పయ్య |

శాస్త్రిలుగార్లకును,

నాకిందు సూచనలనొసగి, అనేకవిధముల తోడ్పడిన "పౌరాణికరత్న" శ్రీ భలభద్రపాత్రుని హనుమంతరాయశర్మ, శ్రీ కస్తల హనుమంత రావుగార్లకును,

"అభిప్రాయము"ను వ్రాసియిచ్చిన డాక్టర్. ప్రసాదరాయ కులపతిగారికి, "కళ్యాణవాణి" నందజేసిన కరుశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారికిని, తదితర మిత్రులకును నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనములు—

గుంటూరు
5-11-1980

—సత్యనారాయణరావు

# విషయసూచిక

ప్రవేశిక పుట 1

1. ఈసుకుమార కుమారులకు ఈకవనమంతయు నెవరు నేర్పిరి? 2
2. వాల్మీకి ఋషివర్యు లెప్పుడీ కవనమల్లిరి ? 2
3. ఎవరీ వాల్మీకి, మొదట బోయవాడేనా ? 4
4. రామకథాఽమృతము 5

బాలకాండము 6

1, శ్రీరామ జననము 8
2. విశ్వామిత్రుని రాక...3. బల అతిబల విద్యలు 9
4. మన్మథుని ఆశ్రమము...5. తాటక వధ 10
6. దివ్యాస్త్రములు 11
7. విశ్వామిత్రుని ఆశ్రమము-యాగసంరక్షణ 8. శివధనుస్సు 11
9. హిమవంతుడు...10. సగరచక్రవర్తి 13
11. యజ్ఞాశ్వము 14
12. దిలీపుడు ... 13. భగీరథుడు 15
14. క్షీరసాగర మథనము 16
15. అహల్య 19
16. మిథిలకు 17, శతానందునిసంతోషము 18. హోమధేనువు 20
19. బ్రహ్మదండఫలము ... 20. త్రిశంకు మహారాజు 22
21. అంబరీషుడు - శునశ్శేపుడు 24
22. ఋషి - మేనక ... 23. రంభ - బ్రహ్మర్షి 26
24. శివధనుర్భంగము - సీతాకళ్యాణము 28
25. పరశురామ గర్వభంగము 29

అయోధ్యాకాండ

1. రామపట్టాభిషేక యత్నము 31
2. కోపగృహము 32

3. తెల్లవారినది 33
4. సీతారామ లక్ష్మణులు 35
5. శ్రవణ కుమారుడు 36
6. దశరథుని మరణము 37
7. అడవులకు భరతుడు 38
8. సోదర సమాగమము 39
9. పాదుకాపట్టాభిషేకము ... 10. అనసూయ 41


## అరణ్యకాండ


1. విరాధ వధ ... 2. శరభంగాశ్రమము 43
3. సుతీక్ష్ణుని ఆశ్రమము ... 4. సీతహితవు 44
5. పంచాప్సరము 45
6. జటాయువు ... 7. పంచవటి–పర్ణ శాల 8. శూర్పణఖ 47
9. ఖరదూషణులు 48
10. ప్రతీకారము 49
11. అపరబుద్ధి 50
12. బంగరులేడి 52
13. సీతాపహరణము 53
14. జటాయువు పోరాటము 54
15 సీత లంకాప్రవేశము 55
16. రాముని శోకము 56
17. కబంధుడు 57
18. శబరి 58


## కిష్కింధకాండ


1. పంపాసరస్సు – రాముని విరహము 59
2. శ్రీరామాంజనేయ ప్రథమసమావేశము 59

3. నగలమూట 61
4. వాలి కథ 62
5. సప్తసాల భంజనము 64
6. వాలివధ 65
7. ధర్మబద్ధము 66
8. సుగ్రీవ పట్టాభిషేకము 68
9. సుగ్రీవుని పరాకు 69
10. మత్తువదలినది 71
11. సీతాన్వేషణము – స్వయంప్రభ 72
12. సంపాతి 73
13. ఎవరు సమర్థులు 75

సుందరకాండ

1. సముద్రతరణము 77
2. లంకాపట్టణము 79
3. లంకాప్రవేశము 80
4. హనుమంతుని విచారము 83
5. అశోకవనము 85
6. రావణుడు 86
7. త్రిజటకల 89
8 శుభసూచకము ... 9. హనుమంతుని ఆలోచనము 90
10. సీత – హనుమంతుడు 91
11. కాకాసురుని వృత్తాంతము 95
12. చూడామణి ... 13. అశోకవన విధ్వంసము 96
14. జంబుమాలి 97
15. మంత్రి పుత్రులు ... 16. సేనానాయకులు 98
17. అక్ష కుమారుడు ... 18. మేఘనాదుడు 99
19. రావణుని కొలువుకూటము 100

20. దూతను చంపరాదు 102
21. లంకాదహనము 103
22. సీతమ్మ కుశలము 104
23. తిరుగుప్రయాణము 105
24. సీతాదేవిని చూచితిని 106
25. సమాలోచనము ... 26. మధువనము 107
27. శ్రవణానందము 108
28. శుభవార్త 109

## యుద్ధకాండ

1. ప్రయాణము 112
2. రాక్షసరాజు మంత్రాంగము 113
3. మరునాడు 114
4. విభీషణశరణాగతి 117
5. దర్భశయనము 119
6. సేతుబంధనము 121
7. వేగులవాండ్రు 122
8. మాల్యవంతుని హితవు ... 9. సువేలాద్రి 123
10. అంగదరాయబారము 124
11. రామరావణయుద్ధము... 12. ఇంద్రజిత్తు-నాగబంధము 125
13. రాక్షసవీరులు ... 14. రావణుడు 127
15. కుంభకర్ణుడు 128
16. మరికొందరు ... 17. రెండవసారి ఇంద్రజిత్తు 131
18. మొదటిసారి సంజీవని 132
19. మరల లంకాదహనము... 20. మిగిలిన యోధులు 133
21. మూడవసారి ఇంద్రజిత్తు 134
22. రెండవసారి రావణుడు 136
23. రెండవసారి సంజీవని ... 24. కాలనేమి 137
25. ధాన్యమాలిని 138
26. మాయలమారి మరణము 139

| | | |
|---|---|---|
| 27. | భరతుని దుస్స్వప్నము... 28. మాల్యవంతుడు | 140 |
| 29. | రాముని సంతోషము | 141 |
| 30. | మండోదరి హితవు ... 31. నాకు తెలియును | 142 |
| 32. | మూడవసారి రావణుడు | 143 |
| 33. | అగస్త్యమహర్షి - ఆదిత్యహృదయము | 144 |
| 34. | రావణసంహారము - ఉత్తరక్రియలు | 146 |
| 35. | విభీషణునకు పట్టాభిషేకము | 147 |
| 36. | శుభవార్త ... 37. సందేశము | 148 |
| 38. | సీత అగ్నిప్రవేశము | 149 |
| 39. | పవిత్రురాలు | 152 |
| 40. | తిరుగుప్రయాణము | 153 |
| 41. | నందిగ్రామము | 154 |
| 42. | శ్రీరామ పట్టాభిషేకము | 156 |
| 43. | రామరాజ్యము | 157 |


## ఉత్తరకాండ


| | | |
|---|---|---|
| 1. | అభినందనలు ... 2. పులస్త్యబ్రహ్మ | 159 |
| 3. | కుబేరుడు | 160 |
| 4. | లంకానగర నిర్మాణము | 161 |
| 5. | విష్ణువుతో పోరాటము | 162 |
| 6. | కైకసి సంతానము ... 7. వరములు | 163 |
| 8. | లంక రాక్షసులపాలు ... 9. వివాహములు | 165 |
| 10. | అలకాపురి | 166 |
| 11. | యక్ష రాక్షస యుద్ధము ... 12. రావణుడు | 167 |
| 13 | వేదవతి | 168 |
| 14. | మరుత్తుడు ... 15. అనరణ్యుడు | 169 |
| 16. | యముడు ... 17. నివాతకవచులు 18. విద్యుజ్జిహ్వుడు | 170 |
| 19. | కాలకేయులు ... 20. వరుణుడు | 171 |
| 21. | కన్యల శాపము ... 22. శూర్పణఖ | 171 |
| 23. | మేఘనాదుడు 24. మధువు, 25. రంభ | 172 |

| | | |
|---|---|---|
| 26. | దేవేంద్రుడు | 174 |
| 27. | ఇంద్రుడు - వైష్ణవయాగము | 176 |
| 28. | కార్తవీర్యార్జునుడు | 177 |
| 29. | వాలి | 178 |
| 30. | హనుమంతుడు | 180 |
| 31. | వీడ్కోలు | 182 |
| 32. | గర్భవతి | 183 |
| 33. | లోకుల పలుకులు | 184 |
| 34. | పరిత్యాగము | 185 |
| 35. | భృగుమహర్షి శాపఫలము | 189 |
| 36. | నృగమహారాజు ... 37. నిమిచక్రవర్తి | 191 |
| 38. | అగస్త్యుడు, వశిష్ఠుడు – కుంభసంభవులు | 192 |
| 39. | మిథిల ... 40. యయాతి | 193 |
| 40. | శత్రుఘ్నుని జైత్రయాత్ర | 194 |
| 41. | కల్మాషపాదుడు | 195 |
| 42. | కవలబిడ్డలు | 196 |
| 43. | లవణాసురవధ | 197 |
| 44 | మధురగానము | 198 |
| 45. | అయోధ్య ... 46. శంబూకుడు | 199 |
| 46. | జలశయన వ్రతము | 200 |
| 47. | రత్నహారము | 201 |
| 48. | దండకారణ్యము | 202 |
| 49. | సమాలోచనము | 203 |
| 50. | ఇళుడు – ఇళ | 305 |
| 51. | అశ్వమేధము | 207 |
| 52. | రామాయణము ... 53. మహాసభ | 208 |
| 54. | సీతారాములు | 210 |
| 55. | సీతారామకళ్యాణ ఘట్టము | 211 |
| 56. | వాల్మీకి మహర్షి పలికినవి ఇటులు | 216 |



శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ గాయత్ర్యై నమః

## కుశలవులు

### గానమొలికించిన

# శ్రీ రామాయణ కథాసుధ

## ప్రవేశిక :

శ్రీ సీతారామచంద్రుల దివ్యచరిత్రను కుశలవులు మధురాతి మధురముగ గానము చేయుచుండిరి. అయోధ్యాపురవరమునందును, యజ్ఞవాటికలందును, కూడలి స్థానములందును వారిగానము మిన్ను ముట్టుచుండెను. పౌరులు, జానపదులు, మునులు, యోగులు, రాజకుమారులు, రామునిమంత్రులు, సామంతులు ఒకరననేల ఆబాలగోపాలము కుశలవుల సంగీతసరళికి అచ్చెరువొందుచుండిరి. శ్రీరామకథామృతమును తనివిదీర గ్రోలుచు తన్మయులగుచుండిరి. ఇందుకు కారణము సీతారాముల దివ్యచరిత్రమునందుగల విశిష్టతయా? లేక బాలకుల గానకళాపటిష్ఠతయా? ఏమో, ఇవి రెండును కారణములు కావచ్చును. అందుకు సందియమందనేల?

గానమాధుర్యము మాట అటుండనిండు. ఏమి యా బాలకులిద్దర రూపరేఖాసౌకుమార్యములు! ఇరువురును కవలవలెనున్నారు. అచ్చుగ్రుద్దినట్లు ఒకే పోలికనున్నారు. పూర్ణచంద్రునిబోలిన గుండ్రనైన ముఖములు. చెంపకు చేరడేసికనులు. అద్దములవలె నిగనిగలాడు చెక్కిళ్లు. చుక్కానివంటి ముక్కు. దానిమ్మగింజవంటి పలువరుస. దొండపండునుబోలిన పెదవులు. విశాలమైన నుదురు. ఒకే

ప్రపంచములో మొదటిశ్లోకము. ఆయనకే ఇది ఆశ్చర్యముగా నుండి దానినే మననము జేసికొనుచు ఆశ్రమము చేరెను. ఇంతలో చతుర్ముఖుడైన బ్రహ్మ అచటికి వచ్చెను. వాల్మీకి అర్ఘ్యపాద్యాది గౌరవములతో బ్రహ్మను గౌరవించెను. "నా అనుగ్రహమువలననే నీకాశ్లోకము వెలువడినది. దీనినాధారముగ సకలగుణాభిరాముడైన శ్రీరాముని చరితమును రచింపుము. నీకీర్తి చిరస్థాయిగ నుండగలదు." అని దీవించి బ్రహ్మ అంతర్ధానమయ్యెను.

భగవదనుగ్రహమునకు పాత్రుడైన వాల్మీకిమహర్షి రామకథనంతయు మననముజేసికొని రత్నాకరమువంటి శ్రీమద్రామాయణ మహాకావ్యమును రచించెను. ఇందు ఇరువదినాల్గువేల శ్లోకములుకలవు, బాలకాండ, అయోధ్యాకాండ, అరణ్యకాండ, కిష్కింధకాండ, సుందరకాండ, యుద్ధకాండ మరియు ఉత్తరకాండ అను ఏడు భాగములుగ నుండెను. దీనినే కుశలవులకు నేర్పి గానముచేయించెను.

. ఈరామాయణ రచనమునాటికి సీతాదేవి వాల్మీకిమహర్షి ఆశ్రమముననే యుండెను. నిజమునకిది సీతయొక్క చరిత్రము. అయోనిజయు, జనకమహారాజు అనుంగుబిడ్డయు, దశరథమహారాజు కోడలును, శ్రీరామచంద్రుని ఏకైకపత్నియునగు సీతాదేవి పతివ్రత అయ్యును, మహాసాధ్వి అయ్యును, నారీశిరోమణి అయ్యును అనేక కష్టములకు లోనై, కడగండ్లపాలయి జీవితము గడపుచుండుటగాంచి, హృదయము ద్రవించి సీతయొక్క పవిత్రచరిత్రను లోకమునకు చాటవలెనని వాల్మీకి మునిచంద్రుని ఆశయము. అనుపమానమైన రచనము, మానవజీవితమునకు దర్పణము; మానవకోటికి ఆదర్శప్రాయము.

3 ఎవరీ వాల్మీకి ? మొదట బోయవాడేనా ?

పూర్వము భృగుపుత్రుడగు ప్రచేతసుడనువానికి పదియవ సంతానము ఋక్షుడు. ఈఋక్షుని వరుణ, చర్షిదంపతులు పెంచిరి. ఋక్షుడు చాలాకాలము తపస్సుచేయుటచే ఆయనపై వల్మీకము (పుట్ట) పెరిగెను.

తపస్సిద్ధి పొందినతరువాత వల్మీకమునుండి బయటకు వచ్చెను. అందు వలన బ్రహ్మ ఆయనకు వాల్మీకి యని పేరుబెట్టెను. ప్రచేతసుని కుమారుడగు వాల్మీకి బాల్యమునుండియు సత్ప్రవర్తనము కలవాడు; తపస్సంపన్నుడు. ఉత్తమవంశమున బుట్టినవాడు. మనోవాక్కర్మలయందు పాపములం జేసియెఱుగడు.

మొదట చిత్రకూటపర్వతప్రాంతమున ఆశ్రమమునందు వాల్మీకి యుండెడివాడు. సీతారాము లరణ్యవాసము వచ్చినతరువాత తమ తపస్సునకు భంగము కలుగునేమోయని చాలమంది మునులు చిత్రకూటము వదలి వెళ్ళిరి. అట్లు వెడలినవారిలో వాల్మీకియు గలడు. ఈయన తమసానదీతీరమున ప్రశాంతమగు ప్రదేశమున ఆశ్రమము నిర్మించుకొని అందుండసాగెను. సీతాదేవి రామునిచే విడువబడినపుడు ఈ ఆశ్రమముననే వాల్మీకి ఆశ్రయమును పొందెను. ఇచటనే కుశలవులు జనించిరి.

వల్మీకమునుండి బయల్వెడలిన ప్రతివానిని వాల్మీకియని పిలువవచ్చును. కృణుడను ఋషియొక్క కుమారుడు బోయవాడయి, బాటసారుల బాధించి ధనమార్జించెడివాడు. నారదుని యుపదేశమువలన ఇతడు దుర్వృత్తి మానుకొని సద్వర్తనుడయి యుండును. ఇతడు రామాయణ రచయిత కాదు.

4. రామకథామృతము.

వాల్మీకి శిష్యులిద్దఱు రామకథామృతము సందఱకు పంచుచుండుట శ్రీరాముని చెవినిబడెను ఆబాలకులను పిలిపించెను. వారి మధుర గానము వీనులవిందుగ వినుటకేర్పాట్లు గావించెను. ప్రతిదినమును నిర్ణీత కాలమునకు శ్రోతలు మహాసభను జేరుచుండిరి కౌసల్య, సుమిత్ర, కైకేయి మున్నగు అంతఃపురాంగనలతో గల నిండుసభయందు, రఘురామునియెదుట, వాల్మీకిమహర్షి యనుజ్ఞపై ప్రతిదినమును శ్రీమద్రామాయణమును గానము చేయుచుండిరి.

"తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాంవరమ్
నారదం పరిప్రపచ్ఛ వాల్మీకిర్ముని పుంగవమ్."

అను బాలకాండమునందలి ప్రథమశ్లోకము మొదలు కుశలవులు వినిపింపసాగిరి.

# బాలకాండము

వైవస్వతమనువు భూమండలమును మొదట పాలించెను. ఆయన తరువాత ఇక్ష్వాకు వంశీయులు పాలించిరి. సరయూనదీతీరమున కోసల దేశముకలదు. దానికి రాజధాని అయోధ్య. దీనిని మనువు నిర్మించెను, పన్నెండు యోజనముల పొడవు, మూడు యోజనముల వెడల్పునుగలిగి తీర్చిదిద్దిన విశాలములైన వీధులతో అయోధ్యానగరము విరాజిల్లుచుండును. ఆపట్టణము చుట్టును బలమైన ప్రాకారమును, దానివెంట లోతైన అగడ్తయు గలదు.

ఆపట్టణమున బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణములవారును ధర్మనిరతులై యుందురు. దేశమున కఱవనునది యెఱుగక ప్రజలు సుఖసంతోషములనుండిరి. పాడిపంటలకు లోటులేదు.

ఇక్ష్వాకువంశమున ప్రసిద్ధులైన రాజులు పెక్కురు గలరు. వారిలో దశరథుడు ఒకడు. ఆయన ధర్మప్రభువు. ఆమహారాజువద్ద ఎనమండుగురు మంత్రులుండెడివారు. వీరును ప్రభువునకు ప్రియమును, హితమును జెప్పుచు న్యాయమార్గమును దప్పనివారు. వశిష్ఠుడు ఆమహారాజునకు పురోహితుడు.

దశరథమహారాజునకు ముగ్గురు భార్యలు. కౌసల్య, సుమిత్ర, కైకేయి. అతడు సర్వసౌఖ్యము లనుభవించుచు అరువదివేల వత్సరములు ధర్మపాలన మొనర్చెను. కాని సంతానములేని కొఱతమాత్రము బాధించుచుండెను. వంశకరులగు పుత్రులకొఱకై వశిష్ఠవామదేవాది పురోహితుల ననుజ్ఞనుపొంది అశ్వమేధయాగముచేయ సంకల్పించెను. ఈయజ్ఞము ఋష్యశృంగునితో చేసిన శుభప్రదమగునని సుమంత్రుడు విన్నవించెను.

అంగదేశమును రోమపాదుడనురాజు పాలించుచుండెను. అతడధర్మవర్తనుడగుటచే దేశమున క్షామము సంభవించెను. ఆరాజు పురోహితుల బిలిపించి క్షామమును రూపుమాపు హితవొసగ వేడుకొనెను. వారిట్లు హితవొసగిరి. "విభండక పుత్రుడగు ఋష్యశృంగు డను మహానుభావుడు అరణ్యముల నున్నాడు. అతడు అశుభము శుభము లెఱుగని పవిత్రుడు. ఆయనను రప్పించి మీ కుమార్తెయగు శాంత నిచ్చి వివాహము జేయుడు. తప్పక కఱవు నశించును."

వేశ్యాంగనల కొందఱను రోమపాదుడు ఋష్యశృంగుని వద్దకు బంపెను. ఆడి, పాడి ఋష్యశృంగుని మెప్పించి రాజుకడకు ఆయనను తీసికొనివచ్చిరి. ఆమునిపుంగవునకు శాంతనిచ్చి రాజు పరిణయము జేసెను. వర్షములు కురిసి దేశము సస్యసమృద్ధమయ్యెను.

ఈ విషయమంతయు దెలిసికొనిన దశరథుడు ఋష్యశృంగుని, ఆయనపత్నియగు శాంతను ఆహ్వానించెను. ఆదంపతులు వచ్చి కొంతకాలము యోధ్యయందుండిరి. అశ్వమేధయాగమును చేయించవలసినదని దశరథుడు ఋష్యశృంగుని ప్రార్థించెను. సరయూనదికి ఉత్తరభాగమున యజ్ఞవాటికను నిర్మింపజేసి, దశరథుని కోరికననుసరించి ఋష్యశృంగుడు అశ్వమేధయాగమును సంపూర్తి చేయించెను.

ఒకనాడు దశరథుడు సంతానములేని కొఱతను దీర్చుటకేదేని మార్గాంతరమును సెలవీయుడని ఋష్యశృంగుని వేడుకొనెను. 'పుత్రకామేష్టి' అనుయాగమును జేయవలసినదని చెప్పి, తానేయాగమును చేయించెదనని వాగ్దానమొసగెను. దశరథమహారాజు నిష్ఠాగరిష్ఠుడై హోమమును జేయుచుండెను. హోమగుండమునుండి ఒకపురుషుడు బయల్వెడలి, పాయసముతో నిండియున్న ఒక బంగారు కలశమును దశరథునకిచ్చి అంతర్ధానమయ్యెను.

దైవదత్తమును, సంతానదాయినియునగు ఆ పాయసమును కౌసల్యకు సగమును, మిగిలిన సగములో సగము (అనగా పావు) సుమిత్రకును, మిగిలిన పావులో సగము కైకకును, ఇంకను మిగిలిన ఎనిమిదవ వంతు మరల సుమిత్రకును దశరథ మహారాజు పంచియిచ్చెను. వారలా పాయసమును భక్తిశ్రద్ధలతో భుజించిరి; గర్భవతులైరి.

దేవతల మొఱ విష్ణుమూర్తి అభయము:

దశరథుని పుత్రకామేష్టియందలి హవిర్భాగముల నందుకొనుటకై దేవతలందరును స్వర్గలోకమున సమావేశమై రావణుడు చేయుచున్న ఘోరకృత్యముల గూర్చి బ్రహ్మతో విన్నవించిరి. బ్రహ్మాదిసురలెల్లరు శ్రీమన్నారాయణునితో మొఱపెట్టుకొని రావణుని అంతమొందించు నుపాయమాలోచింప వేడుకొనిరి. నరులచేగాక మిగత దేవ, గరుడ, గంధర్వ, యక్ష, రాక్షసులచే మరణము లేకయుండు వరముల బడసిన రావణుని సంహరింప నారాయణుడు నరజన్మమెత్త వలసిన యవసరము వచ్చెను. దేవతలనందఱ సహాయము కూర్ప వానరులై బుట్టుడని విష్ణువు కోరెను. అప్పటికే బ్రహ్మ ఆవలించిన సమయమున జాంబవంతుడు అయోనిజుడై జన్మించియుండెను. వాలి, సుగ్రీవుడు, హనుమంతుడు మున్నగు వానరశ్రేష్ఠులును, వారి నాశ్రయించుకొనియుండు వానరులును బహుసంఖ్యలో జన్మల నొందియుండిరి.

శ్రీరామ జననము

పండ్రెండు మాసములు గడచినపిదప చైత్రశుద్ధ నవమి పునర్వసు నక్షత్రమున, గ్రహసంపద బలముగనున్నతఱి కౌసల్య రాముని కనెను. మరునాడు భరతుని కైకయు, లక్ష్మణశత్రుఘ్నులను సుమిత్రయు కనిరి. దశరథుడును, మంత్రిసామంతాదులును, ప్రజలును మిక్కిలి సంతోషించిరి. చిన్ననాటను నుండియు రామునియెడల లక్ష్మణునకు అనురాగము మెండు.

భరత శత్రుఘ్నులకు కలయిక అధికము. నలుగురు బాలురును దినదిన ప్రవర్థమానులై విద్యాభ్యాసంగముల నారితేరి, బుద్ధిమంతులును జ్ఞానవంతులును అయి మెలగుచుండిరి. దశరథుని యానందమునకు మేర లేకుండెను.

విశ్వామిత్రుని రాక

ఒకనాడు దశరథుడు నిండుకొలువున్న సమయమున విశ్వామిత్రుడు వచ్చెను. దశరథుడు విశ్వామిత్రుని సకలవిధముల పూజించెను. "మహర్షీ ! మీరాకవలన నాగృహము పావనమైనది. వచ్చినపని సెల విండు, తప్పక నెరవేర్చెద" ననెను. గాధినందనుడు సంతసించి 'రాజా ! నేను కేయు యాగమును రావణుని అనుచరులు మారీచసుబాహులు మున్నగురాక్షసులు ధ్వంసముచేయుచున్నారు. ఆ దుర్మార్గులనుండి కాపాడి యజ్ఞము కొనసాగించుటకు సత్యపరాక్రముడగు నీ కుమారుని రాముని నావెంట పంపు మనెను, రాజు నిశ్చేష్టుడయ్యెను. 'రాముడు బాలుడు అతడేమి చేయగలడు? నేనుగాని సైన్యముగానివచ్చి నీయజ్ఞ రక్షగావింతు' మనెను విశ్వామిత్రునకు కోపమువచ్చి రఘువంశమున నీవంటి అసత్యవాది మరిలేడ ననెను. 'రాముని విషయమునాకు తెలియును. విశ్వామిత్రుడు అస్త్రశస్త్ర విద్యాపారంగతుడు, రాముని పంపుము. మేలుగలుగు' నని వశిష్ఠుడు హితవొసగెను. దశరథుడు రామలక్ష్మణు లను విశ్వామిత్రునివెంట బంపెను.

బల అతిబల విద్యలు

వారు సరయూనదీ తీరమున ఒకటిన్నర యోజనములు నడచి పెళ్ళిరి. ఆచమనముచేసి శుచివికమ్మని విశ్వామిత్రుడు రామునికోరెను. రామునకాఋషి బల, అతిబల అను విద్యల నుపదేశించెను. వీనిని జపించిన ఆకలిదప్పులు కలుగవు, బడలికఉండదు. రాక్షసులనుగూడ జయించు శక్తి కలుగునని ఋషి చెప్పెను. గురుశిష్యు లారాత్రి అచటగడపిరి. తెలతెలవారు చుండెను.

'కౌసల్యా సుప్రజా, రామ! పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల, కర్తవ్యం దైవమాహ్నికం'

అనుచు విశ్వామిత్రుడు రాముని నిద్రమేల్కొల్పెను. కాలకృత్యముల దీర్చుకొని మరి నడువసాగిరి. సరయూనది గంగలో కలియు తావునకు చేరిరి.

మ న్మ థు ని ఆ శ్ర మ ము

పూర్వము శివుడు తపస్సు చేయుచుండగా మన్మథుడు పూల బాణములచే తపస్సు భంగముచేసెను. శివుడు కోపించి మూడవకన్ను దెరచెను. మన్మథుడు బూడిద అయ్యెను. నాటినుండి మన్మథుడు అనంగుడయ్యెను. ఈప్రదేశము అంగదేశమని ప్రసిద్ధిచెందెను. ఇది వాని ఆశ్రమమని విశ్వామిత్రుడు చెప్పెను ఆరాత్రి వారట గడపిరి.

తా ట క వ ధ

తెల్లవారినది, స్నానసంధ్యలు ముగించుకొని మరికొంతదూరము పోయిరి. భయంకరాకారముతో తాటక ఎదురయ్యెను. సుకేతుడను యక్షునికూతురు తాటక. సుందునిభార్య. దుష్టకృత్యము లొనరించిన సుందుని అగస్త్యముని సంహరించెను. తాటక అగస్త్యుని మ్రింగబోయెను. ఈమె కుమారుడే మారీచుడు; అతడు తల్లిని అనుసరించెను. అగస్త్యుని శాపమువలన తల్లియు,పుత్రుడును రాక్షసులైరి తాటక వెయ్యి ఏనుగుల బలముకలది. అనేకమంది సాధువులను హింసించుచున్నది; దీనిని చంపుమని విశ్వామిత్రుడు రామునకు చెప్పెను. స్త్రీని వధించుటకు రాముడు సందేహించెను. కాని విశ్వామిత్రుని యనుజ్ఞపై దుష్ట సంహారము పాపహేతువు కాదని తెలిసికొని రాముడు తాటకను బాణముతోకొట్టి చంపెను. ఆరాత్రి వారచట గడపిరి.

## దివ్యాస్త్రములు

మరునాడుదయమున శుచియై నిలిచిన రామునకు విశ్వామిత్రుడు అనేకరకములు, మిక్కిలి శక్తివంతములు దేవతలను సహితము నెదిరించగలవియునగు దివ్యాస్త్రములను, వాని ఉపసంహారకములను ఉపదేశించెను. అవియన్నియు రాముని ఆ మేయి మెలగుచుండెను. పిమ్మట వారు మరికొంతదూరము నడచివెళ్ళిరి.

## విశ్వామిత్రుని ఆశ్రమము-యాగసంరక్షణ :

పూర్వము బలిచక్రవర్తిని వామనవతారమున విష్ణువు మూడడుగుల భూమి నర్థించి పాతాళలోకమునకు అణచివైచిన ప్రదేశము. ఇచటనే వామనుడు తపముచేసెను. విష్ణువు నారాధించి అదితివలన కాశ్యపుడు వామనుని తన కుమారుడుగా బడయగలిగెను. అందుచే నిది సిద్ధాశ్రమమనబడెను. ప్రస్తుతమిచటనే విశ్వామిత్రుడు ఆశ్రమ మేర్పరచుకొని యజ్ఞముచేయుచుండెను.

గాధినందనుడగు విశ్వామిత్రుడు యజ్ఞదీక్షలో నుండెను. ప్రజ్వలించుచున్న అగ్నియందు మారీచ సుబాహులు తమ అనుచరులతో వచ్చి రక్తమాంసముల గురిపింపసాగిరి. రాముడు విడచిన మానవాస్త్రమునకు మారీచుడు కొట్టుకొనిపోయి దక్షిణసముద్రమందుపడెను. ఆగ్నేయాస్త్రమున సుబాహుని, వాయువ్యాస్త్రమున మిగిలిన రాక్షసులను చంపెను. యజ్ఞము నిర్విఘ్నముగ సంపూర్తియైనందులకు విశ్వామిత్రుడును తదితరమునులును సంతసించిరి.

## శివధనుస్సు

మిథిలానగరాధిపుడైన జనకుడు యజ్ఞముచేయదలపెట్టెను. ఆయనవద్ద అద్భుతమైన ధనుస్సు కలదు. దేవతలుకూడ దాని నెక్కుపెట్టజాలరు మీరు నావెంటవచ్చిన ఆగొప్ప ధనువును చూడవచ్చును. నేనిక హిమాలయములకువెళ్ళి తపముచేయుదలచితిని. కనుక మిథిలకు

నా వెంటరండని రామలక్ష్మణులను తోడ్కొని విశ్వామిత్రుడు మిథిలకు బయలుదేరెను. దారిలో అతడు రామలక్ష్మణులకు అనేక పురాతన వృత్తాంతములను చెప్పుచు ఉల్లాసము కలిగించెను.

కుశనాభుడు :

బ్రహ్మయొక్క కుమారుడు కుశుడు ఇతడు ధర్మజ్ఞుడు. తపోధనుడు. విదర్భరాజు కుమార్తెను వివాహమాడెను. ఆమెవలన కుశునకు నలుగురు కుమారులు కలిగిరి. వారిలో కుశనాభుడు ఒకడు.

కుశనాభుడు మహోదయము అనుపట్టణమును నిర్మించుకొని రాజ్యమేలెను. ఇతడు ఘృతాచి అను అప్సరసాంగనను పరిణయమాడెను. ఆమెవలన నూర్గురు కుమార్తెలు కలిగిరి వారందరును మంచి అందమైనవారు. ఒక దినమున వారు వనవిహారము చేయుచుండగా వాయుదేవుడు వారి అందచందములను బరికించి తనను పెండ్లియాడుమని కోరెను. కాని వారందరు అంగీకరించలేదు. "మేము కుశనాభుని కుమార్తెలము. మాకు తండ్రి, ప్రభువు, దైవమును ఆయనయే. ఆయన ఆజ్ఞను మేము శిరసావహింతుము. ఎవరికిచ్చి పెండ్లియొనర్చిన అతనినే మేముభర్తగా కొలిచెదము" అనిరి. అందులకు వాయుదేవుడు కినిసి నూరుగురు కన్యలను కురూపులగునట్లు శపించెను.

కన్యలు నూరుగురును పోయి జరిగిన విషయమంతయు తండ్రితో విన్నవించిరి. కుశనాభుడు వాయుదేవునిపై కోపగింపక తన కుమార్తెల సహనగుణమునకు సంతసించెను.

గూని, కురూపులైనను బ్రహ్మదత్తుడు వివాహమాడ నంగీకరించెను. కుశనాభుడు నూరుగురు పుత్రికలను బ్రహ్మదత్తుడను రాజునకిచ్చి పెండ్లిచేసెను. బ్రహ్మదత్తుని చేతికుటతోడనే కురూపులగు కన్యలు సురూపులుగా మార్పునొందిరి. వారెల్లరును సుఖముగనుండిరి.

పుత్రకామేష్ఠిజరిపి కుశనాభుడు ఘృతాచివలన గాధియను కుమారుని బడసెను గాధికి ఒక కుమారుడు, ఒక కుమార్తెయు కలిగిరి. ఆ

కుమారుడే విశ్వామిత్రుడు! అక్కయగు సత్యవతి, భర్తతో సశరీరముగ స్వర్గమునకు బోయెను. పిమ్మట ఆమెయే కౌశికయనునదియై భూమి పైకి వచ్చెను.

తనచుట్టునుచేరి వినుచున్న రామలక్ష్మణులకును, తదితరమును లకును విశ్వామిత్రుడు మరియు నిట్లు చెప్ప దొడగెను.

హి మ వ ం తు డు :

మేరుపర్వతుని కుమార్తెయగు మనోరమను హిమవంతుడు పెండ్లాడెను. ఆమెవలన నిద్దఱు కుమార్తెలు కలిగిరి పెద్దకుమార్తె గంగ, చిన్నకుమార్తె ఉమ. దేవతలు గంగను తమకు నివ్వమని హిమవంతుని కోరగా లోకకళ్యాణార్థము గంగను దేవతలకిచ్చెను. ఆగంగయే స్వర్గమర్త్య పాతాళలోకముల బ్రవహించి ముల్లోకములకు మేలొనర్చి 'త్రిపథగ' యను ప్రసిద్ధనామము పొందెను.

స గ ర చ క్ర వ ర్తి :

పూర్వము ఒకప్పుడు సగరుడనురాజు అయోధ్యను పాలించు చుండెను ఆయనకు కేశిని, సుమతి యను నిరువురు భార్యలుండిరి. వారికి సంతానము లేకుండుటచే సగరుడు భార్యలతో హిమవత్పర్వత ప్రాంతమునకుబోయి నూరుసంవత్సరములు తపస్సుచేసెను. వారికి భృగు మహర్షి ప్రత్యక్షమయ్యెను. ఒక భార్యకు వంశోద్ధారకుడగు ఒక్క కుమారుడును, వేరొకభార్యకు అరువదివేలమంది పుత్రులును కలుగుదు రని చెప్పెను. ఎవరికెట్లు కావలయునో కోరుకొమ్మని యనగా పెద్ద భార్యయగు కేశిని ఒక్కకుమారుని, చిన్న భార్యయగు సుమతి అరువది వేలమంది సుతులను కోరుకొనిరి.

భృగుమహర్షి యనుజ్ఞ ననుసరించి సంతానము కలిగెను. కేశిని కుమారుడు అసమంజసుడు. ఇతడు దుర్జనుడై అసమంజస వర్తను డయ్యెను. సుమతి బిడ్డలను బాధించెడివాడు, సజ్జనులను మానులను

హింసించుచుండెడివాడు. ధర్మప్రవర్తకుడగు సగరచక్రవర్తి కుమారుని దుర్మార్గములను చూచి సహింపలేక తన రాజ్యమునుండి వెడలగొట్టెను. అసమంజసునకు అంశుమంతుడను కుమారుడుండెను. ఇతడు బుద్ధిమంతుడే గాక పరాక్రమశాలియు నయ్యెను.

యజ్ఞాశ్వము :

సగరచక్రవర్తి అశ్వమేధయాగముచేసి యజ్ఞాశ్వమును వదలెను. దానివెంట మనుమడగు అంశుమంతుని, కొంత పరివారమును, ఋత్విక్కులను బంపెను. అందఱను కన్నుగప్పి దేవేంద్రుడా యజ్ఞాశ్వమును దొంగిలించుకొనిపోయెను. అశ్వము లేనిది క్రతువు సంపూర్తికాదు గనుక సగరుడు అరువదివేలమంది మనుమలను బిలిచి యజ్ఞాశ్వమును వెదకి ఎచ్చటనున్నను తీసికొనిరండని ఆజ్ఞాపించెను.

అరువదివేలమంది సోదరులు గుఱ్ఱమునకై భూమియంతయు గాలించిరి. కాని కన్పింపలేదు. భూమినంతయు త్రవ్వి పాతాళమునకు బోదలచిరి. గునపములు, శూలములు, నాగళ్ళు, గోళ్ళు ఆయుధములుగా వారొక్కొక్కరు ఒక్కొక్క యోజనమువంతున త్రవ్విరి. పాతాళమునకుబోయిరి. అచట దిగ్గజములు కన్పింపగా వానికి ప్రదక్షిణ నమస్కారము లాచరించిరి. పాతాళమునందే కపిలమహర్షి యాశ్రమము కన్పించెను. ఆశ్రమమునందు కట్టివేయబడియున్న యజ్ఞాశ్వము సహితము కన్పించెను. కపిలుడే దొంగయని భావించి కేరింతలువైచిరి. తపస్సు భంగమైన మహర్షి సగరుని మనుమలు భస్మమగునట్లు శపియించెను. వెంటనే వారందఱును భస్మరాసులై పోయిరి.

చాలకాలమువఱకును కొడుకులు రాకుండుటచే వారిజాడ తెలిసికొనవలసినదని సగరుడు అంశుమంతునిబంపెను. పాతాళమున వెదకుచుబోగా అంశుమంతునకు దిగ్గజములు, కపిలుని ఆశ్రమము, యజ్ఞాశ్వము, సమీపమున భస్మరాసులు కన్పించెను. మరణించిన పినతండ్రులకు తర్ప

ణము వదలుటకైనను అంశుమంతునకు నీరు కన్పింపలేదు. సాగరుల మేనమామయగు గరుత్మంతుడు గన్పించి అంశుమంతునితో నిట్లు చెప్పెను. "కుమారా! విచారింపకుము. దైవికముగ నీ పినతండ్రులు కపిలుని శాపమునకు గురియై మరణించిరి. స్వర్గమందలి గంగను దీసికొని వచ్చి యీ బూడిదకుప్పలను ముంచివేయుము. వారికి సద్గతికలుగును. మరియే యితర జలముతోను తర్పణము నిడకుము" గరుడుడు చెప్పిన చొప్పున యజ్ఞాశ్వమును విడిపించుకొని తాతయగుసగరునికడకువచ్చెను. అశ్వమేధము సంపూర్తి యయ్యెను.

సగరుడు ముప్పదివేల సంవత్సరములు రాజ్యమేలి దివికేగెను. పిమ్మట అంశుమంతుడు ప్రజానుమతంబున రాజ్యముచేసెను. తదుపరి ఆయన కుమారుడు దిలీపునకు రాజ్యమునకువచ్చెను. అంశుమంతుడు ముప్పదిరెండువేల వర్షములు తపస్సుచేసి స్వర్గమునకు పోయెను.

దిలీపుడు :

అంశుమంతుని కుమారుడు దిలీపుడు, పరాక్రమశాలియై అనేక యజ్ఞములుచేసి, ధర్మపరిపాలన మొనర్చి ముప్పదివేల సంవత్సరముల పిమ్మట కుమారుడగు భగీరథునకు పట్టముగట్టి సురలోకమునకు జేరెను,

భగీరథుడు :

భగీరథునకు సంతానములేదు. రాజ్యపరిపాలనా భారము నంతయు బుద్ధికుశలురగు మంత్రులయెడనిడి తపస్సుచేయ గోకర్ణక్షేత్రమునకు బోయెను. అతడచట వేలవత్సరములు తపస్సుచేయగా బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. వరములను కోరుకొనుమనెను.

"స్వర్గమునందలి గంగ తనకు పితరులైన సాగరులను భస్మరాసులుగనున్న వారిని తడపునట్లును, తనకు సంతానమును ప్రసాదింపుము" అనియు భగీరథుడు కోరుకొనెను. బ్రహ్మ అంగీకరించెనుకాని గంగ భూమిపైకి వచ్చినప్పు డాతాకిడిని భూమి భరింపలేదుకనుక శంకరుని గూర్చి తపస్సు జేయుము; అతడు భరించునని చెప్పెను.

భగీరథుడు బొటనవ్రేలిపై నిలిచి ఒకసంవత్సరము శివునికొరకై ఘోర తపస్సు నాచరించెను. శివుడు ప్రత్యక్షమై భగీరథుని కోర్కె నెరవేర్తుననియెను.

శ్లో॥ తతో హైమవతీ జ్యేష్ఠా సర్వలోక నమస్కృతా
తదా సాఽతి మహద్రూపం కృత్వా వేగంచదుస్సహమ్.

శా. అంగుష్ఠాగ్రము నేలమోపి తపమేకాబ్దంబు నిండంగ జే
యంగన్ దర్పకవైరి వచ్చి పరితుష్టాత్ముండ నైతిన్ వియ
ద్గంగన్ దాల్చెద మౌళి నా నప్పుడు రంగత్తుంగ భంగత్వరన్
గంగాసింధువు నింగినుండి వడియెన్ గౌరీశు జూటంబునన్.

(భాస్కర రామాయణము)

స్వర్గలోకమునందలి గంగాభవాని దుస్సహమైన వేగముతో వచ్చి శంకరుని జటాజూటమునందు పడెను.

భగీరథుని కోరిక ననుసరించి గంగ శివునితో సహా పాతాళము నకు ప్రవహింప నుత్సహించెను. గర్వితమతియైయున్న గంగను అరికట్ట వేయుదలచి శంకరుడు తన జటాజూటమునందే గంగను బంధించి కదల నీయడయ్యెను. ఇంత ప్రయత్నించినను పాతాళమునకు గాని గంగను గానక కొంతకాలమైనపిదప భగీరథుడు మరల శంకరునిగూర్చి తపస్సు జేసెను. శంకరుడందులకు మెచ్చి బ్రహ్మనిర్మితమైన సరస్సునకు గంగను వదలెను.

ఆ సరోవరమునుండి గంగ ఏడుపాయలుగా చీలి ప్రవహించెను. అందు హ్రాదిని, నళిని, పావని అను మూడు ప్రవాహములు తూర్పు దిక్కుగను, చక్షువు, సిత, సింధువు అను మూడు నదులు పడమర దిక్కుగను ప్రవహించెను, ఏడవదియగు గంగ భగీరథుని వెంట ప్రవహించెను. భగీరథుడు రథముపై ముందుబోవ, వెనుకనుండి గంగయు మహాభయంకరముగ జలచర సంయుక్తమై పరుగులు దీసెను. అటుల పోయిపోయి జహ్నుముని యజ్ఞవాటికను, ఆశ్రమమును ముంచివేసెను

ఆ మహర్షి కోపగించి గంగోదకము నంతయు త్రాగివైచెను. దేవగంధర్వమునిగణ మంతయు వచ్చి గంగను విడువుడని జహ్ను మహర్షిని ప్రార్థన జేసిరి. ఈగంగాదేవి నీకు కుమార్తెయై ప్రసిద్ధినొందగలదనియు నుడివిరి వారిప్రార్థన మంగీకరించి జహ్నుడు తన చెవినుండి గంగను బయటకు వదలెను. నాటినుండి గంగకు జాహ్నవియను పేరు కలిగెను.

పిమ్మట భగీరథుడు సముద్రముద్వారా పాతాళలోకమునకు జేరెను. జాహ్నవియు వెంబడించెను. కపిలమహర్షి ఆశ్రమసమీపమున గల భస్మరాసుల నన్నిటిని గంగ ముంచివైచెను. బ్రహ్మదేవుడువచ్చి భగీరథునితో ఇట్లనెను. "నీవలన నీపితరులందరును స్వర్గలోకమునకు బోయిరి ఈప్రవాహ మెంతకాలముండునో అంతకాలమును వారు స్వర్గసుఖముల ననుభవింతురు. ఈగంగ నీకుదుహితయై నీపేర భాగీరథియను నామమున ప్రసిద్ధినొందగలదు." పితామహుడంత బ్రహ్మలోకమునకు వెడలిపోయెను.

భగీరథుడు పితరులకు గంగాజలముతో తర్పణములు విడిచి తన పట్టణమునకుబోయి సంతసమున చిరకాలము రాజ్యమేలెను.

ఈవిధముగా స్వర్గ మర్త్య పాతాళలోకముల మూడింటియందును బ్రవహించి గంగ త్రిపథగ అనుపేరును బడసెను. ఈగంగావతరణమును గూర్చి విశ్వామిత్రుడు చెప్పి, "రామభద్రా! సూర్యాస్తమయమగుచున్నది. ఇక నీ సంధ్యాదికకృత్యముల నొనర్చుకొనుము." అనెను.

గంగయొక్క పూర్వవృత్తాంతమును దెలిసికొని శ్రీరాముడు మిక్కిలి సంతసించెను.

**క్షీరసాగరమథనము:**

మరునాడుదయమున వారందఱును గంగానదిని దాటి ఉత్తరపు టొడ్డును చేరిరి. అచటనున్న విశాలపురమును జేరి యీ పురమున కధిపతి యెవ్వరనియడిగిన రామునకు విశ్వామిత్రుడిట్లు చెప్పదొడగెను.

అమరులుగా నుండుటకును, అజరులుగా నుండుటకును అమృతమును గ్రోలుటుచితమని దేవతలు భావించిరి. అమృతమునకై పాల సముద్రమును మథించవలయునని యెంచిరి. దేవతలును, రాక్షసులును మందరపర్వతమును దెచ్చి, వాసుకి యను సర్పరాజమును దానికిచుట్టి కవ్వమును చిలికినట్లు చిలికిరి. పర్వతము మునుగనీయక విష్ణువు మహా కూర్మమై కొండక్రిందనుండెను. ఇట్టుల అనేకవత్సరములు మహా శ్రమతో చిలుకగా భయంకర జ్వాలలతో హాలాహలము జనించెను. దేవతలు ప్రార్థింపగా లోకకళ్యాణార్థము శంకరుడా విషజ్వాలలను కంఠమునందుంచుకొని గరళకంఠుడయ్యెను. పిదప మరి దీర్ఘకాలము మథింపగా, దండకమండలములు దాల్చి ధన్వంతరి ఉద్భవించెను. పిమ్మట అరువదికోట్ల మంది అప్సరసలు పుట్టిరి. వారెల్లరు వారకాంతలయిరి. వరుణుని కుమార్తెయగు సురపుట్టెను. ఆమెను దేవతలు చేపట్టిరి. అందుచే వారు సురలను పేరున ప్రఖ్యాతినొందిరి. చేపట్టనొల్లనివారు అసురులనబరగిరి. ఇంకను మథింపగా ఉచ్చైశ్శ్రవము, కౌస్తుభరత్నము, అమృతమును ఆవిర్భవించెను. అమృతమునకై దేవదానవులు గొప్ప యుద్ధము జేసిరి ఉభయపక్షములయందనేకమంది మరణించిరి. మహావిష్ణువు ఇదిచూచి మోహినిరూపమును ధరించి మాయచేసి అమృతభాండమును తీసికొనిపోయెను. విష్ణువునకును, అసురులకును యుద్ధము జరిగెను. దేవతలు విష్ణువునకు అండగానిలిచిరి. దేవేంద్రుడు దైత్యులను దునుమాడి సురలోకమును సుఖముగా పాలించుచుండెను. కుమారులందఱు చనిపోవగా దితిమిగులదుఃఖించెను. "నేను పుత్రులులేని దాననయితిని. ఇంద్రుని సంహరింపగల కుమారుని నాకొసగు"మని భర్తయగుకశ్యపుని ప్రార్థించెను. వేయిసంవత్సరములు శుచిగానుండి తపస్సుచేసినయెడల నీవుకోరినట్లు పుత్రుడు కలుగగలడని కశ్యపముని వచించెను. ఆమె అట్లె మిగులదీక్షతో గడపుచుండెను. ఇక వేయివత్సరములు ముగియనుండగా నొకనాడామె తలవిరియబోసికొని

శిరస్సును కాళ్ళకడను జేర్చి మధ్యాహ్న సమయమున నిద్రించు చుండెను. సమయము కనిపెట్టుకొనియున్న దేవేంద్రుడు దితి అశుచియైనదనికనుగొని ఆమెగర్భమున ప్రవేశించెను. గర్భస్థపిండమును ఏడు ముక్కలుగ నరికివేసెను, "మారుద, మారుద, ఏడువకుము, ఏడువకుము" అని గర్భముననున్న పిండముతోననెను. ఇంద్రునిబయటకు రమ్మని ఆమెపిలిచి ఏమియుశపింపక తన అపరాధమే ఇట్లు గావించెనని ఆమె విచారించెను.

తల్లికోరినప్రకారము ఇంద్రుడంగీకరింపగా, "మారుద" అని ఏడ్చుటవలన అవి మారుతములనపేర ప్రసిద్ధి నొందెను. అందు మొదటి మారుతము బ్రహ్మలోకమునందును, రెండవమారుతము ఇంద్రలోకము నందును, మూడవ మారుతము ఆకాశమునందును మిగిలిన నాలుగు మారుతములు నాలుగు దిక్కులందు దేవతామూర్తులై చరించుచుం డును." ఇటుల అవి సప్తమారుతములుగా ప్రసిద్ధివడసెను.

దితి తపస్సుజేసిన స్థానమేయిది. ఇక్ష్వాకువరు అలంబస యను నామెకు విశాలుడు కుమారుడై ఈప్రదేశముననున్న పట్టణమును పాలించుటచే విశాలపురమని ప్రఖ్యాతిజెందెను. విశాలుని వంశీయుడగు సుమతి ఇప్పుడీ పురమునేలుచున్నాడని విశ్వామిత్రుడు శ్రీరామునకు జెప్పెను.

విశ్వామిత్రాది మహర్షులరాకను దెలిసికొని సుమతియును నెదురువచ్చి దోడ్కొనిపోయి యతిథిసత్కారముల నొనర్చెను. ఆరాత్రి యుందుండి మరునాడు బయలుదేరి విశ్వామిత్రుడు రామలక్ష్మణులవెంట నిడుకొని మిథిలానగరమునుగూర్చి పయనమై వెళ్ళెను.

**అహల్య :**

వారలకు మార్గమధ్యమున పురాతనమగు నొక ఆశ్రమము కన్పించెను. రాముని కోరికపై విశ్వామిత్రుడు ఆ ఆశ్రమమునుగూర్చి చెప్ప దొడగెను. ఇది గౌతమమహర్షియొక్క ఆశ్రమము.

గౌతమునిభార్య అహల్య. ఒకనాడు గౌతముడులేనిసమయమున ఇంద్రుడురాగా, అహల్య దోషముచేసెనని తలచి గౌతముడామెను ఆహారములేక, వాయుభక్షణముజేయుచు బూడిదలో పడియుండుమని శపించెను. ఆమె శిలవలె పడియుండెను. గౌతముడు వెడలిపోయి మరి యొకచోట తపస్సు జేసికొనుచుండెను.

దశరథరాముడువచ్చినపుడు శాపవిముక్తి యగునని ప్రవచించిన గౌతమమహర్షి మాటప్రకారము ఇపుడు అహల్యకు శాపవిముక్తియై లేచెను. ఆసమయమునకు గౌతముడును అచటకువచ్చెను. అహల్యాగౌతములు రాముని పూజించిరి.

మిథిలకు :

విశ్వామిత్రుడును, రామలక్ష్మణులును మిథిలకుచేరిరి. జనకుడు విశ్వామిత్రుని గౌరవించెను. విశ్వామిత్రుడురామలక్ష్మణులను జనకునకు పరిచయము చేసెను.

జనకమహారాజునకు శతానందుడు పురోహితుడు. శతానందుడు అహల్యా గౌతముల కుమారుడు.

శతానందుని సంతోషము :

విశ్వామిత్రుని వెంటనున్న రామలక్ష్మణులగూర్చి మహర్షి చెప్పగా జనకమహారాజును, శతానందుడునువిని మిక్కిలి ఆనందించిరి. రాముని అనుగ్రహమువలన మరల తలిదండ్రులగు అహల్యా గౌతములు ఏకీభవించినందులకు శతానందుడు ముదమందెను, రామునికొనియాడెను విశ్వామిత్రుడు సామాన్య మహర్షి కాడనియు, సృష్టికి ప్రతిసృష్టి యొనర్చిన అపరబ్రహ్మయనియు నుడివి విశ్వామిత్రునిగూర్చి శతానందుడు శ్రీరామునకు వివరించి చెప్పెను.

హోమ ధేనువు :

కుశనాభుని కుమారుడగు గాధికి విశ్వామిత్రు డుదయించెను. తండ్రి తరువాత విశ్వామిత్రుడు అనేక వేల సంవత్సరములు రాజ్య

మేలెను. ఒకసారి సైన్యసమేతుడై భూమండలము నంతయు సందర్శింప నరిగెను. అటుల తిరుగుటలో వశిష్ఠమహర్షి ఆశ్రమమును సందర్శించెను. భూపాలుడగు విశ్వామిత్రునికి సకలవిధముల వశిష్ఠుడు గౌరవము నిచ్చెను. షడ్రసోపేతమగు భోజనము నిడినందులకు విశ్వామిత్రుడు సంతసించెను. వేలసంఖ్యలోనున్న పరివారమునకు ఇంతటి గౌరవము చేసినందులకు రాజు ఆశ్చర్యపడెను అందులకు కారణము వశిష్ఠునివద్ద గల శబళయను హోమధేనువని తెలిసికొనెను.

శబళను తన కిమ్మనియు, అందులకు అనేకవిధములగు ఆభరణములతో కూడిన లక్షగోవులను ఇచ్చెదననియెను. కాని విశ్వామిత్రుని కోరికను వశిష్ఠుడు తిరస్కరించెను.

శ్లో॥ ఏతదేవ హి మేరత్న మేత దేవహి మే ధనమ్
ఏతదేవహి సర్వస్వమేతదేవ హి జీవితమ్॥

ఇదియే నారత్నము. ఇదియే నాధనము, ఇదియే నాజీవితము, ఇదియే నాసర్వస్వము.'' కనుక దీనిని నేనువిడువనని మహర్షి చెప్పెను. కాని రాజు బలవంతముగా హోమధేనువును లాగికొని పోయెను. ఆ ధేనువు సైన్యము నెదుర్కొని చాలమందిని చంపి తిరిగివచ్చి వశిష్ఠమహర్షి పాదములపై బడి తనను రాజునకప్పగించి నందులకు విచారించెను. అతడు భూపాలుడు, బలవంతుడు ఆతని నెదుర్కొను శక్తి లేదని వశిష్ఠుడు చెప్పెను.

శబళ విజృంభించెను. దాని శరీరమునుండి అనేకవేల మ్లేచ్ఛులు, శకులు, యవనులు మున్నగువారు జనించిరి. వారు విశ్వామిత్రుని సైన్యమునణచివైచిరి. ఆవు అంబాయని అంకెవేసెను. కాంభోజులు పుట్టిరి. విశ్వామిత్రుకు కాంభోజులను నశింపజేసెను.

బాహుబలము, సైనికబలముకంటె మహర్షి ఆత్మబలమేగొప్పదిగా నుండుటకు విశ్వామిత్రుడు వగచెను. మిగిలియున్న ఒక్కకుమారునికి పట్టముగట్టి తపస్సుజేయుటకై హిమవత్పర్వతమునకు వెళ్లెను.

బ్రహ్మదండబలము:

విశ్వామిత్రుడు చేసిన తపస్సునకు మెచ్చి శంకరుడు ప్రత్యక్షమయ్యెను. సమస్త ధనుర్వేదము ప్రసాదింపుమని గాధేయుడు కోరగా శివుడు ప్రసాదించెను. ఇక నెదురుకత్తి లేదని తలచి విశ్వామిత్రుడు వసిష్ఠాశ్రమముపై అస్త్రప్రయోగ మొనర్చి ఆశ్రమమును చదును చేసెను. వసిష్ఠమహర్షి ఆగ్రహోదగ్రుడై బ్రహ్మదండముచేతబట్టి "నీవిక బ్రతుకజాలవు సుమా!" అనుచు నిలచెను. విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించినను బ్రహ్మదండముముందు నిరుపయోగమయ్యెను. శాంతింపవలసినదని దేవతలు వసిష్ఠమహర్షిని ప్రార్థించిరి. ఆయన శాంతించెను. విశ్వామిత్రునికిది ఓటమిగనుండెను. అతడిట్లనుకొనెను.

శ్లో॥ ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలం
ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతాని మే॥

క్షత్రియుని బలము ఏపాటిబలము? బ్రహ్మతేజస్సువలననైన బలమే బలము! నేను ప్రయోగించిన అస్త్రములనన్నిటిని ఒక్క బ్రహ్మదండము హత మొనర్చినదికదా! కానిమ్ము. నేనుమరల తపస్సుచేసి బ్రహ్మత్వము పొందుదును గాక! అని నిశ్చయించుకొని భార్యతో కూడ వెళ్ళి శరావతీనది దక్షిణతీరమున తపస్సుజేసెను. వెయ్యి సంవత్సరములు ఘోరమైన తపస్సుచేయగా బ్రహ్మప్రత్యక్షమై "రాజర్షులనందరిని జయించితివి" అని యదృశ్యుడయ్యెను. విశ్వామిత్రునకు తృప్తికలుగక మరల తపస్సుచేయ ప్రారంభించెను.

త్రిశంకు మహారాజు:

ఇక్ష్వాకు రాజులలో త్రిశంకుడు గొప్పవాడు. అనేక యజ్ఞములు చేసి ధర్మపరిపాలనముచేయుచుండెను. సశరీరముగ స్వర్గమునకు పోవలయునని త్రిశంకునకు కోరికగలిగెను. ఈవిషయమును తమ పురోహితుడగు వశిష్ఠమహర్షికి చెప్పగా అట్టిది సాధ్యపడదని మహర్షి చెప్పెను.

వశిష్ఠునకు నూర్గురు కుమారులు కలరు. త్రిశంకుడు వారివద్దకు వెళ్ళి తన కోర్కె దీర్చవలసినదని ప్రార్థించెను. మహాతపస్వియగు తండ్రివలన కానిపని తమవలన నెరవేరజాలదనిరి. అటులయిన వేరొక పురోహితుని ఎన్నుకొందునని రాజు అనెను. ఋషిపుత్రులకు కోపమువచ్చి 'చండాలుడవయి పోవుదువుగాక' అని శపించిరి.

త్రిశంకుడు చండాలుడై పోగా మంత్రులు, అనుచరోద్యోగులు విడచివెళ్లిరి. త్రిశంకుడు విశ్వామిత్రుని శరణువేడెను. వసిష్ఠునియెడల గల పూర్వవైరము, కక్ష తీర్చుకొనుటకు మంచి అవకాశములభించెనని విశ్వామిత్రుడు తలచెను. యజ్ఞముచేయించి త్రిశంకుని స్వర్గమునకు బంపుదునని బాసజేసినాడు. యజ్ఞము చేయువాడు చండాలుడు, చేయించువాడు క్షత్రియుడు, దేవతలు హవిస్సులను గైకొనుటయెడల సందేహము వెలిబుచ్చి వసిష్ఠపుత్రులు క్రతువునకు రాలేదు.

తనను నిందించిన వసిష్ఠకుమారులను "ఏడువందల జన్మములు పీనుగులను తినుచునుందురుగాక." అని విశ్వామిత్రుడు శపించెను. యజ్ఞము ప్రారంభము చేయించెను. కొందఱు ఋషులు బ్రాహ్మణులు ఋత్విక్కులుగ వచ్చిరి. హవిస్సులకై దేవతలను ఆహ్వానించెను కాని దేవతలు రాలేదు. "నాశక్తి చూపెట్టుదునుగాక" అనుచు త్రిశంకుని సశరీరముగా స్వర్గమునకు పొమ్మనియెను. నభోమార్గమున కొంత దూర మరుగునప్పటికి "గురువును ధిక్కరించినవాడవు స్వర్గమునకు రాతగదు తిరిగిపొమ్ము" అని దేవతలనిరి. త్రిశంకుడు క్రిందపడిపోవుచుండెను. "ఋషివరా! రక్షింపుము." అని త్రిశంకుడు కేకలుబెట్టెను. కోపకషాయితలోచనుడైన గాధేయుడు "త్రిశంకు మహారాజా! అక్కడనే ఆగుము." అని నిలిపివేసి ఆయనకొఱకై స్వర్గమును సృష్టించెను. నక్షత్రములను నెలకొల్పెను. మరియొక దేవేంద్రుని సృష్టించుచునెను. విశ్వామిత్రుని పట్టుదలకు, తపశ్శక్తికి దేవతలు

నివ్వెరబోయి 'విశ్వామిత్రా! ఇక నెవరిని సృష్టించకుము. త్రిశంకు డిచటనే స్థిరముగానుండునుగాక' అనిరి.

పిమ్మట విశ్వామిత్రుడు విశాలాపురమునకు సమీపముననున్న పుష్కర క్షేత్రమున మరల ఘోరతపస్సు జేయుచుండెను.

అంబరీషుడు - శునశ్శేపుడు :

అంబరీష మహారాజు అయోధ్యను పాలించుచుండెను. ఆయన ఒక యజ్ఞముచేయుచుండగా ఇంద్రుడు యజ్ఞపశువును దొంగిలించుకొని పోయెను. యజ్ఞపశువును వెదకి తెప్పింపవలయును. లేదా నరపశువును బలియివ్వవలెను. లేకున్న యజ్ఞకర్తకు హానిజరుగునని ఋత్విక్కులనిరి. అంబరీషునకు యజ్ఞపశువులభింపలేదు. నరుని అమ్మువారెవరును గన్పింపలేదు.

ఋచీకుడను ఋషికి ముగ్గురు పుత్రులు కలరు. 'లక్షగోవుల నిచ్చెదను. నీకుమారులలో ఒకరిని నాకిమ్ము' అని అంబరీషుడు ఋషి నడిగెను. పెద్దవానినివ్వనని తండ్రియు, చిన్నవాని నివ్వనని తల్లియు ననిరి. మధ్యముడగు శునశ్శేపుడు రాజుతో ఇట్లనెను.

తే. గీ. పెద్దవాడు తండ్రికి జాల - ప్రియసుతుండు
పిన్నవాడు తల్లికి ముద్దు - ప్రియసుతుండు
వార లిరువురు నొల్లని - వాడ నయిన
మధ్యముడనేను వచ్చెద - మానవేంద్ర !

[భాస్కరరామాయణము]

అంబరీషుడు లక్షగోవులను తలిదండ్రులకిచ్చి శునశ్శేపుని దోడ్కొని పోవుచుండెను.

శునశ్శేపునకు మేనమామయగు విశ్వామిత్రుడు పుష్కరతీర్థము వద్ద తపస్సుచేయుచున్నాడని విని శునశ్శేపుడు మేనమామదగ్గరకువెళ్ళి మొఱపెట్టుకొని రక్షింపుమనెను. విశ్వామిత్రుడు జాలినొంది బాలుని

కాపాడవలయుననియు, అంబరీషునకు యజ్ఞఫలము దక్కునట్లు చేయవలయుననియు నెంచెను.

విశ్వామిత్రుడు తన కుమారులనందఱను బిలిచి వారలతో నిట్లనియెను. "ఈశునశ్శేపుడు నాకు మేనల్లుడు. ఇతడు దుఃఖితుడు, భయభ్రాంతుడునై నాశరణు వేడినాడు. ఇతనిని రక్షించుట మనవిధి. మీలో ఎవరైనను అంబరీషుని యజ్ఞపశువుగా బొండు. అందువలన బంధువైనవానిని కాపాడుట, శరణుజొచ్చినవానిని రక్షించుట, అంబరీషుని యజ్ఞము నెఱవేర్చుట, అగ్నిదేవాదిదేవతలకు తృప్తి గల్గించుట మున్నగు ఫలితములు చేకూరును." అని చెప్పెను. అందులకు కుమారులలో ఏయొక్కరును సమ్మతింపరైరి. తండ్రియగు గాధేయునకు కోపము వచ్చెను. "నామాట మీరెవరును వినలేదు. కనుక వసిష్ఠుని పుత్రులవలె మీరును వెయ్యి సంవత్సరములు కుక్కమాంసమును తినుచు హీనజన్మముల నెత్తుడు" అని విశ్వామిత్రుడు శపించెను.

అభయమిచ్చిన మేనల్లుని సంరక్షించుట తనవిధిగ భావించి కౌశికుడు ఉపాయాంతరమాలోచించి ఇట్లు చెప్పెను. "శునశ్శేపా! నీకు రెండు మంత్రముల నుపదేశించెదను. ఈ రెండును నిష్ఠతో జపించుచుండుము. నీకు రెండువిధముల ఫలముచేకూరును. ఒకదాని వలన నీవు విడుదలపొంది ప్రాణమును రక్షించుకొందువు. రెండవ దానిచే అంబరీషమహారాజునకు యజ్ఞఫలము లభించును."

శునశ్శేపుడు సంతోషముతో అంబరీషుని వెంట రథముపైని అయోధ్యకు జేరెను. శునశ్శేపుని అలంకరించి యూపస్తంభమునకు గట్టిరి. అతడు నిష్ఠతో రెండు మంత్రముల జపింప మొదలిడెను. అందుకు దేవతలు సంతృప్తినొంది యజ్ఞఫలము అంబరీషున కిచ్చిరి. వధింపబడక శునశ్శేపుడు విడుదల గావింపబడెను.

ఈ విధముగ, తన కుమారులను సహితము క్షమింపక కఠినముగ శపించి, శునశ్శేపునికి ప్రాణదానమొసగిన స్వార్థరహితుడు విశ్వామిత్ర మహార్షి!

ఋషి - మేనక :

పుష్కరతీర్థమునఉండి విశ్వామిత్రుడు వెయ్యి సంవత్సరములు తపస్సుజేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై 'నీ తపస్సువలన ఋషివైతివి' అనెను. విశ్వామిత్రుడు తృప్తినొందలేదు. మరి చాలకాలము తపస్సు జేయ నుద్యమించెను. కొలదికాలమైనంతనే ఒక రోజున పుష్కరతీర్థము నందు స్నానముజేయుచున్న మేనకను ఋషిజూచెను. అతి సౌందర్యవతి యగు నామె మెఱపుతీగవలె కంటబడగనే విశ్వామిత్రుని మనస్సు చలించెను. మోహపరవశుడై ఆమెతో పదిసంవత్సరములు సాంసారిక జీవితము గడపెను. కనువిప్పు కలిగి, తపోభంగమైనదని పశ్చాత్తాపపడి ఆమెను బంపివేసి మరల కఠినముగు తపస్సుజేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై "మహార్షి"వైతివనెను. 'కమలాలయా! నీవాక్కు తిరుగులేనిది. నేను మహార్షినైతినిగదా! జితేంద్రియుడనయినట్లేగదా!' అని విశ్వామిత్రుడనెను. 'జితేంద్రియుడవు కావలెననిన వికారములకు చలింపని దృఢ నియమముల ప్రయత్నింపవలయును.' అని అంతర్ధాన మొందెను.

రంభ - బ్రహ్మర్షి:

విశ్వామిత్రుడు తృప్తినొందలేదు. నిరాశజెందలేదు. బ్రహ్మర్షి నగు వఱకు తపస్సు జేయవలసినదే అని నిశ్చయించుకొని ఘోరముగు తపస్సుజేయ మొదలిడెను. వేయి సంవత్సరములు గడచెను. భూమి కంపించిపోయెను. దేవతలు భీతినొందిరి. విశ్వామిత్రుని తపస్సు భంగము జేయవలసినదని దేవేంద్రుడు రంభతో జెప్పెను. ఆమె విశ్వామిత్రుని వద్దకేగుటకు వణకిపోయెను. 'నేను కోకిలనై నీ వెంట వచ్చెదను. మన్మథుడు మనలను అనుసరించును. భీతినొందకు' మని శచీపతి అభయ మిచ్చెను.

మన్మథుడు పుష్పశరముల గురిపించెను. కోయిల 'కూ'' కూ'నినదములనంద మొలికించెను. రంభ హంసనడకల ననుగమించెను. విశ్వామిత్రుడు కనులు దెఱచి చూచునప్పటికి ప్రకృతి సౌందర్యము మిక్కిలి ఆకర్షణీయముగ నుండెను. రంభ కంటబడినంతనే, విశ్వామిత్రుడు తన తపోభంగమునకై చేయబడిన కపటమని గ్రహించి కోపముతో,

"దశవర్ష సహస్రాణి శైలీస్థాస్యతి దుర్భగే" దుర్మార్గురాలా! పదివేల సంవత్సరములు శిలవై పడియుండుము" అని శాపమునిచ్చెను.

విశ్వామిత్రుడు, మోహమును జయించెనేగాని క్రోధమును జయింపలేకపోయినందులకు చింతించి మరల తపస్సు జేయ సంకల్పించెను. అచ్చటనుండి తూర్పుదిశగా కొంతదూరమేగి ఒక నిర్జన ప్రదేశమున నిద్రాహారములుమాని, ఉచ్ఛ్వాస నిశ్వాసముల స్తంభింపజేసి తపస్సు జేసెను. అదియే సిద్ధాశ్రమము. ఇటుల పదివేల సంవత్సరములు నిండినంతనే ఒకనాడు విశ్వామిత్రుడు భోజనముజేయనున్న సమయమున బ్రాహ్మణరూపమున దేవేంద్రుడువచ్చి భోజనముబెట్టుమని ప్రార్థించెను. సంతోషముతో ఆ బ్రాహ్మణునకు తన ముందుగల భోజన పదార్థమునంతయు నిచ్చివేసి తృప్తిజెందెను. మరల పదివేల సంవత్సరములు తపస్సు జేయుచుండెను.

ప్రకృతి కంపించెను. సముద్రములు కలగెను. చుక్కలురాలెను. దేవతలెల్లరు బ్రహ్మకడకుజని విశ్వామిత్రుని కఠోరమగు తపస్సును గూర్చి మనవిజేసిరి.

బ్రహ్మాదిదేవతలు విశ్వామిత్రుని వద్దకు వచ్చిరి. "విశ్వామిత్రా! బ్రహ్మర్షివైతివి; ఇక నీ తపస్సు విరమించుము." అని వాణీధవుడనెను. విశ్వామిత్రుని ఆనందమునకు మేరలేదు. 'నేటికి తపస్సు ఫలించి మనోరథసిద్ధి అయినది. నీకనేక నమస్కారములు అర్పించుచున్నాను. ఓ సత్యలోకాధిపతీ! నాకు కొలదిమాత్రముగ సంకోచముకలదు'' అనెను. బ్రహ్మ యింకను ఏకొరత కలదని ప్రశ్నించెను. "వశిష్ఠ మహర్షి నన్ను

బ్రహ్మర్షిగా అంగీకరింపవలయును." అనెను. సంకల్ప మాత్రమున వసిష్ఠ మహర్షి అచటికివచ్చి 'బ్రహ్మర్షీ! విశ్వామిత్రా! సృష్టికర్తయగు బ్రహ్మవాక్కున కాటంకము లేదనెను.

పరమానందభరితుడైన విశ్వామిత్రుడు మిత్రభావమున వసిష్ఠ మహర్షిని పూజించెను. దేవతలు స్వర్గలోకమునకు జనిరి.

"విశ్వామిత్ర మహర్షి అసామాన్యుడు, నేడు ఆయన చరిత్రము సమస్తమును విన్పింపగలిగినందులకు ధన్యుడనయితిని." అని శతానందుడు రామలక్ష్మణులతోననెను. గురువుగారి పూర్వ చరిత్ర తెలిసికొనగలిగినందులకు ముదమంది పుణ్యమూర్తి, తపోధనుడగు విశ్వామిత్రుని పూజించి, వినిపించిన శతానందునికి నమస్కరించిరి. ఈ వృత్తాంతమంతయు విన్న ఇతర మునులును అత్యంతానందము నొందిరి.

**శివధనుర్భంగము - సీతాకళ్యాణము :**

పూర్వము దక్షుని యజ్ఞమును ధ్వంసము చేయుటకై శివుడు విల్లును చేతబట్టెను. దేవతలు శివుని శాంతింపజేసిరి. శివుడావిల్లును దేవతలకిచ్చెను. దేవతలు దానిని దేవరాతుడను మిథిలాధిపతికి నిచ్చిరి. ఆ వంశములోనివాడగు జనకునివద్ద ఇపుడావిల్లు కలదు.

ఒకనాడు జనకుడు భూమిని దున్నుచుండగా నాగటిచాలున ఒక కన్య లభించెను. కన్నబిడ్డవలె జనకుడామెను పెంచెను. ఆమెయే సీత. శివ ధనుస్సును ఎక్కుపెట్టిన మహావీరునకు సీతనిచ్చి వివాహము చేయుదునని జనకుడు ప్రకటించెను. రాజకుమారులెందరో ప్రయత్నించి విఫలులైరి.

జనకుని ఆజ్ఞపై బలిష్ఠులగు అయిదువేలమంది ఆ ధనుస్సుగల పెట్టెను లాగుకొనివచ్చిరి. రాముడు దానిని చూచి ఎక్కుపెట్ట ప్రయత్నింతునని విశ్వామిత్రునితో చెప్పెను. విశ్వామిత్రుడును జనకుడును అందుకంగీకరించిరి. రాముడు ఆవిల్లును అవలీలగా ఎత్తి, వంచి, నారి

బిగింపజూచెను. ఆవిల్లు నడిమికి ఫెళ్ళుమని విరిగెను. భూమి బ్రద్దలగు నంత ధ్వనియయ్యెను. జనకుడు సంతసించెను.

ఈ వార్త జనకుడు మంత్రుల ద్వారా దశరథునకు తెలియజేసి కల్యాణమునకు ఆహ్వానించెను. దశరథుడుప్పొంగిపోయి, భార్యలతోను, పరివారముతోను మిథిలానగరముచేరెను. జనకుడు దశరథునికి రాజ సత్కారములతో ఎదురేగి సంతుష్టి నొందించెను.

జనకుని తమ్ముడు కుశధ్వజుడు. సాంకాశ్య పట్టణమునకు రాజు. జనకుని పిలుపున అతడును వివాహమునకు వచ్చెను. సీతను రామున కిచ్చియు, జనకుని కుమార్తె ఊర్మిళను లక్ష్మణున కిచ్చియు వివాహ ములు చేయదలచితినని జనకుడు తెలియజేసెను. కుశధ్వజుని కుమార్తె లగు మాండవి, శృతకీర్తియను కన్యారత్నములను భరత శత్రుఘ్నుల కిచ్చి పరిణయ మొనరించుట యుక్తమని విశ్వామిత్రుడు హితవొసగెను. పెద్ద లెల్లరును ఇందుల కంగీకరించిరి నలుగురి వివాహములు మహా వైభవముగ ఒకేనాడు జరిపించిరి. దశరథుని పురోహితుడు వశిష్ఠుడును, జనకుని పురోహితుడు శతానందుడును (ఇతడు అహల్యా గౌతముల కుమారుడు) వివాహములను యథావిధిగ నిర్వర్తించిరి. దేవతలు పుష్ప వృష్టి కురిపించిరి.

మరునాడు దశరథుడు కొడుకులతోను, కోడండ్రతోను అయో ధ్యకు బయలుదేరెను. విశ్వామిత్రుడు హిమాలయములకు పయన మయ్యెను. జనకుడు ఎల్లవారికిని సగౌరవముగ వీడ్కోలు నిచ్చెను.

పరశురామగర్వభంగము :

దశరథుడు నూతన వధూవరులతోను పరివారముతోను అయో ధ్యకు పోవుచుండగా మార్గమధ్యమున పరశురాము డెదురయ్యెను. ఇతడు జమదగ్నియొక్క కుమారుడు. శివధనుస్సును పొందినవాడు దేవరాతి. ఋచీకునకు విష్ణుమూర్తి ఒక ధనుస్సు నిచ్చెను. దానిని

ఋచీకుడు పరశురాముని తండ్రియగు జమదగ్నికిచ్చెను. అందులకు కినిసి కార్తవీర్యార్జునుడు ఋచీకుని చంపివేసెను. ఆ కోపమున భార్గవ రాముడు పరశువునుబూని ఇరువదియొక్క మారులు క్షత్రియులను సంహరించెను.

"ఆ విష్ణుధనువు నావద్దనే కలదు. శివధనుర్భంగముచేసిన నీవు ఈ విష్ణు ధనువు నెక్కుపెట్టగలిగిన నీతో ద్వంద యుద్ధము చేయుదు" నని పరశురాముడు పలికెను.

శ్రీరాముడు విల్లునుగ్రహించి యెక్కుపెట్టెను. 'పరశురామా! నీవు బ్రాహ్మణుడవు నీ ప్రాణములుతీయనొల్లను. ఇది విష్ణు బాణము సంధించినది వృధాపోదు. దేనిని కొట్టమందువు? నీపాదగతినా! లేక నీ వార్జించుకొన్న లోకములనా?' అని రాముడనెను. తపముచే నార్జించుకొనిన పరలోకముపై విడువ పరశురాముడు కోరెను. రాము డట్లే చేసెను. శ్రీరామునకు శుభమును గోరుచు పరశురాముడు మహేంద్రగిరికి వెడలిపోయెను. దశరథుడు అయోధ్యకుచేరెను. వివాహములకై వచ్చిన కేకయరాజు పుత్రుడైన యుధాజిత్తు మరియొక మారు అయోధ్యకువచ్చి భరత శత్రుఘ్నులను మేనమామల ఇంటికి తీసికొని వెళ్ళెను. సుఖమానందములతో కొంతకాలము గడచెను.



# అయోధ్యాకాండ

## రామ పట్టాభిషేకయత్నము :

కుమారులందరియెడలను దశరథునకు ప్రీతి మెండు. కాని సకల గుణాభిరాముడగు రామునియెడల అత్యంతమగు ప్రీతి. రాముడు రాజై యుండగా చూచి ఆనందింపవలెనని దశరథుని ఆకాంక్ష. అందుకై మంత్రులను, సామంతులను, అనేక పట్టణములయందును గ్రామములందును నుండు ప్రజలను పిలిపించి పెద్ద సభ జేసెను. రాముని యువరాజుగా చేయవలెనను తన యభిలాషను తెలిపెను. ఎల్లరును తమ తమ సంతోషములను దెలిపిరి.

సుమంత్రుని వలన దశరథుడు రాముని పిలువనంపెను. రాముడు రథముపై వచ్చి మేడపై సభలోనున్న తండ్రికడకేగి తన పేరు జెప్పుకొని నమస్కరించి నిలువబడెను. దశరథుడు రాముని కౌగలించుకొని రత్నాసనముపై కూర్చుండబెట్టి పుష్యమీ నక్షత్రమందు యౌవరాజ్య పట్టాభిషేకము చేయదలచితిననియు, ప్రజాభీష్టమును అట్లే యుండెననియు తెలిపెను. తండ్రి యాజ్ఞను రాముడు శిరసావహించెను. తండ్రికి నమస్కరించి తల్లివద్దకు పోయెను. సీతయు అక్కడేయుండెను. తండ్రి యాజ్ఞను కౌసల్య, సుమిత్ర, సీత, లక్ష్మణులతో చెప్పెను. అందఱును ముదమందిరి.

వశిష్ఠుని యాజ్ఞమేరకు సీతారాములారాత్రి దీక్షలో నుండి శ్రీమన్నారాయణుని పూజించిరి.

రామ పట్టాభిషేక వృత్తాంతము నగరమెల్లెడ వ్యాపించెను. పట్టణమంతయు అలంకరింపబడుచుండెను. ప్రజల కోలాహలమునకు మేర లేకుండెను.

విషయ మంతయు గ్రహించిన మంథర తన యజమానురాలగు కైకేయి వద్దకు పరుగు పరుగున బోయెను. అరణపు దాసియగు మంథర కైకకు సమ్మినబంటు. 'అమ్మా! నీకు కీడు మూడినది. రామునకు రాజ్యము కట్టబెట్ట దశరథ మహారాజు కుట్రజేయుచున్నాడు. రేపే ముహూర్తమట' అనినది మంథర. చల్లని వార్త చెప్పినందుకు కైక మంథరకొక హారము బహూకరించెను. రామ పట్టాభిషేకమునకు సంత సించుచున్న కైకతో 'అయ్యో, వెర్రి కైకా! కౌసల్య రాజమాత కానున్నది. నీవును నీ భరతుడును ఆమెకు ఊడిగము చేయవలసి యుండును. నీకును నీకుమారునకును భద్రత చేకూరవలెనన్న రాముడు రాజు కారాదు.' అని యెన్నియో విధముల నాటజెప్పెను. అయిన ఇప్పుడు నన్నేమి చేయమందువు అని కైక ప్రశ్నించెను. మంథర ఎత్తు పారినది. కైకను తన చేతి కీలుబొమ్మగజేసి యుపాయము చెప్పినది.

పూర్వము దేవదానవ సంగ్రామమున దశరథ రాజేంద్రునకు కైక తోడ్పడగా రాజు రెండు వరము లనుగ్రహించెను. అప్పుడామె వానిని కోరలేదు. ఇప్పుడు దాని సమయము వచ్చినది. అని జ్ఞాపకము చేసి రాజు వచ్చినపుడు రాముడు పదునాల్గు సంవత్సరములు అరణ్య వాసము పోవునట్లును, భరతునకు రాజ్యాభిషేకము చేయునట్లును రెండు వరముల కోరుకొమ్మని ఉద్బోధించెను. కైకకీపన్నుగడ నచ్చినది.

కోపగృహము :

కైక కోపము రెచ్చిపోయెను. ఆభరణములన్నియు త్రెంచి చిందరవందరగ పారవైచెను. ఏడ్చి ఏడ్చి వాచిపోయిన కనులతో, అలంకరణహీనయై, నేల మీద పడుకొని యుండెను. ఉబలాట ముతో వచ్చిన రాజు కోపగృహమునయున్న కైకను చూచి నిర్విణ్ణు డాయెను. మెల్లగా ఆమెను కదలించెను. అట్లు పరుండుటకు కారణ మేమనెను. ఆ కోరిక ఏదైనను నెరవేర్తుననెను. కైక కోరిక దీర్చెద నని రఘురామునిపై ఒట్టుపెట్టుకొని దశరథుడు మాట యిచ్చెను.

"సూర్య చంద్రులు, సమస్త భూతములు సాక్షిగా నున్నారు. నా కోర్కె చెప్పెదను. శంబరాసురుని యుద్ధ సమయమునసీ విచ్చిన రెండు వరముల నిప్పుడు కోరుచున్నాను. ఒకటి, రాముని నారచీరలతో పదునాల్గు సంవత్సరము లడవులకు బంపుము. రెండవది, ఈ సమకూర్చిన పదార్థములతో భరతునకు పట్టాభిషేకముచేయుము."అని కైక అనెను.

దశరథుడీ పిడుగువంటి వార్తవిని మూర్ఛబోయి, కొంతవడికి లేచెను. కైకను బ్రతిమలాడెను. ప్రాధేయపడెను. కోపించెను, దూషించెను. నోటికి వచ్చినట్లు తిట్టెను. కైక మనసు మారలేదు. 'నీవు నాకు భార్యవుకాదు. భరతుడు నా కుమారుడుకాడు, మిమ్ముల నిరువురనూ త్యజించుచున్నాను' అని దశరథుడనెను.

తెల్లవారినది :

ఆ రాత్రియంతయు కైకా దశరథుల వాగ్వివాదముతోను, కన్నీటి ధారలతోను గడచిపోయెను తెల్లవారవచ్చెను. మహారాజును మేల్కొలుప వైతాళికులు వచ్చిరి. రాజు నిరాకరించెను. సూర్యోదయముకాగానే సుమంత్రుడును వశిష్ఠుడును కైక భవనమునకు వచ్చిరి. సుముహూర్తము సమీపించుచున్నదని రాజున కెఱుకజేయ సుమంత్రుడు అంతఃపురమున బ్రవేశించెను. కళావిహీనమగు ముఖముతోను, దీనముగనున్న రాజునుచూచి సుమంత్రుడు చకితుడయ్యెను. కైకమ్మ 'సుమంత్రుడా! నీవు వెళ్ళి రాముని దోడ్కొనిరమ్ము' అనెను.

రాజాజ్ఞగా భావించిన సుమంత్రుడు రాముని దోడ్కొనివచ్చెను. తండ్రిని జూచి రాముడు నిశ్చేష్టుడయ్యెను. తండ్రికిని, తల్లికిని నమస్కరించి నిలబడెను. రుద్ధకంఠమున దశరథుడు 'రామా!' అని తరువాత మాటరాక ఆగెను. తనపై కోపమా? లేక మరెవరైన తండ్రికి ఎగ్గొనరించిరా? అని తల్లిని ప్రశ్నించెను. 'నాకిడిన వరములనుగూర్చి నీతో రాజు చెప్పలేకున్నాడు. తండ్రి యానతి నెరవేర్తునని వాగ్దాన మొనరింపుము. నేనే చెప్పెదను.'అన్న కైకతో "అమ్మా! ఎంతమాట? తండ్రి

యాజ్ఞమైన అగ్నిలోనైన దూకుదును. మహారాజుకోరిక తెలుపు" మనెను. రాముసకు కైక వరముల రెంటినిగూర్చి చెప్పెను. ఇది విన్న రాముడు 'తప్పక అరణ్యముల కేగెదను. భరతుని పిలిపించి పట్టాభిషేకము చేయుము. తండ్రికి సంతోషము కలిగించుటయే నాఆశయ'మని రాముడనెను. ఇది వినుచున్న దశరథుడు శోకసముద్రమున మునిగి పోయెను. మారుమాట చెప్పజాలడయ్యెను.

తండ్రికిని, కైకకును నమస్కరించి పితృవాక్పరిపాలనమునకై రాముడు అటనుండి వెడలిపోయెను. కోపమును, దుఃఖమును దిగమ్రింగి లక్ష్మణుడు వెంటనడచెను.

రామలక్ష్మణులు కౌసల్యాంతఃపురమునకరిగిరి. రాముని మాటలు విన్న కౌసల్య మూర్ఛిల్లెను. రాముడామెను లేవనెత్తెను. ఆమె దుఃఖమునకు మేర లేదు. 'సీతో అరణ్యములకు వచ్చెద'నన్న మాతృదేవతను రాముడు ఓదార్చెను. భర్త జీవించి యున్నంతకాలము త్యజించుట సనాతన ధర్మము కాదు. అని శాంతింపజేసెను. కౌసల్య దుఃఖమును జూచి లక్ష్మణుడు ఉగ్రుడై 'ముసలివాడై బుద్ధిమాంద్యముచే చెప్పినది అనుసరించవలసినపని లేదు. కామమునకులోనై స్త్రీకి దాసుడైనాడు. అకార్యమునుచేసిన తండ్రిని చంపుదము లేదా బంధింత'మనెను.

"లక్ష్మణా! పొరబడుచున్నావు. తండ్రిని దూషింపకుము. అతడు ధర్మనిరతుడు. ధర్మమును రక్షించవలసిన భారము మనయందున్నది. ఇది దైవనిర్ణయము" అని రాముడు లక్ష్మణుని కన్నీరుతుడిచి శాంత పరచెను.

తల్లివద్ద సెలవు దీసికొని రాముడు సీతవద్దకు వెళ్ళెను. ముఖమును వ్రేలవైచుకొనియున్న రామునిచూచి సీత కలతజెందెను. సీతను జూడగనే రామునకు దుఃఖము వచ్చెను. విషయమంతయు తెలిసికొన్న సీత రామునివెంట వచ్చెదననెను అరణ్యావాసమునందలి కష్టములను

గూర్చి చెప్పినను వినక 'నిన్ను విడచి స్వర్గమందుండుటయినను నాకు రుచింప'దనెను. సీత వచ్చుటకు రాముడంగీకరించెను. అది చూచిన లక్ష్మణుడు తానునువచ్చెదనని పట్టుబట్టెను. విధిలేక రాముడంగీకరించెను

సీతా రామ లక్ష్మణులు మరల కైకాంతఃపురముననున్న దశరథ మహారాజును దర్శింపబోయిరి. కౌసల్య, సుమిత్రలను ఇంకనుగల మూడు వందల యేబదిమంది భార్యలను పిలిపించెను సుమంత్రుడు, వశిష్ఠుడును చెంతనుండిరి. కైక నారబట్టలను తెచ్చి యివ్వగా రామలక్ష్మణులు ధరించిరి. సీత ధరించుటకు వశిష్ఠుడు సమ్మతించలేదు. ఆమెను సర్వాభరణ భూషితగనే పంపమని రాజాజ్ఞయాయెను పెద్ద లందరికిని నమస్కరించి సెలవు గైకొని సుమంత్రుడు సిద్ధముజేసిన రథముపై సీతా రామ లక్ష్మణులెక్కి ప్రయాణమైపోయిరి. అయోధ్యాపురవాసు లెల్లరును దుఃఖమును పట్టలేకపోయిరి. అట్లు వారు తమసానది వరకు వెళ్ళిరి. ఆ నదీతీరమున అందరు ఆరాత్రి విశ్రమించిరి. పౌరులకు తెలిసిన ప్రయాణ భంగమగునని చీకటియుండగనే రథము బయలుదేర దీయించి రామ ప్రభృతులు అరణ్యములోనికి బోయిరి. పౌరులు వెనుదిరిగి అయోధ్యను జేరిరి. దశరథుడు వెంటనడచెను గాని మంత్రులచే వారింప బడి రాణులతో కౌసల్యాంతఃపురమునకు చేరెను.

**సీతా రామ లక్ష్మణులు :**

రథముపై సీతా రామ లక్ష్మణులు గంగానదిని సమీపించిరి. ఒడ్డుననేగల శృంగిబేరపురము చూచిరి. బోయరాజగు గుహుడు ఆ ప్రాంతమున కధిపతి. అతడు రాముని సత్కరించెను. అందరును ఆ రాత్రి ఆ నదీతీరమున గడపిరి. సుమంత్రుడు సెలవుగైకొని రాముని వీడి రథముపై అయోధ్యకు తరలెను.

రాముడు కోరగా గుహుడు మఱ్ఱిపాలను తెచ్చి యిచ్చెను. ఆపాలనుబట్టించి రామలక్ష్మణులు తల వెండ్రుకలను జడలు కట్టించిరి.

జటావల్కల ధారులైన రామలక్ష్మణులు ఋషులవలె నుండిరి. సీతా రామలక్ష్మణులను పడవపై కూర్చుండజేసి గంగానది ఆవలియొడ్డునకు గుహుడు జేర్చెను. వారు గంగానదికి నమస్కరించిరి. ఆ రాత్రి గంగా నదికి దక్షిణభాగమున గడపి మరునాడుదయమున గంగానదీతీరమున కాలినడకనుపోయి గంగా యమునా సంగమ స్థానమును జేరిరి. అచటనే భరద్వాజ మహర్షి యాశ్రమము కలదు. ఆనాడు భరద్వాజుని ఆతిథ్య మును స్వీకరించిరి. జనసందోహములేని ప్రశాంత ప్రదేశము చిత్ర కూటమని మహర్షివలన తెలిసికొని యమునానదిని తెప్పపై దాటి చిత్రకూటమును జేరిరి.

అదియొక రమణీయ ప్రదేశము. అచటనే వాల్మీకి ఆశ్రమము కలదు. ఆశ్రమమున మహర్షిని దర్శించి నమస్కరించిరి. మాల్యవతీ నదీ తీరము. ఇంపునింపు వాతావరణము. వాల్మీకి హితవున చిత్రకూటము నందు రాముని ఆజ్ఞపై లక్ష్మణుడొక పర్ణశాలను నిర్మించగా సీతా రామలక్ష్మణులా మొదటి పర్ణశాలయందు కొలదికాలముగడుప నుండిరి.

### శ్రవణకుమారుడు :

దశరథుడు కౌసల్యాంతఃపురమున నుండెనేగాని మనస్థిమితము లేకుండెను. రామునిపైగల మమకార మతనిని పిచ్చివానినిజేసివైచెను. కొలదికాలము నిద్రించును. అంతలో మేల్కొనును. 'రామా రామా' యని విలపించును. మూర్ఛనొందును. మరికొంతవడికి తెలివినొందును. కౌసల్య యొనరించు శైత్యోపచారము లాదశరథుని మానసికాగ్నిని చల్లబరుపజాలవయ్యెను. దశరథునకు శ్రవణుని వృత్తాంతము మనసుకు వచ్చి కౌసల్యకు జెప్పెను.

యువకుడుగనున్న దశరథు డొకనాడు వేటకు వెళ్ళెను. సమీప మునగల నదిలో బుడబుడమను శబ్దము వినెను. ఏనుగు నీరు త్రాగు చున్నదనుకొని శబ్దవేధియను బాణమును విడిచెను. ఒక బాలుని

హాహాకారము వినవచ్చెను. పరుగిడిపోయి చూడగా ఏనుగు కాదు; తన దెబ్బకు ఒక ముని బాలుడు పడిపోయెనని దశరథుడు గ్రహించెను. కొనయూపిరితో నున్న ఆ శ్రవణుడు అంధులగు తన తలిదండ్రుల వృత్తాంతమును, వారి కొఱకై అతడు నీరుగొనపోవ నదికడకు వచ్చి కుండ ముంచుటను ఇంతలో బాణమువచ్చి గ్రుచ్చుకొనుటయు చెప్పెను. దశరథుడు బాణము లాగి వేయగా ఆ బాలుడు ప్రాణములను వదలెను. దశరథుడు నీరుతీసికొని ముని దంపతులకడకుపోయి జరిగిన వృత్తాంతము నివేదించెను. తమకు సేవచేయుచున్న ఆ పుత్రుని కోల్పోయినందుకు ఆ గ్రుడ్డివారు శోకించిరి. వారిపుడు దిక్కులేనివారైరి. వారు క్రుద్ధులై 'మావలె నీవు పుత్రశోకమున మరణింతువుగాక' యని శాపమిచ్చి చితిలోపడి అసువులు బాసిరి. ఈ కథ చెప్పి దశరథుడు కుమిలి కుమిలి యేడ్చెను.

## దశరథుని మరణము :

పుత్రశోకమున మరణము తనకు తప్పదని దశరథుడు నిశ్చయించుకొనెను. అంత నాతనికి నిద్రపట్టెను. తెల్లవారినది. పట్టణమంతయు మేల్కొనినది. కౌసల్యా సుమిత్రలు రాజునుపట్టి చూచిరి. ఆ మహా రాజు దీర్ఘనిద్ర జెందెను. అంతఃపురముతో బాటు అయోధ్యా నగర మంతయు గొల్లుమని యేడ్చెను. రామలక్ష్మణులు అరణ్యముల కేగిరి. భరత శత్రుఘ్నులు మేనమామ యింటనుండిరి. ఇక కర్తవ్యమును వశిష్ఠాదులాలోచించిరి. భరతుని పిలిపించుట యుక్తమని తలచిరి. రాజ్య భారము వహింపవలసినవాడుకూడ భరతుడే. భరతుని తోడ్కొని రావలసినదిగా గిరివ్రజమునకు విశ్వసనీయులనుబంపిరి. దశరథుని మృత కళేబరము తైలద్రోణియందు భద్రపరచిరి.

వశిష్ఠుని ఆదేశము ననుసరించి దూతలు రాజు మరణమునుగూర్చి భరతునితో చెప్పక త్వరితముగ బయలు దేరి అయోధ్యకు రావలయుననిరి.

మాతామహునిఇంట సెలవుగైకొని భరతుడు మున్నగువారు ఎనిమిదవ నాటికి రథములపై అయోధ్య చేరిరి. నగరమంతయు కళావిహీనముగ గన్పట్టెను. కైకాంతఃపురమునకుబోయి తల్లికి నమస్కరించెను. నమస్కరించుటకు తండ్రిగారెటనుండిరని భరతుడు తల్లి నడిగెను. ఆమె చావు కబురు చల్లగ తెలిపెను. తండ్రికి నమస్కారముచేయు నదృష్టము రాముకేగాని తనకు లేకపోయెనని వాపోయెను. అప్పుడు కైక జరిగిన దంతయుచెప్పి తన వరములనుగూర్చి వివరించెను. భరతుడు మండి పడెను. ఈ జరిగిన విషాదనాటకమునకు తల్లియే కారణమని భరతుడు విలపించెను; నిందించెను; దూరెను. ఆ సమయమునకు కౌసల్యయు నచటికి వచ్చినది. భరతునిజూచి మెత్తిపొడుపుగ మాటలాడినది. 'తల్లీ! నన్ను దుష్టునిగ దలపకుము. నేనేపాపము నెఱుగను. అని భరతు డెన్నియో ఒట్లుపెట్టుకొని కౌసల్య పాదములపై బడెను. కౌసల్య శాంతించి అతనిని ఓదార్చెను. వశిష్ఠాదుల అనుజ్ఞతో భరతుడు తండ్రికి సంస్కారక్రియలను జరిపెను.

పదునాల్గవదినమున రాజోద్యోగులు భరతునివద్దకు వచ్చి రాజ్య భారము వహింపవలసినదని వేడుకొనిరి. అందులకు భరతుడిట్లు సమా ధానము చెప్పెను. "జ్యేష్ఠుడగు రాముడే రాజ్యాధికారి. రాముని అడవులనుండి పట్టాభిషేకముచేసియే యిటకు తీసికొని రావలెను. రాముని బదులుగా నేను అడవులయందుండెదను. ప్రయాణమునకు సిద్ధముచేయుడు" అనెను. భరతుని ధర్మవర్తనకు ప్రజలు సంతసించిరి.

**అడవులకు భరతుడు :**

భరతుడడవులకు పయనమాయెను. రథ గజ తురగ పదాతిదళ ములతోను, మంత్రివరులతోడను, వశిష్ఠుడు, తల్లులు ముగ్గురతోడను, కొందరు పురజనులతోను శృంగిబేరపురమును జేరెను. గుహుడు మొదట భరతుని శంకించెను గాని విషయము తెలిసికొని యాతిథ్య

మిచ్చెను. భరతాదులను గుహుడు గంగానదిని దాటించెను. గుహుని వలన రాముడు నడచిన మార్గమును గుర్తెరిగి భరతుడు భరద్వాజాశ్రమముచేరెను. భరద్వాజుడుకూడ భరతుని అనుమానించి 'రామునిపై దండెత్త దలచితివా?' యనెను. భరతుడు విచారపడి తన మనసునందలి వాస్తవమును తెలిపెను. భరద్వాజుడు సంతసించి ఆనాడు భరతునికిని అతని పరివారమునకును తన తపశ్శక్తి వలన నగరమును సృష్టించి అనూహ్యమగు నాతిథ్యము నొసగెను. భరద్వాజుని వలన రాముని జాడలు తెలిసికొని చిత్రకూటమునకు ప్రయాణించిరి. కొలది దూరమున నుండగనే భరతుడు వసిష్ఠుని, సుమంత్రుని వెంట నిడుకొని పాదచారియై చిత్రకూటమును జేరుచుండెను.

చిత్రకూట పర్వత సానువులపై సీతారాములుండిరి. కొండపై భాగముననున్న లక్ష్మణుడు చెట్టుకొమ్మనుండి జనసందడియు, మేఘములవలె లేచిన దుమ్మును, పరివారము, సైన్యము వెంటరాగా భరతుడు వచ్చుచుండుటను గాంచెను. గబగబ అన్నగారికడకేగి భరతుని రాకను దెల్పి నిప్పులు గురిపించు మాటలాడి వారి నెదుర్కొన అన్న యనుమతి నర్థించెను. భరతునిగూర్చి అపోహపడుట ఉచితముకాదని రాముడు లక్ష్మణుని శాంతింప జేసెను.

సోదర సమాగమము :

భరతుడువచ్చి రాముని జూచెను. రాజలాంఛనములతో కిరీటధారియై రత్నసింహాసనముపై నుండవలసిన అన్న అరణ్యములో వేదికపై దర్భాసనమున జటావల్కలధారియై యుండుట జూడగనే భరతుని కనులనిండుగ నీరుగ్రమ్మెను. రాముని పాదముల నంటబోయెను. గాని కన్పింపలేదు. నేలపైబడి నమస్కరించెను. భరతుని జూడగనే కన్నీరు నిండిన రాముడు భరతుని లేవనెత్తి కౌగలించుకొనెను. భరతుడు తండ్రి మరణవార్త చెప్పగనే రాముడు కుప్పగూలెను. పిమ్మట నదీ

తీరమునకుబోయి తండ్రికి ఉదకమును వదలి రేగుపండ్లు, గార పిండితో పిండములు చేసి మనసా తండ్రికి సమర్పించి పర్ణశాలకు జేరెను.

చూడవచ్చిన వశిష్ఠునకు, తల్లులకు, పెద్దలకు రాముడు నమస్కరించెను. సుమంత్రుడు, గుహుడును చూడవచ్చిన పౌరులును రాముని స్థితికి విచారపడిరి. మామగారు పోయినందులకు దుఃఖించు సీతను కౌసల్య మున్నగువారు ఓదార్చిరి.

"అగ్రజా! ఇది నీ రాజ్యము. నీవు అరణ్యములయందుండుటయు నేను ప్రభువు నగుటయు కూడనిపని. నా కోర్కెయు, పురజనుల కోర్కెయు మన్నించివచ్చి రాజ్యమును స్వీకరించుము. నాకీ రాజ్యము పాలించు అర్హత లేదు. నా యెడల యెట్టి దోషమును లేదు." అని రాముని భరతుడు ప్రార్థించెను.

వశిష్ఠుడును, జాబాలి మున్నగు ఋషులును రామున కెన్నివిధములుగనో చెప్పిరి. భరతునికోర్కె మన్నించుమనిరి.

రాముడిట్లు సమాధానము చెప్పెను."అనుజా! భరతా! మనము ధర్మజ్ఞుడైన దశరథమహీపాలుని పుత్రులము. ఆ మహారాజు కీర్తిని నిలుపవలసిన భారము మనయందున్నది. నేనును నీవును ఆయన ఆజ్ఞను పాటింపక తప్పదు. రాజునాసతి నేనరణ్యమునందుండుట, నీవు రాజ్యపాలన మొనర్చుట తప్పదు. ఎవరియెడలను నా కసూయాద్వేషములు లేవు. తండ్రి యాజ్ఞ పాలించుటయే నా దృఢవ్రతము." 'ఇది పెద్దల యాజ్ఞ తిరస్కరించుటకాదు. నన్ను మన్నింపుడు. నేను ధర్మమును అనుసరింపక తప్పదు.' అని భరతునికిని, పెద్దలతోను చెప్పెను. రాముడు వచ్చు వఱకు నేనిచట ప్రాయోపవేశము చేతునని భరతుడు రాముని పాదములకడ అడ్డముగ పరుండెను. అది చూచి రాముడు "నాయనా! నేను నీ క్షేమ మెగ్గొనరించితిని. నీపట్టును వదలి అయోధ్యకు వెళ్ళుము" అనెను.

## పాదుకా పట్టాభిషేకము :

వశిష్ఠాదులును, పురజనులును రాముని ధర్మతత్పరతకు అడ్డు చెప్పజాలకపోయిరి. అయోధ్యకు వెడలవలసినదని భరతునకు చెప్పిరి. భరతుడు కాదన లేకపోయెను.

"ఈ పదునాల్గువత్సరములును నేనును జటావల్కలముల నుండెదను నీకొఱకై పదునాల్గువత్సరములు రాజ్యమేలుదును. నీవు మరలి మరుసటి రోజునకు రానియెడల అగ్నిప్రవేశము చేయుదును. ఈ బంగారు పాదుకలపై నీ పాదముల నుంచుము. సమస్త లోకములకు ఇవియే, యోగక్షేమములకు రక్షయగును." అని భరతుడనెను.

రాముడు భరతుని కోరిక ననుసరించి పాదుకల తొడిగికొని వదలెను. భరత శత్రుఘ్నులను కౌగలించుకొనెను. భరతుడు పాదుకల నెత్తి, కనుల కద్దుకొని శత్రుంజయమను పట్టపుటేనుగుపై వానినుంచి అన్నగారివద్ద సెలవుతీసికొని వచ్చినవారందఱితో తిరుగు ప్రయాణము సాగించెను. భరద్వాజాశ్రమము చేరి, తదుపరి శృంగిబేరపురమును జేరి రాముడు లేని అయోధ్యను జేరుటకు మనసు ఒప్పక, సమీపమునగల నందిగ్రామమునందు పాదుకలకు పట్టముకట్టెను. భరతుడు జటావల్కలముల బూని దీక్షాబద్ధుడై యుండెను. మిగిలిన వారెల్లరును అయోధ్యా నగరము జేరిరి.

## అనసూయ :

చిత్రకూటమునందుగల ఋషులెల్లరు ఆ ప్రాంతమువీడి మరెటకో పోదలచిరి. రాముడు కారణములందుకు తెలిసికొనెను. రావణుని తమ్ముడగు ఖరుడు జనస్థానము నాక్రమించి యుండెను. సీతా రాములిటనున్నట్లు వినిన తరువాత ఖరదూషణులు చిత్రకూటమునకు గూడా రాసాగిరి. తమకిట తపోభంగము కలుగుననియు, మరెటకైన పోయి తపమాచరించుకొనుట యుక్తమనియు మునులు తలచిరి.

రాముడును చిత్రకూటమును వీడుటయే తమకును శ్రేయమని కొనెను. ఏలనన, తల్లులు, భరతాదులు జ్ఞాపకమునకు వచ్చుచున్నారు. తామున్న ప్రదేశము అయోధ్యాప్రజను తెలిసినారు. బహుశా వారు మరల మరల తనను చూడరావచ్చును. అందువలన ఇటనుండి మరి కొంత దూరమేగుటయే మంచిదనుకొనెను.

సీతారామలక్ష్మణులు చిత్రకూటమును వదలి అత్రి ఆశ్రమమును చేరిరి. అత్రి, అనసూయ దంపతులకు సీతారాములు ప్రణమిల్లిరి. అత్రి మహాముని వారికి ఆతిథ్యమొసగెను. సీత చెప్పగా అనసూయ సీతారాముల వివాహవృత్తాంతము ఆసక్తితో వినెను. సీత పాతివ్రత్యమునకు అనసూయ మెచ్చుకొని అనేక ధర్మములనుపదేశించినది. ఒక పుష్పమాల, ఆభరణము చందనము, వస్త్రమును అనసూయ జానకికి ఇచ్చెను 'ఇవి ధరించిన నీ శరీరము నిత్యనూతనముగానుండు' నని అనసూయ చెప్పెను.

పిమ్మట సీతారామ లక్ష్మణులు అత్రిమహాముని ఆశ్రమమును వదలి యింకనూముందుగల మహారణ్యమున ప్రవేశించిరి.



# అరణ్యకాండ

సీతా రామ లక్ష్మణులు దండకారణ్యమున ప్రవేశించిరి. సదాచార సంపన్నులై, మునివృత్తినున్న భూసురోత్తములుగల మునిపల్లెను చూచిరి. వారొసగిన ఆతిథ్యమును స్వీకరించిరి. జితక్రోధులైయున్న తమను కాపాడుచుండుమని మునులు రాముని ప్రార్థించిరి.

మునులవద్ద సెలవుగైకొని రాముడు ముందుకు నడచెను. సీతా రామ లక్ష్మణులు ఘోరారణ్యమున పోవుచుండిరి. వారికొక రాక్షసుడు కనిపించెను.

## విరాధవధ :

ఆ రాక్షసుడు భయంకరాకారుడుగ నుండెను. వాని పేరు విరాధుడు, వాడు సీతను చూచుటతోడనే పక్షిని పట్టుకొన్నట్లు సీతను పట్టుకొని 'నేను దీనిని పెళ్ళిచేసికొనెద'ననెను. రామ లక్ష్మణులు వానిపై బాణములు వదలిరి కాని అవి వృథాయయ్యెను. విరాధుడు సీతను విడిచి రామలక్ష్మణులను రెండు చేతులతో పట్టుకొని బుజములపై నెక్కించుకొని పరుగెత్తసాగెను. రాముడు రాక్షసుని కుడిచేతిని, లక్ష్మణుడు ఎడమ చేతిని నరికిరి. విరాధుడు శాప విముక్తి జెంది ఇట్లు చెప్పెను. "నేను కుబేరుని అనుచరుడను. నా విధులను అశ్రద్ధ చేసినందున కుబేరుడిట్లు శపించెను. దశరథ రాముడు నిన్ను సంహరించినప్పుడు శాప విముక్తి నొందెదవని చెప్పెను. అట్లే అయ్యెను. ఇచటికి కొలదిదూరమున శరభంగమహర్షి ఆశ్రమముకలదు. అచటికి వెళ్ళుము. శుభమగును." అని చెప్పెను. లక్ష్మణు డొకగొయ్యిని త్రవ్వగా రాక్షసుని అందు పూడ్చివేసిరి.

## శరభంగాశ్రమము :

సీతా రామ లక్ష్మణులు మరికొంతదూరముపోగా శరభంగాశ్రమము కన్పించెను. అతడు బ్రహ్మసాక్షాత్కారము పొందినవాడు.

ఆ మహర్షికి సీతా రామ లక్ష్మణులు పాదాభివందనము చేసిరి. "దశరథ రామా! మహాత్ముడవైన నిన్ను దర్శించిపోవలయునన్న సంకల్పముతో నిలిచియున్నాను. నీ దర్శనము అయినది. ధన్యుడనైనాను. నేనీ దేహము విడిచిపైతును. ఈ అరణ్యమున సుతీక్ష్ణుడను ఋషిగలడు. అయనను దర్శించుము. నీకు నివాసయోగ్యమగు ప్రదేశము చూపగలడు" అని చెప్పి అగ్నిప్రవేశముచేసి బ్రహ్మలోకమునకు బోయెను. కొందఱు మునులువచ్చి రాముని చుట్టుముట్టి, రాక్షసులు తమ తపమున కంతరాయము కలిగించుచున్నారనియు, హింసించుచున్నారనియు, రాక్షసుల సంహరించి తమను కాపాడుమనియు వేడుకొనిరి. తపస్విజనరక్షణము తన విధిగా భావించుచున్నానని రాముడు వారివద్ద సెలవుగైకొని ముందుకుసాగెను.

## సుతీక్ష్ణుని ఆశ్రమము :

సీతా రామ లక్ష్మణులు సుతీక్ష్ణుని ఆశ్రమముచేరి ఆ మునిని సందర్శించిరి. ముని యిడిన ఆతిథ్యమును స్వీకరించిరి. తాను తపముచే సంపాదించుకొన్న పుణ్యమును రామున కిచ్చెదననెను. రాముడందుల కంగీకరింపలేదు. తానే పుణ్యమును సంపాదించుకొందుననెను. తన యాశ్రమమునందే యుండిపొమ్మని ముని యనెను. ఇంకను కొన్ని మున్యాశ్రమముల దర్శింపనెంచితినని రాముడనెను. ఆనాడచటనే యుండి మరునాడుదయమున స్నాన సంధ్యాదుల నెరవేర్చుకొని ముని సెలవుగైకొని బయలుదేరెను.

## సీత హితవు :

ఈ సమయమున సీత భర్త కొక విషయము చెప్పదలచెను. ఆమె ఇట్లనెను. "రామచంద్రా! నేను నీకు చెప్పగలదానను కాను. నీ వెరుగని ధర్మములేదు. అయినను నాకు తోచినది చెప్పెదను. ఆయుధముల ధరించి నీవు దండకారణ్యము సంచారము చేయుచున్నావు.

నాకది యిష్టము లేదు. నిరపరాధులైన వారిని సంహరింపరాదుకదా! ధనుర్బాణములు ధరించి యున్నంత మాత్రమున రాక్షసులనేల చంపవలెను? అరణ్యవాసము చేయుచున్న మనము తపస్సనెడి ధర్మమునే యాచరింతము. అయోధ్యను చేరిన పిదప మరల ఆయుధములు ధరింపవచ్చును. ధర్మానుసరణమువలన సకల శుభములును చేకూరును."

అందులకు రాముడిట్లు జవాబు చెప్పెను. "నీవు నా యెడగల అనురాగముచే చెప్పిన దానికి సంతసమగుచున్నది. క్షత్రియుడు ఆయుధములు ధరించును. దండకారణ్యమున మునులు రాక్షసులవలన బాధనొందుచున్నారు. వారు నన్ను శరణువేడిరి. నేను కాపాడెదనంటిని. నేనిచ్చిన వాగ్దానము తప్పుట ధర్మవిరుద్ధము. నాకు సత్యమే వ్రతము."

పంచాప్సరము :

శ్రీరాముడు ముందును, మధ్యను సీతయు, ధనుర్బాణములు ధరించిన లక్ష్మణుడు వెనుకను అరణ్యమున నడచిరి. మిక్కిలి మనోహరమైన సరోవరమును చూచిరి. జనులెవ్వరును లేని ఆ ప్రదేశమున సంగీతము, వీణా మృదంగ వాద్యములు మ్రోగుచున్న శబ్దములను విని ఆశ్చర్యపడిరి. అప్పుడు చెంతనున్న ధర్మభృత్తు అను మహర్షి ఇట్లు చెప్పెను.

"పూర్వము మాండకర్ణియను మహర్షి గొప్ప తపస్సు చేసెను. ఆ తపమును భంగము చేయుటకై అయిదుగురు అప్సరసలను దేవతలు పంపిరి. ఆ సరోవరమందే వారు గృహముల నేర్పరచుకొని గాన కళా మాధుర్యముచే ఆ మునిని లోబరచుకొనిరి. అప్సరస స్త్రీలతో భోగములనుభవించుచు అతడు తపస్సునే మరచెను. అందుచే దీనికి పంచాప్సరమని పేరువచ్చెను. ఎల్లప్పుడును వారు గానము చేయుచుందురు."

సీతా రామ లక్ష్మణులిట్లు కొలదికాలమటనట పర్ణశాలల నివశించుచు, మున్యాశ్రమముల దర్శించుచు, మరియొక ప్రదేశమునకు

బోవుచు సుఖముగను, ఆనందముగను కాలము వెళ్ళబుచ్చిరి. పది సంవత్సరముల కాలమీరీతి గడచిపోయెను.

అగస్త్యాశ్రమము :

సుతీక్ష్ణునికిచ్చిన వాగ్దానము ననుసరించి రాముడు మరల ఆముని యాశ్రమమునకు వచ్చెను. ఆయన వలన అగస్త్యుని ఆశ్రమమునకు దారి తెలిసికొని వెళ్ళెను.

పూర్వము వాతాపి, ఇల్వలుడను ఇద్దరు రాక్షసులుండిరి. బ్రాహ్మణులను మునులను బాధించుట చంపుట వారి ధ్యేయము. ఇల్వలుడు బ్రాహ్మణరూపము ధరించెడివాడు. వాతాపి మేక అయ్యెడివాడు. దారినబోవు బ్రాహ్మణుని భోజనమునకు బిలిచి మేకనుకోసి వండిపెట్టి, పిమ్మట 'వాతాపీరమ్మ' అని ఇల్వలుడనెడివాడు. బ్రాహ్మణుని పొట్ట చీల్చుకొని వాతాపి బయటకు వచ్చెడివాడు. బ్రాహ్మణుడు మృతి జెందెడివాడు. ఒకసారి అగస్త్యునకు గూడ ఇట్లే జరిగినది. అగస్త్యుడు భుజించిన వెంటనే "వాతాపీ" అని పిలువగా "ఇంకెక్కడి వాతాపి? ఇదివరకే జీర్ణమైనా"డని అగస్త్యుడనెను. వాతాపి చనిపోయినందున కోపముచే ఇల్వలుడు అగస్త్యునిపై కుతికెను. అగస్త్యుని కంటి మంటకు ఇల్వలుడుగూడ మృతిజెందెను. అగస్త్యుడనిన రాక్షసులకు గుండెలు బగులును. రాక్షసులు మునులను బాధించుట చాలభాగము తగ్గెను.

ఒకప్పుడు వింధ్యపర్వతము సూర్యునకు దారికూడ లేకుండు నంతఎత్తుగ పెరుగుచుండెను. ఉత్తర దేశముననున్న అగస్త్యుడు వింధ్యుని అడ్డముగా వరుండుకుని 'దక్షిణ దేశమునకు బోవుచున్నాను. వచ్చువఱకు ఇట్లే యుండు'మనెను. వింధ్యుడట్లే పడియుండెను.

సీతా రామ లక్ష్మణులు అగస్త్యుని ఆశ్రమమునకు వెళ్ళిరి. ఆ మహాముని రాముని సత్కరిం ను. అగస్త్యునకు రాముడు పాదాభివందన మాచరించెను. అక్షయమగు అమ్ములపొదిని, స్వర్ణమయము

రత్నఖచితమగు నొక విల్లును అగస్త్యుడు రామున కిచ్చెను. అచటికి పది యోజనముల దూరమునగల పంచవటియందుండుమని అగస్త్య మహాముని రామునికి జెప్పెను.

జటాయువు;

అగస్త్య మహర్షి వద్ద సెలవుదీసికొన్న సీతా రామ లక్ష్మణులు పంచవటికి ప్రయాణమైరి. దారిలో ఒక పెద్ద మఱ్ఱిచెట్టును ఒక పెద్ద గ్రద్దను చూచిరి. ఆ గృధ్రరాజము పేరు జటాయువు. రాముడు తన వృత్తాంతమంతయు వినిపింపగా తనకు దశరథుడు స్నేహితుడనియు కనుక రాముడు కూడ తనకు ఆప్తుడనియు చెప్పెను. పంచవటి నివాస యోగ్యముగనే యుండుననియు, తాను అచటికి కొలది దూరముననే యుందుననియు జటాయువు చెప్పెను.

పంచవటి - పర్ణశాల :

వారు పంచవటిని జేరిరి అనుకూల ప్రదేశమునుజూచి రాముడు చెప్పిన స్థలమునందు లక్ష్మణుడు చక్కని పర్ణశాల నిర్మించెను. గోదావరి నది అచటికి దగ్గరలోనున్నది. ఆ సమీప ప్రాంతములందే కొందరు ఋషులును గలరు. అది తగిన తావుగనే వారు భావించిరి. అప్పుడప్పుడు మునులువచ్చి రామునితో సంభాషించుచుందురు. మంచి కాలక్షేపముగనే యుండెను.

శూర్పణఖ :

శూర్పణఖ రావణుని చెల్లెలు. ఆమె యీ అరణ్య ప్రాంతమంతయు తిరుగుచుండును. ఒకనాడు ఆమె సీతా రాము లొకచోట ఉండుట చూచెను. రాముడు మిక్కిలి అందగాడు; ఇతడు నన్ను పెండ్లాడిన బాగుండుననుకొనెను. అందవికారముగనుండు ఆ రాక్షస స్త్రీ రాముని వద్దకువచ్చి తన అభిమతమును దెలియజేసెను. తనవిషయమంతయు రామునకు తెలియజేసెను. రాముడును తానిటనుండు నవసర

మును గూర్చి చెప్పెను. "ఈ సీత నీ కేమి సుఖము కలిగించును? నన్ను పెండ్లాడిన నీకు సర్వ సౌఖ్యములు కలుగ గలవు."అని శూర్పణఖ అనెను. "ఇదుగో యీ సీతతో నేనున్నానుకదా! అడుగో మా తమ్ముడు లక్ష్మణుడు. అతడు ఒంటరివాడుగ నున్నాడు; అతని వద్దకు పొమ్ము నీకోరిక తీర్చగలడని రాముడు జవాబిచ్చెను. వెంటనే ఆమె కొలది దూరమున నున్న లక్ష్మణుని వద్దకేగెను. అతడు మంచి అందగాడుగనే యున్నాడు. తనను చేబట్టుమని అతనిని కోరెను. నేను సీతారాముల దాసుడను. వారికి సేవ జేయవచ్చినాను. నన్ను చేబట్టిన నీ కేమి సుఖము కలుగును? నీవు కూడ దాసురాలవై వారికి సేవజేయవలసి యుండును. రాముని కోరుము; అతడే నీ కోర్కె తీర్చగలవాడు" అని లక్ష్మణుడనెను. శూర్పణఖకు కోపము వచ్చెను. మరల రాముని వద్దకు పోయి "మన యిరువురకు మధ్య యీ సీత ఆటంకముగా నున్నది. ఈమెను తినివే యుదును. నాకు సవతిపోరు లేకుండును. నీవు నన్ను దరిజేర్చుకోగలవు." అనుచు సీత మీదపడబోయెను. రాముడదలించి ఆమెను ఆపి. లక్ష్మణా! ఈ నీచురాలితో పరిహాసమేల ? వికృతాంగనగా జేసి పంపుము." అనెను. అంతట లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులను కోసి విడచెను.

ఖర దూషణులు :

రక్తము వరదవలె ప్రవహింపగా, అరణ్యము మారుమ్రోగునట్లు కేకలిడుచు, ఏడ్చుచు శూర్పణఖ అచటకు కొలది దూరమున జనస్థానమందున్న తన అన్నలగు ఖరదూషణుల వద్దకు బోయి భోరు భోరున ఏడ్చెను. చెల్లెలి వికృత రూపమును చూడగానే ఖరుడు మండిపడి వాడెవడో చూపుము సర్వనాశనము చేసెదననెను.

శూర్పణఖ వలన జరిగిన కథనంతయు తెలిసికొని తన వద్దగల సేనానులలో పదునాల్గు మందిని రామునిపై కిపంపి, చంపిరమ్మనెను. వారు వికటాట్టహాసము చేయుచు వచ్చుచుండుటను గమనించి రాముడు

"లక్ష్మణా ! మీా వదినను దీసికొని గుహలోనికి బొమ్ము. ఈ వచ్చు వారిపని నేను జూచెదననెను. లక్ష్మణుడట్లే చేసెను.

విల్లు నమ్ముల చేతబట్టి ప్రళయకాల రుద్రునివలె రాముడు నిల చెను. పదునలుగుర రాక్షసులను సంహారించెను. అది వినిన ఖరుడు తనకడగల బలిష్ఠులగు పదునాల్గువేలమంది రాక్షసులతో భయంకర ముగా వచ్చి ఘోరయుద్ధము చేసెను. దూషణుడు కూడ వచ్చి వారిని కలిసికొనెను ఇంతమందివేయు బాణములు, శూలములు, ఈటెలు మున్నగువాని నన్నిటిని ఒక్క రాముడు అత్యంత పరాక్రమముతోను, నేర్పుతోను త్రుంచివైచి మహాస్త్రములను ప్రయోగించి ఖరుని, దూష ణుని గూడ సంహారించెను. అడవి యంతయు రాక్షసుల శవములతో నిండిపోయెను.

ఔరా! రాముడెంత ప్రతిభాశాలి. ఎంతటి ఘనకార్యము చేసి నాడు. అతడసామాన్యుడుకదాయని పొగడుచు ఆకసమునగల దేవతలు తమ నెలవులకుచనిరి. మునులు రాముని కొనియాడిరి.

లక్ష్మణుడును సీతయు గుహనుండి వెలుపలకువచ్చి రాముని శ్లాఘించి పూజించిరి.

ప్ర తీ కా ర ము :

జనస్థానమునగల రక్కసులలో అకంపనుడను వాడెట్లో తప్పించు కొనెను. రాక్షస సంహారణమునుగూర్చిన ఉదంతమంతయు లంకాధిపతి యగు రావణున కెఱుకపరచెను. రావణుడు కండ్లెఱ్ఱజేసి నిప్పులు గ్రక్కెను. ఇప్పుడేపోయి ఆరాముని చీల్చి చెండాడెదననెను.

ప్రభూ! తొందరపడవద్దు. రాముని బలపరాక్రమములు పూర్తిగ తెలుసుకొనుము. అతడు అసాధ్యుడు. యుద్ధమున నాతని గెలుచుట దుర్లభము. దేవదానవులు కలిసి వెళ్ళినను రాముని గెలువగలరని

నేననుకొనను. నాకుతోచిన ఉపాయము చెప్పెదను ఆలోచింపుము. రాముని భార్య సీత. చాల చక్కనిది. రాముని కామెయెడ మక్కువ ఎక్కువ. ఏదేని తంత్రముబన్ని సీతను దీసికొని వచ్చితివా, ఆమె వియోగము సహింపలేక రాముడు ప్రాణములు విడచును. అని అకంప నుడు మార్గమును బోధించెను.

రావణునకీ పథకము నచ్చెను. ఎటులైనను ప్రతీకారముచేసి సీతను సాధించి రాముని చావు చూడగోరెను. వెంటనే రథము నెక్కి మారీచుని ఆశ్రమమునకు బోయి తనకు తోడ్పడగోరెను. 'రాజేంద్రా' రాక్షసకులము సర్వనాశనమునకే మీ కెవడో యీ ఉపాయము చెప్పినాడు. రాముడసామాన్యుడు, నీవులంకకు బోయి నీ భార్యతో సుఖముగానుండుము; అని హితము పదేశించెను. రావణుడు బదులు పలుకక లంకకుపోయెను. మారీచుని మనసుకుదుటపడెను.

రావణుడు కొలువుదీర్చి యుండెను. రోదనము జేయుచు శూర్పణఖ వచ్చి జనస్థానమున జరిగిన సంక్షోభమును గూర్చియు, తనకు జరిగిన అవమానమును గూర్చియు అన్నతో మొఱబెట్టుకొనెను. "సౌందర్యరాశియగు సీతను దెచ్చి నీకు భార్యగా చేయుదమనిపోయిన నాకు లక్ష్మణుడిట్టి శిక్ష విధించినాడు. నీవుపోయి సీతను దెచ్చుకొని సుఖింపుము. నీ విట్లొనరించితివేని నీవు సుఖపడుటయేగాక పదునాల్గు వేలమంది రాక్షసులనుచంపిన రాముని ప్రతీకారమున సాధించిన వాడ వగుదువు. 'ఆలసింపకు'మనెను.

### అపరబుద్ధి :

రావణునకు మరల సీతపై మనసు బోయెను. ఎటులైనను సీతను తాను తీసికొనిరావలెననియే సంకల్పించెను. కుతంత్రమున సీతను దొంగిలించి వచ్చుటయే శ్రేయస్కరముగ తోచెను. వెంటనే మరల మారీచుని వద్దకు బోయెను. మారీచుడాశ్రమమున తపస్సుజేసి కొనుచుండెను. రావణుని జూచి మర్యాదజేసెను.

మారీచా ! నీవు ఉపాయశాలివని నీకడకు వచ్చితిని. సీతను నేను గొనివచ్చుటకే నిశ్చయించితిని. ఇందు కడ్డుజెప్పకుము. నీవు ఒక బంగరు లేడిరూపమున ఆరాముని పర్ణశాల చెంత తిరుగాడుము. సీత నిన్ను జూచి తనకు తెచ్చియివ్వమని రామలక్ష్మణులను కోరును. వారు లేడి కొఱకై పోవుదురు. ఒంటరిగానున్న సీతను నేను తీసుకొని వచ్చెదనని రావణుడు చెప్పెను. అందులకు మారీచుడు తన పూర్వ అనుభవమును గూర్చి చెప్పి,

శ్లో॥ దృష్ట్వాస్వప్నగతం రామముద్భ్రమామివిచేతనః
రకారాదీని నామాని రామత్రస్తస్య రావణః !
రత్నానిచ రథాశ్చైవత్రాసం సఙ్జనయన్తి మే
అహం తస్యప్రభావజ్ఞో న యుద్ధం తేన తేక్షమమ్॥

నాకుకలలో రాముడు కన్పించి నను భయభ్రాంతుడనగుదును. రాముడ నగనే భయముకలుగును. అందువలననే రకారము మొదటగల రత్నములు, రథములు మున్నగు పేర్లు కూడా నాకు భయమునే కలిగించును. నేను ఆ రాముని ప్రభావము బాగుగా ఎఱుగుదును. కాబట్టి రామునితో విరోధము, యుద్ధము నీకెంత మాత్రము పనికిరాదు, అనెను. మారీచుడు రావణునకెన్నియో నీతులు చెప్పి రామునితో వైరము కూడనిపనియని యాతని మనసు మరల్ప ప్రయత్నించెను. అందుకు రావణుడు 'మారీచా! ఇది రాజాజ్ఞ. నేనుచెప్పినట్లుచేయకున్న నాచేతి మరణము నీకు తప్పదు.' అని బెదరించెను.

రావణుడు కఠినుడు. వినువాడు కాడు. చావుదగ్గర పడినప్పుడు మిత్రుల హితము చెవికెక్కదు. వీనిచేతులో చచ్చుటకన్న రాముని చేతిలో చచ్చుటయే మేలు అని తలచుచు మారీచుడు రావణుని ఆజ్ఞ శిరసావహించెను.

బంగరు లేడి :

మారీచుడు బంగరులేడిగనయ్యెను. రత్నకాంతులను వెదజల్లు చున్న ఆ మాయ లేడి రాముని పర్ణశాల సమీపమున మేయుచు గంతులు వేయసాగెను. ఇంపునింపు ఆ లేడి కన్పింపగనే సీత ముచ్చట పడెను. దాని సౌందర్యమున కచ్చెరువొంది రామలక్ష్మణులను బిలిచి చూపించెను. అపరూపముగనున్న ఆ లేడిని చూచుటతోడనే ఇది మాయలేడిగ నున్నది. ఈ ప్రాంతముల మారీచుడు మోసకృత్యములు చేయుచు తిరుగు చుండునని వినియుంటిని. ఈ బంగరు లేడి మారీచుడే కావచ్చును, అని లక్ష్మణుడనెను.

ఈ లేడి ఎంతో మనోహరముగనున్నది. దానినట్లే పట్టి తెచ్చిన మనము పెంచుకొనవచ్చును. అయోధ్యకును తీసికొని పోవచ్చు. లేదా చంపి తెచ్చినను దాని చర్మము పర్ణశాలలో శోభాయమానముగ నుండ గలదు, అని జానకి అన్నది.

లక్ష్మణా! లేడి యెడల మీ వదిన మక్కువపడుచున్నది. దానిని పట్టి తెచ్చెదను. ఒకవేళ నీవనినట్లు రాక్షస మాయయే అయిన దానిని సంహరించుట యుక్తమే అగును. ఎన్నడును ఏమియు అడుగని సీత కోర్కె దీర్చుటుచితము. నీవు మాత్రము ఆయుధపాణివై సీతవద్ద కాపుండుము. అని రాముడాజ్ఞనిడి లేడి వెంటబడెను.

ఆ మాయలేడి చిక్కినట్లే దగ్గరకువచ్చి మరల చెంగు చెంగున గంతులువేయుచు సుదూరము పోవుచు ఆ మహారణ్యములో రాముని ఎంతయో దూరము తీసికొనిపోయెను. రాముడును విసుగుజెంది యిక దానిని పట్టుకొనిపోవు ప్రయత్నము విరమించి, చంపుటకై బాణము వదలెను. అది ఆ లేడికి గ్రుచ్చుకొనగా నేలబడెను. "హా సీతా! హా లక్ష్మణా!" అని రాముని కంఠధ్వనివలె పెద్ద కేక వేయుచు రాక్షసుడగు

మారీచుడు నిజస్వరూపమును బొంది ప్రాణములువదలెను. తన గొంతుక వలె వేయబడిన కేకను రాముడు ఆతురతతో ఆశ్రమమువైపు పోసాగెను.

సీతయు, లక్ష్మణుడును ఆ కేక వినిరి. సీత కలతజెంది, ఒడుదుడుకులు లేక నిలచియున్న లక్ష్మణునితో "వింటివిగదా కేక! నీ యన్నకేమో ఆపద కలిగినట్లున్నది. నాయెడల దురుద్దేశ్యముతో నీ విటనుండి కదలకున్నావు" అని సీత కఠినముగ బలికెను. తన విషయము తెలిసియుండియు సీత యిట్లు బలుకుచున్నందులకు లక్ష్మణుడు విచారపడి, "నీవిట్లనుట ధర్మముకాదు. ముల్లోకము లెత్తివచ్చినను మాయన్నకెట్టి యాపదయు జరుగనేరదు. ఇది రాక్షస మాయ. నిన్ను కనిపెట్టుకొని యుండవలసినదన్నట్టి రాముని యాజ్ఞను నేను పాటించవలయును. నేను వెళ్ళను" అనెను. "నీవు మోసగాడవు. నన్ను కోరి మా వెంట వచ్చినావు. ఇప్పుడేపోయి గోదావరిలో దూకెదను. లేదా ఉరిబోసికొందును" అని సీత యేడ్చెను. ఇక ఒకక్షణమైనను నిలువ లక్ష్మణునకు మనసొప్పలేదు. "నేను రాముని వద్దకు వెళ్ళుచున్నాను. నీకు శుభమగుగాక. ఓ వనదేవతలారా! యీమెను కాపాడుచుండుడు." అని లక్ష్మణుడు పిలుపు వినవచ్చిన దిక్కుగా వెళ్ళెను.

సీతాపహరణము :

లక్ష్మణుడు వెళ్ళుట కనిపెట్టియున్న రావణుడు సన్యాసి వేషమున పర్ణశాల వద్దకు వచ్చెను. కాషాయవస్త్రములు, దండకమండలములు, గొడుగు వేసికొని యుండెను. అతనికి సీత అతిథిసత్కారము చేసెను. భోజనము చేయుమనెను. తన కథ అంతయు చెప్పుమని అడిగిన సన్యాసికి క్లుప్తముగ సీత తెలిపెను.

"తమవృత్తాంతము తెలుపు"డని సీత సన్యాసినికోరెను. తన వృత్తాంతమంతయు వివరించుచు సన్యాసి,

చ. కమల భవుండు తాత, గుణగణ్యుఁడు తండ్రి, హే
మమయ వినూత్న రత్నమయ మండిత హర్మ్యపురంబులంక, వి
క్రమము త్రిలోక భీకర మఖండ శుభాకరమైన దైత్య రా
జ్యమునకు నేను భర్త ఇటు శౌర్యుఁడ రావణనామధేయుఁడన్॥
[భాస్కర రామాయణము]

సుందరాంగీ ! నిన్ను లంకకు రాణిగ జేతును. నన్ను పెండ్లాడి సుఖించుము" అనెను.

సీతకు దుఃఖము వచ్చెను; కోపమును వచ్చెను. "రాముడు అసదృశుడు, పరాక్రమవంతుడు. నన్నుకోరి నిన్ను నీవే నాశనము చేసికొనకుము." అని సీత గద్దించెను. మరియు నిట్లనెను.

మ. గరళంబెత్తుక క్రోలగా దలచితే కష్టాత్మ కందర్పసం
హరు జక్రాయుధు బద్మజుంగడచు నుద్యత్తేజు శ్రీరాముఁ నె
వ్వరిగా జూచెద వా ఖరాంతకుని తీవ్ర క్రూర బాణాగ్నిచే
ధరణిం గూలెద వేల ప్రేలెదవు బద్ధస్పర్ధ దుర్వాక్యముల్॥
[భాస్కర రామాయణము]

సన్యాసి వేషము వదలి రావణుడు భయంకరాకారుడై నిలచెను. సీత గజ గజ వణకిపోయెను. "సీతా ! నా శక్తి తెలియక మాట్లాడుచున్నావు. స్వర్గమును జయించినాను. దిక్పాలకులు నా ఆజ్ఞ మేరకు వర్తింతురు. సూర్యుడు నేను చెప్పినట్లునడచును. రాము నిపై ఆశవదలి నాతో రమ్ము." అనుచు ఎడమ చేతితో ఆమె జుట్టు పట్టుకొని, కుడిచేత తొడలక్రిందుగా చేయివేసి కఠినముగ మాట్లాడుచు ఆమెను ఎత్తి రథముపై కూర్చుండ బెట్టెను. 'హారామా ! హాలక్ష్మణా !' అని సీత ఏడువసాగెను.

జటాయువు పోరాటము :

సీత దుఃఖించుచు, అరచుచు, కేకలు వేయుచు పోవుచు చెట్టు కొమ్మపైనున్న జటాయువును గాంచెను. 'జటాయూ ! ఈ దురా్త్మ

గ్గుడు నన్ను బలవంతముగ దీసికొని పోవుచున్నాడు. రామలక్ష్మణులకీ వార్త నెట్ులైనను నీవు చెప్పుము' అనెను. తేరిపాఱజూచి జటాయువు 'ఓరీ నీచుడా, నిన్ను విడతునా? రామునకు నేను సహాయము చేయ వలసి యున్నది. సీతను విడువుము. అనుచు రావణుని ముక్కుతో పొడుచుచు, గోళ్ళతో గీరుచు బాధించెను. రావణుడు దానినదలించి కొట్టెను. జటాయువు రావణుని రథము ముక్కలు చేసెను. వాని రథమునకు కట్టిన కంచరగాడిదలను చంపెను. రావణుని యెడమవైపు పదిచేతులను ఖండించెను. కాని అవి మరల మొలచెను. రావణుడు ఉగ్రుడై ఖడ్గమును దీసికొని జటాయువు రెండు రెక్కలను నఱికి వేసెను. రక్తము ప్రవహింపగా పాపమా గ్రద్ద నేలబడెను. గ్రద్దవద్దకు బోయిన సీతను జుట్టుపట్టుకొని లాగుకొని వచ్చి రావణుడు తన యెడమ చంకను వేసికొని ఆకాశమార్గమున కెగిరిపోయెను.

సీత పెనగులాడుటలో ఆమె రత్నహారములు చిందర వందరగా భూమిపై పడెను. ఆకాశ మార్గమున బోవునప్పుడు కొన్ని ఆభరణములు రాలిపోయెను. [illegible] దూ[illegible] తరువాత ఒక కొండపై వానరపంచకము [illegible] చుండుట [illegible] చెను. రామలక్ష్మణులకు తన జాడ తెలియజెప్పుటకు కొంత ఆధా[illegible] పైట చెఱగు చించి, కొన్ని ఆభరణముల నందు [illegible] వేసెను. ముందు చూపుతో నున్న రావణుడది చూడలేదు. కొండపైగల వన చరులామూట [illegible]చిరి.

### సీత లంకాప్రవేశము :

రావణుడు సీతను తన లంకా పట్టణమునకు గొంపోయెను. మహాభవనము నందలి తన ఐశ్వర్యమామెకు చూపెను. తరువాత అశోకవనము నందామెను విడచెను. 'నన్ను నీవు పెండ్లాడిన దేవతలు నీకు దాసులగుదురు. నేనును నీకు దాసుడ నగుదును." అనెను. ఒక

గడ్డి పఱకనడ్డముగ బెట్టి సీత, "నా రాముని పరాక్రమ మెఱుగక నీ విట్లు పదఱుచున్నావు. నీకుచేటు కాలమాసన్నమైనది. రాముని దక్క అన్యపురుషుని నేనొల్లను." అని ఖండితముగ జెప్పెను. కొందరు రాక్షసాంగనలకు ఆమెను అప్పగించి 'ఈమెను భద్రముగ చూడుడు. కావలసినది యిండు; ఆమెనేమియు మీరు అనరాదు' అని రావణుడాజ్ఞాపించెను.

'సీతా! నీ కొక సంవత్సరము గడువొసంగు చున్నాను. ఆలోచించుకొనుము. నీ బుద్ధి మార్చుకొనని యెడల నిన్ను ముక్కలు ముక్కలుగ నఱికి వంటవారు నాకు ఉదయపు భోజనములో వండి పెట్టుదురు. మూడు లోకములయందును నన్ను ఎదురించువారు లేరు. నీకు సాయపడువారు లేరు. ఇక రామునిపై ఆశవదలు కొనుము." అని పరుషముగ చెప్పి రావణుడు వెడలెను. సీత దుఃఖపరవశ అయ్యెను.

**రాముని శోకము :**

రాముడు తనకెదురుగ వచ్చు చున్న లక్ష్మణుని జూచెను. 'లక్ష్మణా! సీతను ఒంటరిగా వదలి యేలవచ్చితి' వనెను. జరిగినకథ లక్ష్మణుడు చెప్పి దుఃఖించెను. వారు త్వరత్వరగ పర్ణశాలను జేరిరి. సీత కన్పింపలేదు. పర్ణశాలకళావిహీనముగ గన్పట్టెను. 'సీతా! సీతా!!' అని రాముడు బిగ్గరగ కేకలు వేసెను. జవాబులేదు. రామునకు దుఃఖము వచ్చెను. 'అన్నా! విచారపడకుము. ఆమె గోదావరి కేగి యుండును. లేదా! ఏ పొదరింటనైన పరిహాసమునకు దాగి యుండును. వెదకుదము' అని లక్ష్మణుడనెను. వారు వెదుక నారంభించిరి. కేకలు వేసిపిలిచిరి. జవాబు లేదు. ప్రకృతి యంతయు తేజోవిహీనముగ రామునకు కన్పట్టెను. "ఏ రాక్షసుడో సీతను తిని యుండును. సీత లేని నా బ్రదుకేల నేనిక జీవింపజాల" నని రాముడు వాపోయెను.

పర్ణశాల సమీపమున చిందరవందరగ పడియున్న విఱిగిన రథపుముక్కలు, సీత అడుగులతో బాటు మరిపెద్దఅడుగుల జాడలు రత్నములు, పూవులు, తునాతునకలైయున్న రత్నకిరీటము మున్నగు చవి పొడగట్టెను. ఏదియో విపరీతము జరిగినదని వారు భావించిరి. చెట్టులు, పుట్టలు, కొండలు, కోనలు వెదుక నారంభించిరి. ఒకచోట మూలుగుచు, ఱెక్కలు తెగి, కొనయూపిరితో నున్న జటాయువు కన్పించెను. రావణుడు సీత నెత్తుకొని పోవుటయు, తనకును వానికిని జరిగిన యుద్ధమును తన రెక్కల నా అసురుడు తెగనఱుకుటయు, దక్షిణాభిముఖముగ రావణుడేగుటయు చెప్పి జటాయువు ప్రాణములు వదలెను.

తనకొఱకై జటాయువు మరణించెనని రాముడు దుఃఖించెను. ఆ పక్షికి అగ్నిసంస్కారము చేసి పిండప్రదానము చేసెను. రామలక్ష్మణులు సీతను వెదకుచు, విలపించుచు, దక్షిణాముఖముగా వెళ్ళిరి.

క బం ధు డు :

రామలక్ష్మణులు కొంత దూరము వెదకుచుపోయిరి. అది క్రౌంచారణ్యము. అందు వికృతరూపుడగు ఒక రాక్షసుడు కన్పించెను. వాని తల పొట్టలో నున్నది. ఒంటి కన్ను, ఆమడ పొడవుచేతులు. ఉన్నచోటి నుండి కదలక ఎంత దూరముననున్న జంతువులనైనను పట్టుకొని తినగలడు. రామలక్ష్మణులనుగూడనట్లే పట్టుకొనెను. వారిరువురును వాని చేతులను ఖండించిరి. రాముని వృత్తాంతమంతయు అడిగి తెలిసికొనిన కబంధుడు తనకథను చెప్పెను.

కబంధుడు ధనువు కుమారుడు. గొప్ప తపస్సుచేసి చిరంజీవి అయ్యెను. ఇంద్రునిపై దండెత్తుటవలన దేవేంద్రుడు వానినోడించి తలను పొట్టలో దూర్చెను. కొంత కాలమునకు రాముడు వచ్చి నీ

చేతులు ఖండించుము. అప్పుడు నీకు స్వర్గము ప్రాప్తించుననియు చెప్పెను. తనను దహనము చేసిన యెడల శాపవిముక్తినొంది, దివ్య జ్ఞానముచే సీతను గూర్చి చెప్పెదననెను.

రాముడు కబంధునకు అగ్నిసంస్కారము గావించెను. అతడు దివ్య శరీరమును దాల్చి ఇట్లు చెప్పెను. "ఇచటికి కొంతదూరములో వాలి, సుగ్రీవులను అన్నదమ్ములున్నారు. అందు సూర్యపుత్రుని స్నేహము చేయుము. ఆ వానరశ్రేష్ఠునికి నీవు మేలుజేసి వాని వలన మేలును పొందుము. శుభము కలుగును. నీవుపోవు మార్గములో మతంగమహాముని ఆశ్రమమున శబరియున్నది. ఆమెనడిగి సుగ్రీవుడున్న తావు తెలుసుకొనుము." అని అతడదృశ్యుడయ్యెను.

## శబరి :

కొంత దూరము ప్రయాణము జేసి శబరియున్న ఆశ్రమమును జేరిరి. రాముని గూర్చి యిదివరకే వినియున్న శబరి ఆతడు వచ్చుట తోడనే యథావిధిగ సత్కరించి పూజించెను. మతంగ మహాముని యొక్క ఆశ్రమము, ఆమహాముని ఎంతో కాలము క్రిందట ఆర గట్టిన వస్త్రములు మున్నగునవి చూపెను. "నన్ను భక్తితో పూజించినావు గనుక నీవు నీకోరిక ప్రకారము స్వర్గమునకు పొమ్ము" అని రాముడనెను. ఆవృద్ధురాలగు శబరి తన దేహమును అగ్నియం దాహుతి చేసి దివ్యశరీరము ధరించినదై స్వర్గమునకు బోయెను.

శబరి వలన మార్గమును దెలిసికొనిన రామలక్ష్మణులు చాల దూరము నడచి ఆమె చెప్పిన గుర్తుల ననుసరించి ఒక అందమైన సరస్సును జూచిరి.

అదియే పంపాసరస్సు.



# కిష్కింధకాండ

## పంపాసరస్సు - రాముని విరహము :

పంపా సరోవరము మిక్కిలి అందమైనది. నిర్మలమైన, మధుర మైన నీరు-అందలి వికసించిన తామరపూలు రమణీయముగ నుండెను. తీరప్రాంతమందలి పచ్చని చెట్లు, కొన్నిట వికసించిన పూవులు, కొన్నిట మధురఫలములు చూడముచ్చటగనుండెను. అచట వీచుగాలి చల్లగను, పుష్పసౌరభముతో కూడి మనోహరముగను నుండెను. ఈ ప్రకృతి రామణీయకత రాముని కడుంగడు ఆనంద పరవశుని జేసెను. కాని ఆ యానందము సీతను స్ఫురింపజేసెను. రాముడు మన్మథ బాణాగ్నికి లోనయ్యెను. ఈ సమయమున సీతయేయున్న మేమెంత సుఖమును అనుభవించి యుండెడివారమో కదా! అని వాపోయెను.

లక్ష్మణుడన్నను ఉపశమింపజేసి ధైర్యవచనముల బలికెను. సీత నపహరించిన ఆ ఖలుడు జీవించజాలడు. తప్పక సీత నిన్ను అనతికాలము ననే చేరగలదు. దుఃఖమును విడువుము. అని లక్ష్మణుడనెను

## శ్రీరామాంజనేయ ప్రథమ సమావేశము :

రామలక్ష్మణు లిరువురును శబరి చెప్పిన ఆనవాలులననుసరించి ఋష్యమూక పర్వత దిశగానడచిరి. పర్వతము సమీపించిరి. పర్వత ముపై సుగ్రీవుడు దూరమున వచ్చుచున్న రామలక్ష్మణులను చూచెను. మహా వీరులవలె గన్పట్టిరి. కాని వారు ముని వేషధారులై యుండిరి. వాలి పంపగా వచ్చి మారువేషముల తిరుగుచున్న యోధు లని సుగ్రీవుడు సందియమందెను. వెంటనే వేరొక శిఖరముపైకి పోయెను. హనుమంతుడు మున్నగు అనుచరులెల్ల చుట్టును చేరిరి.

ఈ కొండపై నున్నంతకాలము వాలి వలన కీడు జరుగదు. నీవు భయపడవలసిన కారణము లేదు, అని ఆంజనేయుడు ధైర్యము

చెప్పెను. కాని సుగ్రీవుడు తృప్తినొందలేదు. "వారివాలకములు అనుమానాస్పదముగనున్నవి. నీవు ప్రాకృత వేషమున వెళ్లి వారి విషయము తెలుసుకొనుము." అని సుగ్రీవుడనగానే హనుమంతుడు భిక్షుక రూపమున రామలక్ష్మణుల సమీపించెను.

హనుమంతుడు వారిని గురించి ప్రశ్నించెను. వారేమియు బదులు చెప్పలేదు. అప్పుడు తన సంగతి హనుమంతుడు చెప్పెను. 'ఇచట సుగ్రీవుడను వానర శ్రేష్ఠుడున్నాడు. అతడు ధర్మబుద్ధి కలవాడు. అన్నయగు వాలిచే తరిమి వేయబడి యీ పర్వతముపై నున్నాడు. నేనాతని పనుపున వచ్చినాను. నన్ను హనుమంతు డందురు. మా ప్రభువు మీ చెలిమిని కోరు చున్నాడు. అందు వలనే భిక్షుక రూపమున నేను మీ వద్దకు వచ్చినాను.' అనెను.

ఈ హనుమంతుడు వేదములధ్యయనము చేసినవాని వలె నున్నాడు. వ్యాకరణమును గూడ చదివియే యుండవలెను. ఇతని మాటల యందు ఒక్క అపశబ్దమైనను లేదు. ముఖ లక్షణముల బట్టి యితడు కడు నేర్పరి వలెనున్నాడు. ఇట్టి వారు దూతలుగా ప్రభువుల కార్యములు సాధించగలరు. అని చెప్పుచు రాముడు, "లక్ష్మణా! మన మెవరి కొఱకు వెదకుకొనుచు వచ్చితిమో అతని మంత్రియే మన వద్దకు వచ్చినాడు. ఇతనితో మన సంగతి చెప్పుము." అనెను.

లక్ష్మణుడు తమ వృత్తాంతము క్లుప్తముగా చెప్పెను.

శ్లో॥ సర్వలోకస్య ధర్మాత్మా శరణ్య శ్శరణం పురా
గురుర్మే రాఘవ స్సోఽయం సుగ్రీవం శరణం గతః ॥

సర్వలోక రక్షకుడగు మా యన్న యీ రాముడు మీ ప్రభువు సుగ్రీవుని శరణుపొందు చున్నాడనెను.

హనుమంతుడు నిజరూపమును పొంది, సూర్యవంశ ప్రభువులైన మీకును సూర్యుని పుత్రుడగు సుగ్రీవునకును చెలిమికుదురును రండు

పోదమని హనుమంతుడు రామలక్ష్మణులను తన భుజములపై నెక్కించు కొని, గంతులు వేయుచు పర్వతాగ్రమున నున్న సుగ్రీవుని వద్దకు తీసికొని వెళ్ళెను. వారల నొకరికొకరిని పరిచయము చేసెను. సుగ్రీవుడు సంతసించెను.

సుగ్రీవుడు చేయిచాచి స్నేహము నర్థించెను. రాముడును సుగ్రీవుని చేయి గట్టిగా పట్టుకొనెను. హనుమంతుడు ఎండు పుల్లలను తెచ్చి ఒరిపిడిచే నిప్పుజేసెను. రామ సుగ్రీవులు అగ్నికి ప్రదక్షిణము జేసి అగ్నిసాక్షిగ సుస్థిరమగు స్నేహమును జేసికొనిరి. 'నీ సుఖమే నా సుఖము – నీ దుఃఖమే నా దుఃఖము' అని సుగ్రీవుడనెను.

విరగబూచిన మద్దికొమ్మను దెప్పించి దానిపై రాముని ఆసీను నిజేసి; వాలి వలన తనకు గలిగిన భయమును జెప్పి, ఆతని వలన భయము లేకుండునట్లు, అభయ మీయ సుగ్రీవుడు కోరగా రాముడిట్లనెను. 'కపీంద్రా! మిత్రులకు సహాయము చేయవలెనని నాకు తెలియును. నీ భార్యను అపహరించిన వాలిని నేను వధింతును.' అని అభయమిచ్చెను.

నగల మూట :

ఆకాశమార్గమున రావణుడు సీతనెత్తుకొని పోవుట చూచితిమి. ఆమె 'హా రామ! హా లక్ష్మణా!' అనుచు విలపించుటను వింటిమి. ఆమె పోవునపుడు ఈ కొండపై జార్చిన నగలమూట యిది. చూడుడని సుగ్రీవుడు భద్రపరచిన సీత నగలమూటను తెప్పించి రాముని ముందు పెట్టెను.

వానిని చూచుట తోడనే రాముని కనుల నిండ నీరు గ్రమ్మెను. 'హా సీతా' అని దుఃఖించుచు నేలపై పడిపోయి మరల కొంత వడికి లేచి 'లక్ష్మణా! ఇవి మీ వదిన నగలేమో చూడుము' అనెను.

శ్లో॥ నాహం జానామి కేయూరే నాహం జానామి కుణ్డలే
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్ ॥

తే. గీ ఎఱుగనయ్య! కేయూరమ్ము లెఱుగ గుండ
లమ్ము లటు లాతిసొమ్ముల యిమ్ము లెఱుగ
నమ్మ నూపురముల మాత్రమరయ గాంతు
నిచ్చలు బదాభి వందన నిరతిజేసి॥

[శ్రీరామకథా౽మృతము]

లక్ష్మణుడు "నేను ఆమె కేయూరములను, కుండలములను ఎరుగను. అను దినము పాదాభివందనము చేయుచుందును. గనుక కాలి అందియలు మాత్రము గుర్తింపగలను" అనెను. రాముని దుఃఖమును సుగ్రీవుడు ఉపశమింపజేసెను. ఆదురాత్ముడెచట నున్నను సీతను విడిపించుకొనివచ్చు ప్రయత్నము చేయుదును. ధైర్యమూనుడనెను.

పిదప వాలిని గురించి వివరింపుమని కోరిన రామునకు సుగ్రీవు డిట్లు చెప్పెను.

వా లి క థ :

ఋక్షరజసుడను వానర శ్రేష్ఠుడు కిష్కింధ నేలుచుండెను. అతని కుమారులు వాలి, సుగ్రీవులు. తండ్రి తదనంతరం కిష్కింధకు వాలి రాజయ్యెను. సుగ్రీవుడు యువరాజయ్యెను.

మయుని కుమారులు దుందుభి, మాయావి; మహాబలశాలురు. ఒకప్పుడు వాలికిని మాయావికిని యుద్ధము సంభవించెను. వారొక బిలములో దూరిరి. ఒక సంవత్సరము వఱకు తనకై వేచియుండుమనియు, అప్పటికి రాని యెడల తాను చనిపోయినట్లు భావించుమనియు వాలి సుగ్రీవునితో చెప్పెను. కాని ఏడాదిగడచినను వాలి వెలుపలకు రాలేదు. రక్తము, నురగలు బిలము నుండి వచ్చెను. వాలి మరణించినాడని భావించిన వానరులెల్లరు బలవంతమున సుగ్రీ

వుని రాజుగా చేసిరి. మాయావి బయటకు రాకుండు నట్లు బిలద్వారము వానరులు మూసివేసిరి.

మంచి చెడుగ పరిణమించెను. మాయావిచంపి కొంతకాలమునకు వాలి కిష్కింధచేరెను. తనను చంపి కిష్కింధనేలవలయునని సుగ్రీవుడు బిలము మూయించినట్లును, కిష్కింధకు రాజయినట్లును వాలి తలచెను. ఎవరెంత చెప్పినను వాలి నమ్మలేదు. నిజము గ్రహించలేదు. తాను గద్దెదిగి వాలిని వానర రాజ్యమును పాలించుమని సుగ్రీవుడు ప్రాధేయ పడెను. వాలికి జాలికలుగలేదు. తృప్తి జెందలేదు. సుగ్రీవుని భార్యయగు రుమను కాజేసి సుగ్రీవుని చంపుటకై తరిమి తరిమి కొట్టెను.

సుగ్రీవునికంటె వాలి మహాబలశాలి. ప్రతి దినమును నాలుగు దిక్కుల యందుగల నాలుగు సముద్రలకడకుబోయి సూర్యునకు అర్ఘ్య ప్రదానమిచ్చి తెల్లవారుసరికి కిష్కింధ జేరుచుండును ఒకప్పుడు తనను పట్టుటకు వచ్చిన రావణుని చంకల క్రింద ఇరికించుకొని నాల్గు సముద్రములు త్రిప్పి నీటముంచి బుద్దిజెప్పి పంపివైచెను.

మాయావి అన్న దుందుభి. వెయ్యి యేనుగుల బలముకలవాడు. దున్నపోతు ఆకారముననుండు రాక్షసుడు. యుద్ధముచేయ నువ్విళ్ళూరుచు సముద్రునిపై బడగా హిమవంతుని జూపెను. హిమవంతుడు వాలి నీకు చాలిన బలశాలి పొమ్మనెను. దుందుభియు, వాలియు ఘోర యుద్ధము చేసిరి. తండ్రియగు దేవేంద్రుడు ఒకప్పుడు తన కొసగిన హేమమాలను ధరించి యుద్ధమునకు పోయినందున మాల ప్రభావముచే దుందుభి బలము క్షీణించి వాలికి విజయము చేకూరెను. దుందుభిని చంపి వాని కొమ్ములుబట్టి విసరివేసెను. ఆ మృతకళేబరము ఋష్యమూక పర్వతమున తపముజేయుచున్న మతంగ మహాముని సమీపమునబడి నెత్తురు చిందెను. కన్నుమిన్ను తెలియక తనపై నెత్తురు పడునట్లు దున్నపోతును విసరివేసిన దుష్టుడు ఋష్యమూక పర్వతమునకుగాని,

చుట్టును ఆమడ దూరము మేరలోనికిగాని వచ్చినయెడల తల పగిలి చచ్చుగాకయని శపించి అటనుండి లేచి మరొక ప్రదేశమునకు బోయెను.

హనుమంతునకీ సంగతి జ్ఞప్తికివచ్చి సుగ్రీవుని ఋష్యమూక పర్వతముపైకిచేరి భద్రముగ నుండుమనిచెప్పెను. నాటినుండి సుగ్రీవుడు వాలి బెడదలేక హనుమదాదులగు అనుయాయులతోగూడి ఆ పర్వతముపై కాలక్షేపము చేయుచుండెను.

వాలి అయోనిజయగు తారను వివాహమాడి, తమ్ముని భార్యయగు రుమనులోగొని కిష్కింధాధిపతియై సుఖమనుభవించు చుండెను.

సప్తసాలభంజనము :

సుగ్రీవునకును రామునకును సఖ్యము కుదిరెను. వాలిని చంపుదు నని రాముడభయమిచ్చెను. కాని వాలి బలపరాక్రమములు సంపూర్ణముగ తెలిసియున్న సుగ్రీవునకు రాముని శక్తి సామర్థ్యములు బాగుగ తెలియవు. రాముడు వాలిని చంపగలడాయని సందేహించెను. రాముని పరీక్షించుట యుక్తమనుకొనెను.

"అదియే మాఅన్న వాలి విసరివేసిన దుందుభి కళేబరము ఎముకలగుట్ట." అని సుగ్రీవుడు చూపెను. ఎడమకాలి బొటనవ్రేలితో ఆ యెముకల కొండను దూరముగ రాముడు చిమ్మివేసెను. అవి యెండియున్న యెముకలు, ఆనాటి దుందుభి బరువులో ఇదియెంత అని సుగ్రీవుడనుకొనెను. 'ఇవిగో యివి సప్తసాలములు, మా అన్న వాలి ఒక్క బాణముతో వీనిని దూసుకొని పోవునట్లు వేయగలడు' అని సుగ్రీవుడనెను. తన పరాక్రమమును రాముడు చూపదలచెను. వెంటనే బాణమునుదీసి విల్లును సంధించి విడచెను. ఆ బాణము ఏడు సాల వృక్షములను పడగొట్టి భూమిలోదూరి తిరిగివచ్చి రాముని అమ్ముల పొదిలో దూరెను. సుగ్రీవుడు ఆశ్చర్యచకితుడయ్యెను. రామునకు

కాదు. తెల్లవారిన పిదప పోవచ్చును. ఇంతకుముందు ఓడిపోయిన సుగ్రీవుడు మరలవచ్చుట కనుమానించవలసియున్నది. రామలక్ష్మణులను మహావీరులు ఋష్యమూక పర్వతమునకు వచ్చియున్నట్లు అంగదునివలన వినియున్నాను. వారి అండజూచుకొని సుగ్రీవుడు మరలవచ్చియుండును. అయినను సుగ్రీవునితో ఏల నీకీ విరోధము. సోదరుడగు వానితో సద్భావముతో నుండుట శ్రేయస్కరముకదా! అని హితోక్తుల నాడెను.

రాముడు ధర్మజ్ఞుడు. సుగ్రీవుని పోగరుబోతుతనము నేను సహింపజాలను; అణచివేసెదను. నీకోరిక ననుసరించి సుగ్రీవుని చంపను. ఓడించి వత్తును. నీవింక అడ్డుచెప్పకుము. అని వాలి వెడలెను.

వాలి సుగ్రీవులు ఘోర సంగ్రామ మొనర్చిరి. సుగ్రీవుడు అలసిపోవుటను గమనించిన రాముడు శరమును సంధించి ఆకర్ణాంతములాగి విసరెను. ఆ బాణము తీవ్రవ దూసుకొనిపోయి, వాలి వక్షస్థలమున గ్రుచ్చుకొనెను. మహావృక్షమువలె వాలి నేలగూలెను.

## ధర్మబద్ధము:

పడిపోయెనేగాని వాలి ప్రాణము పోలేదు. బాణము వేసినవారెవరని అటునిటు చూచుచుండెను. రాముడు వాలినిసమీపించెను. రాముని నిందించుచు వాలి ఇట్లనెను.

రామా! నాపై నీవు బాణము వేసిన కారణమూహింపజాలను. నేనితరునితో పోరుచున్న సమయమున నీవు చాటుమాటున నుండి నాపై బాణము వదలుట ధర్మమా? నీవు సద్వంశజుడవని వింటిని. ధర్మజ్ఞుడవగునీవు పాపమున కొడిగట్టవనుకొంటిని. నాయెదుట నిలిచి యుద్ధము చేసిన నా పరాక్రమము చూపియుండును. సీత నీకు కావలయునని నాతో చెప్పియుంటిన రావణుని చంపి సీతను తెచ్చి, నీకు

అప్పగించి యుందును. నేను చనిపోవుచుటులున్నను నీవు మాత్రము అధర్మ మొనరించితివి.

కం. ఇల బ్రహ్మక్షత్రియులకు
నలువుగ భక్ష్యములు పంచనఖములుగల జీ
వులయిదు. శ్వావిత్కూర్మం
బులు మఱిగోధియును శశకమును శల్యకమున్ ॥

కం. నినుబోటి ధర్మపరులగు
ఘనులకు గపితోలు దాల్పగా దస్థి కరం
బున ముట్టరాదు మాంసం
బు నమల గాదేల నన్నుబొలియింపన్ ॥

[భాస్కరరామాయణము]

వాలికి రాముడిట్లు జవాబుచెప్పెను. "నీవు తెలియక మాటాడు చున్నావు. నేను నిన్ను చంపుట ధర్మబద్ధమేయగును. ఈ భూమండల మంతయు ఇక్ష్వాకులకు చెందియున్నది దీనిని భరతుడు పాలించుచు న్నాడు. నేనతని అనుజ్ఞతో అరణ్యములందలి అధర్మములను సరిదిద్ద వలసియున్నది. నీవు అధర్మము చేసితివి.

శ్లో॥ ఔరసీం భగినీం వాపి భార్యాం వాప్యనుజస్యయః
ప్రచరేత నరః కామా త్తస్య దణ్డోవధః స్మృతః ॥

శాస్త్రమునందిట్లు గలదు. కుమార్తెను, తోబుట్టువును, తమ్ముని, యొక్క భార్యను ఎవడు కామముచే పొందునో వానికి మరణ శిక్ష దండనమగును. నీ తమ్ముడగు సుగ్రీవుని భార్యయగు రుమను నీవు లోగొనుట అధర్మము. నీవు వనచరుడవు. వనచరులను వేటాడుట క్షత్రియ ధర్మము. జంతువు పారిపోవుచున్నను, మాటున దాగి యుండియు చంపుదుము. నిన్ను నేను చంపుట క్షత్రియ ధర్మము. పాపము చేసినవారు రాజుచే శిక్షింపబడిన ఇక మరల పరలోకమున శిక్షననుభవింపరు. పుణ్యలోకమునకు చేరుదురు. నేను నిన్ను చంపుట

వలన నీ పాపములు హరింపబడి నీవు స్వర్గమును చేరుదువు. కనుక నీకు నేను ఉపకారము చేసితిని; చింతింపకుము.

రాముని జవాబు వాలికి సంతృప్తి కలిగించెను. ఇక తనకు స్వర్గము లభించునని సంతసించెను. అతడు మరియు నిట్లనెను. 'ప్రభూ! తెలిసీ తెలియక ఆడిన నామాటలను మన్నింపుము. నాతదనంతరం సుగ్రీవుడు రాజగుట ధర్మము. నాప్రియ పుత్రుడగు అంగదుని కాపాడుము. సుగ్రీవుని వలన తారకెట్టి అవమానము జరుగకుండచూడుము'.

సుగ్రీవుని తనచెంతకు బిలిచి వాలి ఇట్లనెను. "తమ్ముడూ! నాయెడకోపమును విడువుము. వానరరాజువై సుఖింపుము. అంగదుని నీ బిడ్డడుగా నెంచుము. తారధర్మము తప్పనిది. ఆమె చెప్పినట్లు చేయుము. ఇదుగో నాకాంచనమాల, నా జీవముండగనే గ్రహించుము. లేనియెడల దీని శక్తి నశించును.'' అని కాంచనమాలను సోదరున కిచ్చెను.

వాలి పడిపోయెనను వార్త తెలిసి తార, అంగదుడు ఇతరులును వచ్చి మిక్కిలి దుఃఖించిరి. ఈదృశ్యమును జూచిన సుగ్రీవుడు అన్న చావునకై యేడ్చెను. కొన యూపిరితో నున్న వాలి ప్రాణములను వీడెను. రామలక్ష్మణులు, హనుమంతుడు వారినెల్లరను ఓదార్చిరి. తారమున్నగు స్త్రీలను కిష్కింధకు పంపి వేసిరి. రాముని అనుమతితో వాలికి అంగదుడు దహనసంస్కార మొనరించెను.

### సుగ్రీవ పట్టాభిషేకము :

వానర రాజ్యము ప్రభువును గోల్పోయెను. కిష్కింధా నగరమునకు విచ్చేసి సుగ్రీవుని కిష్కింధాధిపతిగ నొనర్చుమని హనుమంతుడు రాముని వేడుకొనెను. "హనుమా! నేను నగరమున ప్రవేశించను. లక్ష్మణుని దోడ్కొనిపోయి పట్టాభిషేక ప్రయత్నములు జేయుము'' అని రాముడనెను.

రాముని యానతిపై లక్ష్మణుడు సుగ్రీవునకు పట్టాభిషేక మొనరించెను. అంగదుని యౌవరాజ్యాభిషిక్తునిగ నొనర్చెను. వానరు లెల్లరు జయ జయ ధ్వానములు సల్పిరి.

పట్టాభిషిక్తుడైన సుగ్రీవుడు రాముని కడకువచ్చి దర్శించెను. ఈ శ్రావణమాసమునుండి కార్తీక మాసము వఱకు నాలుగు మాసములు వర్షకాలము. నేనీ గుహయందుండెదను. కార్తీకము రాగనే రావణవధ ప్రయత్నముచేయుము'' అని రాముడనెను. రామాజ్ఞను శిరసావహించి సుగ్రీవుడు కిష్కింధకుబోయి రుమతారలనుబొంది అనుపమ భోగభాగ్యముల ననుభవించుచు సుఖముగ నుండెను.

సు గ్రీ వు ని ప రా కు :

వర్షకాలము అంతయు రాముడు ప్రస్రవణ పర్వతమందలి గుహలో కాలము గడపెను. అప్పుడప్పుడు రాముడు సీతను తలచుకొని విచారించుటయు, విరహవేదన ననుభవించుటయు జరుగుచుండెను. సర్వకాలములందును అన్నను కనిపెట్టుకొనియుండు లక్ష్మణుడు అన్నను ఓదార్చుచు, ధైర్యము చెప్పుచు దినములు గడపుచుండెను.

వర్షములు వెనుకజిక్కినవి. కార్తీకము జరుగుచున్నను సుగ్రీవుడు రాలేదు. రాముని దర్శించలేదు. తనవలన సహాయమునుపొంది కృతఘ్నుడై, స్త్రీలోలుడై, భోగలాలసుడై, రాజ్యమదాంధుడై సుగ్రీవుడు పరాకుగ నున్నందులకు రాముడు కోపగించెను. ఒకనాడు 'లక్ష్మణా! ఇంతవరకును సుగ్రీవుడు మనమాటయే తలపెట్టినట్లు లేదు. ఆతడింత కృతఘ్నుడగునని నేను తలచలేదు. ఒకపరి కిష్కింధకేగి ఆతనిని హెచ్చరించుము. వాలిని చంపిన రామబాణము చెంతనే యున్నదని చెప్పుము. పొమ్ము! అని, మఱియు 'లక్ష్మణా! నీవు సహజముగను, శాంతముగను ఆతనితో మాటాడుము. కోపతాపముల బ్రకటించకుము' అని రాముడనెను

కోపోద్రిక్తుడయిన లక్ష్మణుడు కొంత చల్లబడి విల్లునమ్ములు చేత బట్టి కిష్కింధకుపోయెను. లక్ష్మణుని చూచిన వానరులు భయభ్రాంతులైరి. అంగదుడు గడగడలాడెను. 'అంగదా! నారాకను సుగ్రీవునకు విన్నవించుము.' అని లక్ష్మణుడనెను.

అంగదుడు అంతఃపురములోనికిపోయి చెప్పినేగాని మత్తులో నున్న సుగ్రీవుడు వినిపించుకొనలేదు. మంత్రులును, హనుమంతుడును సుగ్రీవునివద్దకుబోయి హితముపదేశించిరి. 'ఇట్లు పరాకును చిత్తగించి యుండుట మేలుకాదు. వెంటనేపోయి లక్ష్మణుని ప్రసన్నుని జేసుకొనుము. వారు చెప్పినట్లు చేయు' మనిరి. సుగ్రీవునకు కొంత తెలివి వచ్చెను. అంగదుడు లక్ష్మణుని అంతఃపురముకడకు తోడ్కొని వచ్చెను.

అంతఃపురాంగనల గాజుల గలగలలు, అందియల చప్పుడులు లక్ష్మణునకు వినవచ్చెను. లక్ష్మణుడు ధనుష్టంకారముచేసెను. సుగ్రీవునకు గుండెలు ఝల్లుమనెను. తనకంటె తార వెళ్ళి లక్ష్మణునితో సానునయ వాక్యములు పలికిన కొంత మేలుగ నుండుననియెంచి సుగ్రీవుడు తారను లక్ష్మణుని యెదుటకు బంపెను.

తార మధుపాన పరవశయు, కామ పరవశయునయి యుండెను. విడివడియున్న శిరోజములను, పయ్యెదను సవరించుకొనుచు ఆమె లక్ష్మణుని యెదుటకు వచ్చెను. ఆమెను చూచి లక్ష్మణుడు తలవంచుకొనెను. మిక్కిలి వినయవిధేయతలతోను, నేర్పుగుమాటలతోను ఆమె, "రాజపుత్రా! నీవు కోపించిన అడ్డుకొనగలవారెవ్వరు? సుగ్రీవుడు ఇదివరకే వానర సమూహములను చేరదీయుటకై కబురంపినాడు. కపులెల్లరును అసంఖ్యాకముగా కిష్కింధచేరి యున్నారు. అంతఃపురము లోనికి రమ్ము. నీకు అభ్యంతరమేమున్నది?" అనుచు లక్ష్మణుని లోనికి గొంపోయెను.

మత్తు వదలినది :

రుమ మున్నగు స్త్రీలతో సుగ్రీవుడుండెను. లక్ష్మణుని జూచుట తోడనే చేతులను జోడించుకొని నిలచెను. అతని కన్నులు ఎఱ్ఱబాఱి యున్నవి.

ఉపకారము పొందినవారు కృతఘ్నులైనచో దానికి ప్రాయశ్చిత్తముకూడ లేదు. ఇంతలోనే రాముని ఉపకారమును మరచితివా? నా బాణమున కెరజేసెదను. అని లక్ష్మణుడు గద్దించి పలికెను. సుగ్రీవుని మత్తు పూర్తిగా వదలినది. మెడనున్న పూలదండ త్రెంచి పారవైచెను.

నేను మీభృత్యుడను, మహాపరాక్రమవంతుడగు రామునికి నేను ప్రత్యుపకారము చేయుటయా? అది నామమాత్రమే యగును. తప్పు చేయని వారీలోకమున ఎవరైన గలరా? నేను జేసిన అపరాధమును మన్నింపవలయును. అని సుగ్రీవుడు వేడుకొనెను.

లక్ష్మణుడు శాంతించెను. శోకసంతప్తుడై రాముడున్నందున నిన్ను కఠినముగ మాటాడితిని. నీవు వచ్చి రాముని ఓదార్చవలెను. అనెను.

లోకమునగల వానరుల నెల్లరను పది దినములలో కిష్కింధకు రప్పింపుము. అట్లు రానివారిని సంహరించుమని హనుమంతునితో సుగ్రీవుడు చెప్పెను. లక్ష్మణునితో గూడి సుగ్రీవుడు రామునివద్దకేగి వినయముతో నమస్కరించెను. రాముడు సుగ్రీవుని కౌగలించుకొనెను.

హనుమంతునకు అంగుళీయకము :

కోట్లకొలది వానరులు తమ తమ నాయకులతో నలుదిశలనుండి వచ్చి చేరిరి. వారినిచూచి రాముడు పులకిత గాత్రుడయ్యెను. 'సుగ్రీవా! సీత బ్రతికియున్నదా లేదా అను విషయము నిప్పుడు తెలిసికొనవలెను. ఈ కార్యము నీవే నిర్వర్తింపవలసియున్నది.' అని రాముడనెను.

వినతుడనువాని నాయకత్వమున కొందరు కపులను తూర్పు దిశకును, నీలుడు, హనుమంతుడు, జాంబవంతుడు, అంగదుడు మున్నగు ప్రముఖులుగల వానరులను అంగదుని నాయకత్వమున దక్షిణదిశకును, సుషేణుడని వాని నాయకత్వమున కొందరు వనచరులను పడమరకును, శతబలి అనువాని నాయకత్వమున మరికొందరు కీశసంతతిని ఉత్తర దిక్కునకునుబోయి రావణుడు సీత నెక్కడ దాచెనో కనుగొనవలసినదని సుగ్రీవాజ్ఞ అయ్యెను. వారు ఆయాదిశలయందు వెదుకవలసిన ప్రదేశముల నన్నియు సుగ్రీవుడు వివరించిచెప్పి, మీరందఱును ఒక నెల దినములలో తిరిగి రావలెను. అనియు గడువు పెట్టెను.

సుగ్రీవుడు హనుమంతుని బిలిచి 'ఆంజనేయా! నీకు సాటివచ్చువారు వానరులలో మరియొకరు లేరు. సీత జాడకనిపెట్టవలసిన బాధ్యత నీది' అనెను. హనుమంతుని యెడల రామునకు గల అభిప్రాయము సుగ్రీవుని మాటల వలన ఇనుమడించెను. 'ఆంజనేయా! నా పేరు చెక్కియున్న యీ ఉంగరమును సీతకిమ్ము; నావద్దనుండి వచ్చితివని ఆమె గుర్తించగలదు. విశ్వసించగలదు'. అని రాముడు తన ఉంగరమును హనుమంతునకిచ్చెను. హనుమంతుడు దానినందుకొని శిరసావహించి శ్రీరాముని పాదారవిందములకు మ్రొక్కి సహచరుల గూడి బయలుదేరెను.

సీతాన్వేషణము - స్వయంప్రభ :

సుగ్రీవుడు పెట్టిన నెల దినముల గడువు వెళ్ళిపోవనుండెనేగాని ఎంత వెదకినను హనుమదాదులకు సీత జాడ కన్పింపలేదు. కొండలు, కోనలు. గుట్టలు, మెట్టలు, అరణ్యములు వెదకివిసిగిపోయిరి. కాని వారి ప్రయత్నము విరమించలేదు.

ఒక కొండయందొక బిలముకన్పించెను. లోనికిపోయిరి.అంధకార బంధురముగా నుండెను. అయినను ముందుకు పోయిరి. ఒక యోజనముపోగా కొంత వెలుగు కన్పించెను. వారు ఆకలి దప్పులతో అలమటించి పోవుచుండిరి.

అది ఋక్షబిలము. అందు మయ నిర్మితములైన మేడలు మిద్దెలు, ఫలవృక్షములు, నీటి కొలనులు మిక్కిలి అందముగ నుండెను. జపము చేసికొనుచున్న ఒక యోగిని కన్పించెను; ఆమెకు నమస్కరించిన హనుమకు ఆమె యిట్లు చెప్పెను. "మయుడు తన ప్రియసఖియగు హేమకీవనమును, భవనముల నిచ్చెను. నేనామె ప్రియసఖిని. నన్ను స్వయంప్రభ అందురు. మీరు అలసినట్లున్నారు. మీకు కావలసిన పదార్థములను భుజించి, మధుర పానీయముల గ్రోలుడు" అనెను.

వానరులచటి ఆహార పానీయములను తృప్తిగా తీసికొనిరి. దారి తెన్ను గానకయున్న తమకు గుహనుండి బయటకుపోవు మార్గము చూపమనికోరిరి. స్వయంప్రభ వానరులను కనులు మూసికొనవలసినదని చెప్పెను వారు కనులు తెరచునంతలో దక్షిణ సముద్ర తీరముననుండు టను గాంచి ఆశ్చర్యపడిరి.

నెలగడువు దాటిపోయినది. సుగ్రీవాజ్ఞ తిరుగులేనిది. జానకిజాడ తెలియదాయెను. కిష్కింధకు పోయిన ముప్పుతప్పదు. కాన యిట నెట నైన ఉండిపోదమని అంగదాదులు భావించిరి. హనుమంతు డందులకు సమ్మతించ లేదు. సుగ్రీవుడు ధర్మవర్తనుడు. అతని వలన మనకు ప్రమాదము లేదనెను.

ఇటులా రాత్రి యంతయు వారిలో వారు వితర్కించుకొనుచు రామ సుగ్రీవులనుగూర్చి చెప్పుకొనుచు గడపిరి.

## సంపాతి :

జటాయువునకు అన్న సంపాతి. వీరిద్దరును అనూరుని కుమారులు. ఒకనాడు జటాయువు, సంపాతి పందెము వేసికొని ఆకాశమున నెగురుచు సూర్యుని సమీపింపదలచి కొంతపైకి పోగా సూర్యుని వేడిమికి తాళ జాలక జటాయువు క్రింద పడిపోవుటయు, ఆతడు సొమ్మసిల్లి యుండు

టయు సంపాతి గ్రహించెను. వెంటనే తమ్మునికి వేడితగులకుండా సంపాతి తన రెక్కలను గప్పెను. కాని సంపాతి రెక్కలు కాలిపోయి యీ వింధ్య పర్వతప్రాంతమునందు పడెను.

సంపాతి నెరిగియున్న నిశాకర మహర్షి అతని స్థితినిజూచి యిట్లు చెప్పెను. "ఇక ఎనిమిదివేల సంవత్సరములకు రాముడు సీత నన్వేషించుచు ఇటువచ్చును. సీతను గూర్చిన వార్త నీవెఱింగించుము. నీకు మరల రెక్కలు వచ్చును."

అప్పటినుండి కుమారుడగు సుపార్శ్వుడు ఆహారము దెచ్చిపెట్టు చుండగా తినుచు, కదలలేక మెదలలేక సంపాతి కాలము గడపు చుండెను. ఒకనాడు సుపార్శ్వుడు తండ్రితో ఇట్లనెను. "రావణుడు సీత నెత్తుకొని పోవుచున్నాడని మహర్షులందరను కొనుచున్నారు. ఆమె హా రామ! హాలక్ష్మణా! అని యేడ్చుచుపోవుటను నేను జూచితిని." ఇది విన్నసంపాతి తనకు రెక్కలువచ్చు కాలము సమీపించినదని సంతసించెను.

వానరుల వలన జటాయువు మరణించిన విధానము సంపాతి విని మిగుల దుఃఖించెను. తమ్మునకు తర్పణమువదలెను.

సంపాతి తనకు తెలిసియున్న విషయము నిట్లు వానరులతో జెప్పెను. "ఇచటకు నూరు యోజనముల దూరములో సముద్ర మధ్యమందు లంక అను పట్టణము కలదు. దానిని రావణుడేలు చుండును. సీతను రావణుడెత్తికొనిపోయి లంకలోనుంచెను. మీరు సముద్రమును దాటి పోయితిరేని సీతను చూడగలరు." అని చెప్పుట తోడనే సంపాతికి రెక్కలు మొలచెను. మహర్షి చెప్పిన మాటలు సత్యము. మీ కోరిక సిద్ధించునని సంపాతి అనెను.

వానరు లెల్లరును మిక్కిలి సంతోషముతో గంతులు వేయుచు

దక్షిణసముద్ర తీరమునకు చేరిరి. ఉవ్వెత్తున లేచుచు కొల్లలుగానున్న కెరటములతో నున్న మహాసముద్రమును జూచిరి.

## ఎవరు సమర్థులు :

లంకనున్న సీతనుగాంచుటయే తమ ముఖ్యకర్తవ్యముగా కపివరులు భావించిరి. నూరు యోజనముల దూరమునున్న లంకకు బోవుటెట్లు ? ఈ మహాసముద్రము దాటుటెట్లు ? అయినను పోగలవారెవ్వరు? ఆ రాక్షస నగరమున జానకిజాడ కనుగొనగల సమర్థులెవ్వరు; అను ప్రశ్న ఉదయించెను. ముఖము వ్రేలవైచుకొని హనుమంతుడు కొలదిదూరమున నిశ్చేష్టుడై కూర్చొండెను.

ప్రముఖులగు వానరులలో అంగదుడు యువకుడు, ఉత్సాహవంతుడు, యువరాజు, జవసత్త్వములు కలవాడు. నూరుయోజనముల దూరమును అవలీలగా దాటగలను కాని మరల రాగలనో రాలేనో అని సందేహమును వెలిబుచ్చెను.

అందరిలోను వయోవృద్ధుడు జాంబవంతుడు. అయోనిజుడు, మహాబలశాలి. యువకుడుగ నున్నప్పుడు ఇట్టి మహాసముద్రములను తృటిలో దాటగలిగెను. కాని ముసలివాడయిన కారణమున పోలేనని అనుమానము ప్రకటించెను.

బుద్ధిమంతుడగు జాంబవంతుడు హనుమంతుని వద్దకుబోయి, "హనుమా! ఈకార్యమును నీవే సాధింపవలసి యున్నది. నీ విందులకు సమర్థుడవు. నీకిది ఒక లెక్కలోనిదికాదు. శైశవమున నీ తల్లి అంజన ఫలములకై అడవికి వెళ్ళగా నీవు సూర్య బింబముపైకి లంఘించిన ధీరుడవు. ఈ నూరుయోజనముల సముద్ర మొక లెక్కయా నీకు? రామ కార్యము నెరవేర్చి, వానరయూధపతియగు సుగ్రీవుని మాట దక్కించి మన కపికులమునకు కీర్తి దక్కునట్లు చేయుము." అని యుత్సాహ వచనముల ప్రోత్సహించెను.

హనుమంతునకు శక్తి సామర్థ్యములు వచ్చినట్లయ్యెను. అతడెంతయో సంతసమున లేచినిలచెను. "నేను లంక కరిగెదను. ఈ సముద్రమును దాటెద"నని పలికెను. కపులెల్లరు హనుమంతుని కొనియాడిరి. హనుమంతుడు మహేంద్రగిరిపై నెక్కెను. శరీరమును పెంచెను; హుంకరించెను. గాలిని బిగించెను—తోక విదల్చెను. ఆకాశమార్గమున కెగిరి లంకకు బోదలచెననుమాటయే కాని ఆ మతిమంతుని మనసు ఇంతకుమున్నే లంక కరిగెను.



# సుందరకాండ

శ్లో. తతో రావణనీతాయాస్సీతాయాశ్శత్రుకర్శనః
ఇయేష పదమన్వేష్టుం చారణా చరితేపథి.

భావము :– రావణునిచే గొనిపోబడిన సీతాదేవియొక్క ఉనికిని వెదకుటకై శత్రు భయంకరుడగు ఆంజనేయుడు ఆకాశమార్గమున బోవ నిర్ణయించుకొనెను.

సముద్రతరణము :

బ్రహ్మాదిదేవతలకును, సమస్త దిక్పాలకులను, సూర్యచంద్రులకును, తండ్రియగు వాయుదేవునకును నమస్కరించెను. వాయువును బిగించి హుమ్మనుచు ఆకాశమునకెగిరెను. అతిడెగిరిన వేగమునకు కొండబ్రద్దలయ్యెను. సెలయేళ్ళుపై కుబికెను. చెట్లు చేమలు మున్నగునవి ఆతనితో కొంతమేర పైకెగిరి హనుమంతునికి వీడ్కోలు నిచ్చునటులి వచ్చెనన్నట్లు కొండపై బడెను.

చేతులను ముందుకుచాచి, తోకనాడించుచు, గాలిలో ఈదుచు పెంచబడిన మహాకాయముగల హనుమంతుడు గగనవీధిని పోవుచుండగా క్రింద సముద్రమున ఆతని నీడ పెద్ద యోడవలెగన్పించుచుండెను. నీటి యందలి జలచరములన్నియు భీతిజెంది చిందర వందరగ నల్వంకల పరుగిడజొచ్చెను.

రామకార్యార్థమరుగుచున్న హనుమంతునిజూచి దేవతలు పుష్ప వర్షమును గురిపించిరి.

సూర్యవంశ ప్రభువగు సగర చక్రవర్తి సంతానము వలన వేర్పడిన సాగరుడు ఇప్పట్టున హనుమంతునకు సాయము చేయుటుచితమని

భావించినాడు. తనలో దాగియున్న పర్వతశ్రేష్ఠుడగు మైనాకునితో సాగరు డిట్లనెను, 'మైనాకా! ఇంద్రునిచే నీ రెక్కలు నఱుకబడక తప్పించుకొని వచ్చుటకు సాయపడిన వాయు దేవుని కుమారుడు హనుమంతుడు రామకార్యార్థియై వెడలుచున్నాడు. నీవు పైకిలేచి ఆతడు విశ్రమింప స్థానమును చూపుము. నీ కృతజ్ఞత చెల్లించుకొనుము. హనుమంతుడు కొంత సేదదీర్చుకొని మరలపోగలడు.' అనెను. మైనాకుడట్లే తన మెరయుచున్న బంగారు శిఖరములతో పైకి లేచెను. ఏమియో అడ్డము వచ్చుచున్నదని హనుమంతుడు రొమ్ముతో ఒక్క చఱపు చఱచినాడు. అప్పుడు మైనాకుడు, "వానరోత్తమా! ప్రత్యుపకారము చేయవచ్చిననన్ను శత్రువుగా భావించకుము. నీవు మిగుల శ్రమజేయనున్నావు, నాపై కొంత విశ్రాంతి గైకొని, మధుర ఫలముల భుజియించి, నిర్మలోదకమును త్రావి మరల నీప్రయాణమును సాగించుము" అని చేతులెత్తి నమస్కరించెను. హనుమంతుడు ప్రీతిజెంది "మైనాకా! కృతజ్ఞుడను. నేనిప్పుడు విశ్రాంతి జెందుటకు సమయము కాదు. త్వరితముగ వెళ్లవలసియున్నాను."అని చెప్పుచు ముందునకు సాగెను.

శ్రీ రాముని దూతయగు ఆంజనేయునకు సాయముచేయ దల పెట్టినావుగనుక యిక నావలననగు భయముజెందక సుఖముగ జీవించు" మని యింద్రుడు మైనాకునకు అభయమిచ్చెను.

హనుమంతుడింకను ముందునకు దూసుకొని పోవుచుండెను. అంతరిక్షమున దేవతలుచూచి సంతసిలుచు 'ఇతడేగునది లంకా పట్టణమునకు. ఇతడెంత బలపరాక్రమములు ప్రదర్శించునో పరీక్షింతము' అనుకొని సర్పమాతయగు సురసను బంపినారు. ఆమె వికృతరూపమును ధరించి హనుమంతుని మ్రింగుటకై నోరుదెరచెను. నాకు ఆకలి యగు చున్నది. నిన్ను నేనిపుడు మ్రింగవలయును." అనెను. హనుమంతుడు ఆమెకు నమస్కరించి, "అమ్మా, రఘురాముని భార్యయగు సీతను

వెదుకబోవుచున్నాను. ఆమెజాడను నా ప్రభువునకు జెప్పి నీకాహార మయ్యెదను. నన్ను విడువుము." అనెను. ఆమె విన లేదు. హనుమంతుడు తన శరీరమును పెంచెను. ఆమె ఇరువది యోజనముల నోరు పెంచినది. ఇట్లు ఒకరి కొకరు నూరు యోజనములు వరకు శరీరముల పెంచిరి. హనుమంతుడొక్క క్షణములో బొటన వ్రేలు మాత్రముగ శరీరమును తగ్గించుకొని ఆమెనోటిలోనికి బోయి మరల వెంటనే బయటకు వచ్చి, "సురసా ! నీ నోటబడినాను. నీకోరిక నెరవేరినది. ఇక నన్ను పోనిమ్ము" అనెను. సురస సంతసించి హనుమంతుని దీవించి, రామకార్యము సిద్ధించును. పోయిరమ్మనెను.

గంధర్వులు ప్రయాణము సాగించు గగనమార్గమున ఆంజనేయుడు రివ్వునబోవు చుండెను. సముద్రమున నున్న కామరూపిణియగు రాక్షసి సింహిక హనుమంతుని జూచినది. ఆమె ఛాయాగ్రాహి. హనుమంతుని నీడపట్టిలాగినది. హనుమయిక ముందునకు సాగలేక పోయెను. సింహిక సంగతి వినియున్నాడు. ఆమెకంటె పెద్ద శరీరమును పెంచినాడు. రాక్షసి యింకను పెద్దనోరు తెరచినది. హనుమంతుడు సూక్ష్మరూపియై సింహిక గర్భమున జొరబడి దాని ఆయువు పట్టులను గోళ్ళతో చీల్చినాడు. మరల వెలుపలకు వచ్చి శరీరమును పెంచినాడు. సింహిక ప్రాణములను గోలుపోయి సముద్ర మధ్యమందు గూలెను. దేవతలు హనుమంతుని కొనియాడిరి.

హనుమంతుడు హుటాహుటి సాగి దక్షిణాభిముఖముగ వెళ్ళెను. మిక్కిలి విశాలముగను, ఫలవృక్షసంశోభితమునగు లంకా పట్టణమును అతడు ఆకాశమునుండియే చూచెను. తన శరీరమును తగ్గించుకొని లంబగిరి శిఖరముపై వ్రాలెను.

లంకా పట్టణము :

త్రికూట పర్వతముపై గల మూడు శిఖరములలో ఒకదాని

యందు లంకా పట్టణము కలదు. విశ్వకర్మ నిర్మితమైనది. ఒకప్పుడు కుబేరునకు నివాస స్థానమైయుండి తుదకు రావణుని చేజిక్కినది. దేవేంద్రుని అమరావతీ నగరమును తలదన్ను నట్లుండెను. మణిమయ నిర్మిత సౌధములు, తీర్చి దిద్దిన రాజ వీధులు, ప్రాకారకుడ్యములు, చుట్టును దాట శక్యముగాని అగడ్త, సముద్ర మట్టమునకు ముప్పది యోజనముల ఎత్తున నుండును.

ఇంకను కొంతప్రొద్దుకలదు. ఈ సమయమున పట్టణములోని కరిగిన తప్పక రాక్షసులు నన్ను పట్టుకొందురు. రామకార్యముచెడును. ప్రొద్దుక్రుంకు వరకు వేచియుండుట మేలని హనుమంతు డెంచెను.

లంకా ప్రవేశము :

ప్రొద్దుక్రుంకినది. చీకట్ల నవలకు ద్రోసి వెన్నెల వెలుగులు కలయబాతినవి. పొట్టిదగు దేహముతో హనుమంతుడు ఒకటి రెండు ప్రాకారములు దాటెను. ఉత్తరద్వారము వైపునకునడచినాడు. మిడిగుడ్లును, వికృతమైన నోరునుగల లంకిణి అతనిని చూచినది.

ఎవరునీవు ? ఎందుకు వచ్చినావు ? నా అనుమతి లేనిదిపోతు టీగ అయినను లోనజొరశక్యముకాదు. ఇది రావణ పాలిత నగరము. అని భయంకరముగ గద్దించిమాటాడెను.

'ఈ లంకాపురి మిక్కిలి సుందరముగనున్నది. చూచిపోవలెనను కొంటిని. చూచిపోవుదు' నని హనుమంతుడు ధీరుడై బదులుచెప్పెను. అందులకా రక్కసి 'ఓరీ వానరాధమా ! నీకీ దుర్బుద్ధి ఎందులకు కలిగినది ? నన్ను గెలిచిగాని లోనికరుగలేవు. ఒక్క దెబ్బతో నిన్ను నేల బడ జేయుదును' అనెను.

ఇంకను ఈలంకిణితో సంభాషణతో ఆలస్యముచేయరాదనుకొని హనుమంతుడు ఎడమచేతి పిడికిలిబిగించి ఒక్క గ్రుద్దు గ్రుద్దినాడు. లంకిణినోరు తెరచి నేలబడినది. ఆడుదానిని చంపుట ప్రాజ్ఞుడగు హనుమంతుడు యుక్తముకాదనుకొని వదలివేసినాడు.

వానరోత్తమా! నీవు మహావీరుడవు. నిన్నెదిరించువారులేరు. నేనేలంకయొక్క స్వరూపమును, నన్ను గెలిచినావు. ఇకనీకు జయము సిద్ధించినట్లే - 'ఒక వానరుడువచ్చి నిన్ను జయించినప్పుడు, లంకకుచేటు కాలము సంప్రాప్తమైనటుల తెలుసుకొను'మని పూర్వము బ్రహ్మనాకు చెప్పినాడు. పట్టణములోనికేగి సీతను వెదుకుము అని లంకిణి దారి యిచ్చెను.

శత్రువున కపజయమునుకోరు హనుమంతుడు సింహద్వారమున ప్రవేశించక ప్రాకారమునుదాటి లంకానగరమున ఎడమకాలు ముందుంచినాడు.

ముత్తెములు, పూలుచల్లబడిన పురవీధులు, హిరణ్మయములై రత్నఖచితములునై ఆకాశమునంటు హర్మ్యములు, సాయుధ రక్షక భటులుగలిగిన రాజవీధులు దాటుచు ఒక్కొక్క భవనమును వెదకుచు, వనవాటికలగాలించుచు, ఆపట్టణ సౌందర్యమునకు అచ్చెరువందుచు ప్రజ్ఞాధురీణుడగు హనుమంతుడు ఇతరుల కనులబడక ముందుకు సాగిపోయినాడు.

తెల్లతామరలు వికసించి నిండుగాగలిగిన లోతైన అగడ్త వడ్డాణమువలె చుట్టియున్న రావణుని కోటగోడనుదాటి రావణుని అంతఃపుర భవనమున ప్రవేశించినాడు. అర్థరాత్రి అయినది. చంద్రుడు నడినెత్తి పైనుండి వెన్నెల వెదజల్లుచున్నాడు.

మధురసంగీతము గానముచేయువారు, మృదంగధ్వనులను మోగించువారు, సదాచారసంపన్నులు, మిక్కిలి అందమైన స్త్రీలు, వికృతాంగనలు. త్రాగి మత్తెక్కియున్నవారు, మృదుమధురముగ మాటలాడుచున్నవారు, రతిక్రీడల దేలువారు, శృంగారవికారచేష్టల పరవశులైనవారు, మరెందరెందరో స్త్రీపురుషుల నతడు చూచినాడు. పుణ్యాంగన జానకీదేవి యొచటను కన్పింపకుండుటకు విచారపడినాడు.

మార్జాల ప్రమాణ దేహుడై ఆంజనేయుడు రావణ నిజభవన మన్వేషింపదలచినాడు. కుంభకర్ణుడు, విభీషణుడు, ఇంద్రజిత్తు జంబుమాలి, సుమాలి మున్నగు రాక్షస ప్రముఖుల భవనములన్నియు చూచినాడేగాని సీతజాడ కన్పింపలేదు.

ఏనుగులు, గుఱ్ఱములు, కంచరగాడిదలు మేలుజాతి వానిని తిలకించినాడు. ఉన్నతములైన రథములను చూచినాడు. ఇవిగల శాలలను వెదకినాడు. శత్రుభయంకరములును, అప్రతిహతములును అయిన జంతుజాలమునుచూచి విస్మితుడైనాడు.

రావణాంతఃపురమున దూరినాడు. రత్నములకాంతులు వెదజల్లుచున్న ఆ భవనము మహావైభవముగానున్నది. ముందునకు సాగినాడు. పుష్పక విమానమును గాంచినాడు. ఒకచోట పద్మాకరమును, అందు తామరపూవుమీద లక్ష్మీదేవి విగ్రహము, ఆమె హస్తములందు వికసించిన పద్మములు, ఆమె కిరుప్రక్కల ఏనుగులు తొండములతో తామర పూవుల నెత్తిపట్టుకొనియుండు ప్రతిమలను సహజసౌందర్యముతోనున్న వానిని చూచినాడు.

చాలమందిస్త్రీలు, అతిసుందరములు, వివిధాభరణముల నలంకరించుకొనియున్నవారుగలరు. ఇది రావణుని భార్యలుండు భవనము. అందరును గాఢనిద్రయందున్నారు. వారి అందరిమధ్య చుక్కలలోని చంద్రునివలె రావణుడు నిదురించుచున్నాడు. ఏనుగుదంతముతో చేయబడి మణులు పొదిగియున్న, మెత్తనిశయ్యగల ఆ మంచముపై రాక్షసేంద్రుడు నిదురించుచుండుట జూచినాడు. ఇది యింద్రభవనమా అని ఆశ్చర్యపడినాడు.

మేలిమిబంగారుచాయగలిగి, తెల్లనిచీరగట్టి వివిధాభరణముల ధరించి హంసతూలికా తల్పమున నిదురించుచున్న సౌందర్యవతినిగాంచి

నాడు. "ఆహా ఏమి నాభాగ్యము. సీతామహాసాధ్విని జూడగలిగితి" నను కొన్నాడు.

భర్తను ఎడబాసి తదేక దీక్షతోనుండి పతివ్రతాంగనయై యుండు సీత యిటులుండునా అని వితర్కించుకొనినాడు. చీరమాయ లేదు. ముఖమువాడ లేదు. మైమరచి నిద్రించు ఈమె సీతయెట్లగును? ఈమె సీతకాదని నిశ్చయించుకొనెను.

ఆ విశాలభవనమున నెందరో స్త్రీలు త్రాగి, ఆడి, పాడి, అలసి సొలసి ఒకరినొకరు తలగడలుగ జేసికొని నిద్రించు చుండిరి.

రతిక్రీడల దేలియాడి మన్మథ పరవశలగు స్త్రీలు నగ్నముగ బడియుండుటను గాంచినాడు. నేనెట్టి పాపమును జేసితిని; వీరిని చూచుట తగునా అనుకొనిన హనుమంతుడు, ఇది బుద్ధిపూర్వకముగ చేసిన దోషముకాదుగదా! నామనసు పవిత్రముగను నిర్మలముగను ఉన్నది. నేను తప్పుచేయలేదని నిశ్చయించుకొని యాతడు పానశాలయందు ప్రవేశించెను.

అనేకరకములైన పదార్థములు, సువాసనల వెదజల్లుచు పాత్రల నిండుగ నుండుట జూచెను. కొన్ని వట్టిపాత్రలు, మరికొన్ని కొంతవరకు పదార్థములుగలవి, మాంసము, పప్పు, పులుసు మున్నగు పదార్థములుండుట గాంచెను - అన్నిమూలలయందును వెదకినాడు గాని సీత కన్పింపలేదు - రావణుని మందిరముదాటి బయటకు చేరినాడు.

## హనుమంతుని విచారము :

ఎంత వెదకినను సీత గాన్పింపదయ్యెను. ఈలంకలో వెదుక వలసిన ప్రదేశము ఇంకలేదు. ఆమెను లంకలోనే రావణుఉంచిన

హరేచట దాచును? ఆమె జీవించియుండదు. తనకు లోబడలేదని యీ రాక్షసుడే చంపియుండును. లేదా రామునియెడగల భక్తిచే ఆమెయే ప్రాణత్యాగముచేసి యుండును. రామచంద్రుని పత్ని, జనకమహారాజు కుమార్తె, దశరథమహారాజు కోడలు, మహాసాధ్వియగు సీత కాని కాలమువచ్చెనని చింతించి పరులయింట నుండనొల్లక అసువులు బాసిన దనుటలో ఆశ్చర్యమేమున్నది? నేనీవార్త రామునకెట్లు చెప్పుదును? తన కార్యము గట్టెక్కించుమనిన సుగ్రీవుడు సంతసించునా? సీత కన్పింపలేదనువార్త చెప్పినవెంటనే ఆమెయెడ అత్యంతానురాగముతో నున్న రాముడు మరణించును. అగ్రజుని కంటికి రెప్పవలె గాపాడు చున్న లక్ష్మణుడు రాముని మరణమును గాంచినంతనే ఆతడును ప్రాణముల గోల్పోవును - ఇది వినిన భరతశత్రుఘ్నులును, వారి తల్లులును గుండెబగిలి చత్తురు. ప్రత్యుపకారము చేయలేక పోయితినే యని సుగ్రీవుడు నిస్సంశయముగ ప్రాణత్యాగము చేయును. కపికులాధినాథుడు చనిపోయినపిదప వానర సమూహమంతయు ఆతని ననుసరింతురు. నరవానర వంశములు సర్వనాశ మొందుట నిశ్చయము. దీనికంతటికిని కారణుడను నేనే - నా వలన ఇందరు ప్రాణములు గోల్పోయిన పిదప నేను చేయునదేమి కలదు. నేనీవార్తను చెప్పకున్న వారందఱును సురక్షితముగ నుందురు. కనుక నేను కిష్కింధకు వెళ్ళక ఇచటనే నా జీవిత శేషమును గడపుదును; లేదా మరణించుటమేలు. పోయిన నేనొక్కడనే మరణించిన వాడనగుదును. అని నిస్పృహతో నిట్టూర్పులు విడచుచు విచార మగ్నుడై హనుమంతుడుండెను.

కొలదిక్షణములలో మరల నాతడిట్లుతలపోసెను. చనిపోవుట ధీరలక్షణము కాదు. యుక్తాయుక్త వివేకముకలిగి ధీమంతుడు కార్యమును సాధింపవలయును. చచ్చిచేయునదేమున్నది? బ్రతికియున్న శుభములు బడయవచ్చును. మరలమరల సీతను వెదకుదును. ఎచ్చట

దాచెనో చూపుమని రావణుని చావగొట్టుదును. రావణుడు తీసికొని వెళ్లెనని సంపాతి చెప్పియుండెగదా! అందు అబద్ధము లేదు – లేదా రావణుని జుట్టుపట్టుకొని రామునివద్దకే యీడ్చుకొని పోయెదను. ఎట్లయినను కార్యసాధకుడనయి వానరుల కీర్తి కాపాడవలయును. అని హనుమంతుడు నిశ్చయించుకొనెను.

అశోకవనము :

ఆ వాయునందనుడు నలువైపుల తేరిపారజూచెను. ఆప్రక్కనే అశోకవనము గన్పించెను. ఇంతకమున్నే ఆవనము చూచినదిగ తోచ లేదు. ఇంకను అది వెదుకవలసియున్నది. ఇచ్చట నైనను ఆసాధ్వి కన్పించిన ధన్యుడనయ్యెదను. అని ఆలోచించిన హనుమంతుడు సకల దేవతలకును మ్రొక్కెను. రామలక్ష్మణులకును, సుగ్రీవునకును అంజలి ఘటించెను.

అనేక రకములైన వృక్షసముదాయము, నానావిధ పక్షిసంతతి, జంతువితతి చిత్ర విచిత్ర లతాగుల్మాదులతో శోభాయమానముగనున్న అశోకవనమున అంజనీసుతుడు ప్రవేశించెను. మధ్యమధ్యగల సుందర మందిరములు, సెలయేటి ప్రవాహములు, స్నానవాటికలనుగాంచెను – ఈ వనము పవిత్రమైనదిగ గన్పించుచున్నది. ప్రాతఃకాలము కానున్నది. పవిత్రురాలగు జానకి యీసమయమున తప్పక యీవనమునకు రావచ్చును. ఈ చెట్ల గుబురులనుండి ఆమెవచ్చునేమో చూచెదను.

చల్లనిగాలివీచుచున్నది. పుష్పసౌరభము గుబాళించుచున్నది. మనసునకెంతయో హాయిగొలుపు వాతావరణము గన్పట్టుచున్నది. అదిగో ఆ చెట్టుక్రింద కొందరు స్త్రీలు చేరియున్నారు. ఎవరువారు! రాక్షసాంగనలవలెనున్నారు. వారిమధ్యనున్న స్త్రీ ఎవ్వరు? మలిన వస్త్రమునుదాల్చియున్నది. కృశించి దీనముగనున్నది. పసుపువచ్చని చీరకట్టినది. అదియును చినిగినట్లున్నది. ఋష్యమూకపర్వతము పై

ఆభరణములు మూటకట్టి పడవేసినది యీ చీరకొంగుగనే కన్పట్టు చున్నది. ఇప్పుడు కొన్నినగలు చెట్టుకొమ్మకు వ్రేలాడదీసియున్నవి. రాముడు చెప్పినగుర్తులు సరిపోవుచున్నవి. చంద్రబింబమువంటి ముఖము, పొడవైన జడ, సన్ననినడుము. ఈమె సీతయేకావచ్చును. మరల మరల చూచినాడు. హనుమంతుడు తన అభిప్రాయములను స్థిరపరచుకొనెను. 'ఈమె మా అమ్మ సీతమ్మ' అనుకొనెను. ఆమె దీనస్థితిని జూచిన హనుమంతునకు కనులు చెమ్మగిల్లెను.

రా వ ణు డు :

వికారముఖములు, అంగవైకల్యములు కలిగిన రాక్షస స్త్రీల మధ్యగల ఆపుణ్యాంగననుగూర్చి తలపోయుచు హనుమంతుడు శింశుపా వృక్షమున కొమ్మపై ఆకులగుబురు నందు కుంచిత దేహమున కూర్చుండి యుండెను.

వేకువసమయమున నిద్రమేల్కొనిన రావణునకు సీతజ్ఞాపకము వచ్చినది. వాడిపోయిన పూలమాలల నవలబారవైచి సర్వాలంకృతుడై అశోకవనమునకువచ్చెను. ఆతని వెంట అంతఃపురాంగనలు బయలుదేరి వచ్చిరి. పరిచారికలు ఛత్రము, చామరము, పానపాత్ర, బంగరుకలశములనీరు, బంగారు దివిటీలు మున్నగువానిని గొని వారి వెంటనడచిరి. సీతయెదుటకు రావణుడు రాగానే ఆమె వడకిపోవుచు చేతులతో ఒళ్ళును కప్పుకొని కూర్చొనెను.

ఓ సుందరీ! నీయెడల నామనసులగ్నమైనది. నీవు మిక్కిలి మనోహరముగనున్నావు. పరస్త్రీహరణము, పరస్త్రీగమనము మా రాక్షసులకు తప్పులోనిదికాదు. అయినను నేను తొందరపడక నీ మనసుమారుగొన యత్నముచేయుచున్నాను. నీ దుఃఖమునుమానుము. శుభ్రవస్త్రములను ధరించుము. ఆభరణముల నలంకరించు కొనుము. నాకు భార్యవగుము. నన్ను ఎదిరించగలవాడు లేడు. నీకేమికావలెనో

కోరుము. ఇది వరకు నాకుగల భార్యలందరు నీకు సేవచేయగలరు. నిన్ను పట్టమహిషిగా జేయుదును. 'రామ' 'రామ' యని కలవరింతు వేమి ? నా పరాక్రమము, నా బలము, నా ఐశ్వర్యము ముందు అతడెంత ? నీ విచారముడిగి నీవు ఆనందించుము. నన్ను ఆనందములో ముంచుము. అని రావణుడనెను.

భయకంపితయైన సీత రాముని మనసా ధ్యానించినది. తనకును రావణునకును మధ్య గడ్డిపోచను అడ్డముగ వేసి బదులు పలికినది.

శ్లో॥ యథా తవ తథాఽన్యేషాం దారా రక్ష్యానిశాచరా
ఆత్మానముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతాం॥

శ్లో॥ అకామాం కామయానస్య శరీరముపతప్యతే
ఇచ్ఛంతీం కామయానస్య ప్రీతిర్భవతి శోభనా॥

శ్లో॥ అకృతాత్మాన మాసాద్య రాజానమనయే రతమ్
సమృద్ధాని వినశ్యంతి రాష్ట్రాణి నగరానిచ॥

నేను రాముని భార్యను; పతివ్రతను. పరుల భార్యలను కోరుట తగదు. వారినిగూడ రక్షించవలెను. నీభార్యలను ఇతరులు కోరుట నీవెట్లు సహింపవో అట్లే ఇతరుల భార్యలను నీవు కోరుట తగదు. ఇష్టము లేని స్త్రీతో రమించుట వలన సుఖము లేదు, సంతాపము కలుగును. నిన్ను ప్రేమించిన స్త్రీతో రమించును, సుఖము కలుగును – బుద్ధిహీనుడు, దుర్మార్గుడు రాజు కాగూడదు. ఒకవేళ రాజయిన, సంపదననుభవించుచున్న రాష్ట్రములు, నగరములు (అనగా ఆదేశము) సర్వనాశనమగును. రాజు పాపకర్ముడైన దేశమునకు అరిష్టము సంభవించును. నీకును, నీవంశమునకును, నీరాజ్యమునకును చేటుకాలము సంప్రాప్తము కానున్నది. సుఖముగ నుండదలతువేని రాముని శరణు వేడుము. అతడు నిన్ను తప్పక మన్నింపగలడు. కాదందువేని నీకు వినాశము తప్పదు." అనెను.

రావణునకు విపరీతమైన కోపము వచ్చినది. "సీతా! నీవనిన మాటలకు నిన్ను ఒక్కొక్క ముక్కగా నరికివేసియుందును. కాని నీయెడల నాకు అనురాగము, ప్రేమ చావలేదు. నేను నీకిచ్చిన గడువు ఇక రెండు నెలలున్నది. బాగుగ ఆలోచించుకొనుము. ఈలోపల నాకు నీవు భార్యవు కావలె. అందుకు సమ్మతింపవేని గడువుకాలము గడచిన మరునాడు నావంటవారు నిన్ను ముక్కలు ముక్కలుగానరికి నా ఉదయపు భోజనమున వండిపెట్టుదురు. నిన్నుమాత్రము వదలను." అని, "ఈమె నాకు లొంగునట్లు చేయుడు. ఈమెమనసు మార్చుడు." అని రాక్షసస్త్రీలతో చెప్పెను.

ధాన్యమాలిని అను రాక్షసాంగన రావణుని కౌగలించుకొని, "రాజా! నాతో క్రీడించుము. ఈ మానవాంగనతో నీకేమి ఫలము కలుగును? నిన్ను అనుభవించు యోగ్యత ఆమెకు లేదు. ఒల్లని ఆడుదానితో రమించిన సుఖముండదుగదా!" అనెను.

రావణునకు నవ్వువచ్చినది. ధాన్యమాలినిని వదలించుకొని సీతవంక చురచురజూచుచు గిర్రున తిరిగి తన భవనమునకు వెళ్ళినాడు. అతనితో వచ్చినవారందఱు అతనితో వెళ్ళినారు.

సీత చుట్టును జేరిన కావలిగాయుచున్న రాక్షసస్త్రీలు పరి పరి విధముల నామెతో పలికిరి. రావణుని వరించుమనిరి. పరుషముగా మాటాడిరి; బెదరించిరి; కేకలువేసిరి; మామాట విననియెడల నిన్ను భక్షింతుము అనిరి. సీత ధైర్యముచు కోల్పోయి యేడువ సాగినది. నాకు చావైనను రాదేమి? అనుకొన్నది.

"నా రాముని వదలి రావణుని కామింతునా? నాయెడమ కాలితో తాకనైన తాకను. మహావీరుడగు రామునకు రావణుని వద్ద నేనున్నటుల తెలియవలెను. అతడు ఈ దుర్మార్గుని సర్వ నాశనము

చేయును. నా వార్త రామునకు తెలుపువారులేరు, నేనెట్లైనను ఈ దుఃఖమునకు లోనుగావలసియున్నది, ఈ బాధలు నేను పడలేను. ఎవరైన ఇంత విషమునిచ్చి పుణ్యము కట్టుకొనిన మేలగును." అని సీత తన చుట్టునున్న వారితో పలికినది.

త్రిజట కల :

చుట్టును చేరిన స్త్రీలు కేకలు వేయసాగిరి. అంతకుముందే కునుకు పట్టిన త్రిజటకు మెలకువ వచ్చినది. వృద్ధురాలగు త్రిజట,

"ఆగుడాగుడు, ఎందుకా కేకలు ? ఈమె ఎవరను కొంటిరి?' అన్నది. 'జనకమహారాజు కుమార్తె, దశరథమహారాజుకోడలు, శ్రీరాముని భార్య ఉత్తమమైనస్త్రీ – నేనొక విచిత్రమైన కలగన్నాను. ఏనుగు దంతముతో చేయబడిన తెల్లని రథమును వెయ్యి హంసలు మోయుచు ఆకాశములో విహరించుచున్నవి. తెల్లనీ వస్త్రములను ధరించిన యీసీతయు, ఈమెభర్త రాముడును పూలదండలు వేసికొని రథముపై నున్నారు. లక్ష్మణుడు ప్రక్కనున్నాడు. వారు ఉత్తర దిశగా వెళ్ళినారు. ఇక రావణునిగూడ కలలో గాంచినది చెప్పెదను. రావణుడు నల్లని బట్టలు కట్టుకొనినాడు. ఎఱ్ఱనిపూలు మెడలో వేసి కొన్నాడు. ఎఱ్ఱని బట్టలుగూడ కట్టుకొనినాడు. నూనె త్రాగుచు విమానమునుండి నేలగూలినాడు. బట్టతల - రథమునకు గాడిదలు కట్టియున్నవి. దక్షిణదిక్కుగాపోయి మురుగుకంపు కొట్టుచున్న బురద గుంటలో పడిపోయినాడు. కుంభకర్ణుడు నూనె పులుముకొని ఒంటె నెక్కినాడు. ఇంద్రజిత్తు మొసలిని ఎక్కినాడు. అందరును దక్షిణముగా వెళ్ళినారు. విభీషణుడు తెల్లని వస్త్రములను కట్టుకొని, తెల్లని పూలదండ వేసికొని, తెల్లని గొడుగు వేసికొని నాలుగుదంతముల ఏనుగు నెక్కినాడు. భేరీలు, శంఖములు మ్రోగుచున్నవి. ఒక వానరుడు లంకలో జొరబడి లంకనంతను కాల్చివేసినాడు – ఇది

అంతయు సీతకు శుభసూచకముగ నున్నది. ఆమెకు సంతోషము కలుగును. లంకకు, రాక్షసవంశమునకు, రావణునకు చేటుకాలము సంప్రాప్తమైనది. అదుగో చూడుడు. సీత ఎడమకన్ను, ఎడమభుజము అదరుచున్నవి. ఆమెను మీరేమియు దూషింపకుడు. ఆమె మనను రక్షించు శక్తిగలది.'' అనెను.

సీత దుఃఖము ననుభవించినది. ఇక తనకుశుభదినములు వచ్చుట కలలోని వార్తగ భావించినది. రావణుని వాతబడుటకంటె మరణమే మేలు – ఉరిబోసుకొనియైన మరణించెదగాక' అనుకొని శింశుపా వృక్షముయొక్క కొమ్మకు తన మెడచుట్టును చుట్టుకొన్న పొడవైన జడను కట్టినది; రాముని స్మరించినది.

శు భ సూ చ క ము లు :

జానకి ఎడమ కన్ను అదరినది. ఎడమభుజము వడకినది. ఎడమ తొడ స్పందించినది. ఈ శుభశకునములు కలిగినప్పుడు శుభములు చేకూరుట ఆమెకు అనుభవమే. ఇప్పుడీ శుభనిమిత్తముల వలన మేలు కలుగగలదని భావించినది – ముఖము వికసించినది. మనస్సు సంతోషముతో పొంగినది.

హనుమంతుని ఆలోచనము :

సీతాదేవిని చూచినాను; లంకాధీశ్వరుని చూచినాను. సీత దుఃఖపరవశయైయున్నది. ఈమె ఏదియో ప్రాణసంకటము కొని తెచ్చు కొనునటుల గన్పించుచున్నది. ఈమెకు నారాకనుగూర్చి చెప్పుటెట్లు? ఆమెను ఓదార్చుటెట్లు? రాముని విషయ మామెకెఱుక పరచుటెట్లు? రాక్షస స్త్రీలు చుట్టుముట్టియున్నారు. వీరికి తెలియకుండ ఆ సాధ్వితో సంభాషించిన మేలగును. ఈ రక్కసిమూక పరాకుగ నున్నప్పుడు మాటాడుదును. ఏభాషలో మాటాడవలె? స్వచ్ఛముగు

సంస్కృతమున మాటాడిన సీత శంకించునేమో! రావణుని మాయగా తలపోయును. ఆమె భయపడిన నేను వచ్చిన పని అంతయు వ్యర్థమగు నని కొంత తడవాలోచించి ధీమంతుడగు ఆ హనుమంతుడొక నిర్ణయము నకు వచ్చెను.

ప్రియుడును, భర్తయునగు రాముని పై ఈమె మనస్సు లగ్నమై యున్నది కదా. ఇప్పట్టున రామునిగూర్చి మాటాడిన, కీర్తించిన ఆమెకు ఊరట చేకూరగలదు. అనుకొని ఆమె యెదుటకు వెళ్ళక యే చెట్టుకొమ్మపై నుండి రామకథను మధురముగ చెప్పసాగెను.

అయోధ్యానగరము రాజధానిగ దశరథుడు కోసలదేశమును పాలించుచుండెను. అని ప్రారంభించి క్లుప్తముగ కథను చెప్పుచు నేను సంపాతివలన సీత జాడలు తెలుసుకొని సముద్రమును లంఘించి వచ్చి ఇచ్చట సీతాదేవిని చూచితిని. అని ఊరకుండెను.

రాముని చరిత్ర వినిన సీతకు సంతసము కలిగినది. దిక్కుల పరికించి చూచినది. పైకిచూచినది. చెట్టుకొమ్మపైనున్న వానరుని చూచినది.

## సీత—హనుమంతుడు :

ఇది కలయేమో అను సంశయము కలిగినది సీతకు కలలో వానరుని చూచుట దోషము. ఏమి కీడు కలుగునో అనుకొనినది. రామలక్ష్మణులకు శుభము కోరుకొనినది, బ్రహ్మాది దేవతలకు నమస్కరించినది.

హనుమంతుడు చెట్టుదిగి తల్లికి వినయముగ నమస్కరించెను. అమ్మా! ఎవరునీవు? ఏల దుఃఖించుచున్నావు? నీ చరిత్ర యేమిటమ్మా! రామచంద్రుని పత్నివగు సీతాదేవివి కాదుగదా! నిన్నుజూచిన కొలది నీవు సీతవు, భూజాతవుగానుంటివి తల్లీ!

సీత తన వృత్తాంతమును క్లుప్తముగ చెప్పినది. రావణుడు పెట్టిన గడువును గూర్చిగూడ చెప్పినది. హనుమంతుడు రామలక్ష్మణుల కుశలవార్తను విన్పించినాడు.

సీతకు భయము కలిగినది. రావణుడే మాయ రూపములో వచ్చి యిట్లు మోసగించుచున్నాడు. అనుకొని హనుమంతుని విశ్వసించలేదు. నేను మోసగాడను కాదు తల్లీ! రామదూతను, అని చెప్పగా, 'నీకును రామునకును సంబంధమెట్లు కలిగినది' అని ప్రశ్నించెను - 'రాముని జూచితినంటివికదా, అతడెట్లుండునో వివరించు'మని యడిగెను.

ఋష్యమూక పర్వతమునకు రామలక్ష్మణులు వచ్చుటయు, సుగ్రీవునితో నేస్తము జేయుటయు మున్నగునవి హనుమంతుడు వివరించెను. రాముని అవయవములన్నియు వర్ణించి చెప్పెను. రాముడు ఆజానుబాహువు. తొంబది ఆరు అంగుళముల ఎత్తుండును. నీలవర్ణము కలవాడు. కన్నులు తామర రేకులవలె నుండును. నుదుటియందు నాలుగు రేఖలు గలవు. కోటేరువంటి ముక్కు. కన్నులు, చెవులు, పెదవులు మున్నగునవి సమముగా నుండును. కంఠము శంఖమువలె నుండును. కంఠధ్వని గంభీరమైనది. భుజములు ఎత్తుగా నుండును. రొమ్ము విశాలమైనది. తొడలు, పిక్కలు పొడవైనవి. అరచేతులు, అరకాళ్లు పద్మములవలె నుండును. అతడు సింహమువలె నడచును. బుద్ధియందు బృహస్పతిని బోలును. మధురముగ మాటలాడును. ధర్మార్థకామములయందు ప్రీతిగలిగి చక్కగ ఆచరించును. సాధుజనులను రక్షించువాడు. విలువిద్యయందు ఆరితేరినవాడు. కరుణాసముద్రుడు, తేజశ్శాలి. సమస్త శుభలక్షణములు, సద్గుణములు కలిగినవాడు. అన్నియెడలను ఆయనసులతమ్ముడు లక్ష్మణుడు పోలియుండును. కాని బంగరు చాయగ నుండును. అగ్రజునియెడల మిక్కుటమగు భక్తిశ్రద్ధలు,

వినయ విధేయతలు కలవాడు. ఇరువురును సత్యనిరతులు. ఓటమి నెరుగనివారు. పురుషపుంగవులు. అన్యోన్య ప్రేమ, విశ్వాసములు కల వారు. రామలక్ష్మణుల కిరువురకును సాటి వారే యగుదురు కాని మరియెవ్వరును కారు. ఇకనైనను నన్ను నమ్ముమమ్మా అని ఆతడు వేడుకొనెను. ఇదుగో తల్లీ! రామనామాంకితమైన ఉంగరము, నీకు నమ్మకము కలిగించుటకై రాముడు నాకిచ్చినాడు.' అని హనుమంతుడు భద్రపఱచుకొన్న రామాంగుళీయకమును సీతకిచ్చెను. సీత దానిని కనులకద్దుకొని, రాముని చూచినట్లుగనే భావించి సంతోషించి హనుమంతుని విశ్వసించెను. రాముడిటకు వచ్చి నన్ను గొనిపోలేదేమి? ఆతడు నన్నెపుడైన మనసున తలచునా? అని సీత ప్రశ్నించెను.

నీ విచట గలవని రామునకు తెలియదు. తెలిసియున్న ఆ పరాక్రమశాలి యింతకాల మూరకొనువాడుకాదు. నీయెడలనే ఆయన మనసులగ్నమైయున్నది. నిన్నే ఎల్లప్పుడును తలచుకొనుచుండును. మద్య మాంసములను ముట్టడు. కందమూలముల మాత్రమే భుజించుచున్నాడు. నీకొఱకై యాతడు పరితపించు చున్నాడు - అమ్మా! నీవును ఆప్రతిభాశాలికొఱకై దుఃఖించుచున్నావు కదా!

కం, వీ పెక్కురమ్ము లంకా
ద్వీపముతోగూడనైన దేవీ! నిను నే
వీపున గొనిపో నోపుదు
నీపతికడ కబ్ధిగడచి నిమిషములోనన్॥

[భాస్కర రామాయణము]

నిన్ను తృటికాలములో తీసికొనిపోయి రాముని ముందు దింతును. నా వీపుపై ఎక్కుము తల్లీ! నేను వచ్చిన రీతిగా సముద్రమును దాటి ఆకాశవీధిని నిన్ను గొంపోవుదును. సందియమందకమ్మా! అని వేడుకొనెను.

అందులకు సీత యిట్లనెను. 'హనుమా! నాథర్త చాల దూరమున నున్నాడు. నన్ను బహుదూరము మోసికొనిపోవుట సాధ్యమా? వింతగనున్నది'.

తన విషయము సీతకు ఎఱుకపఱచుట యుక్తమనుకొని హనుమంతుడు క్రమముగా తన శరీరమును పెంచెను. మేరు పర్వతమువలె భయంకరాకారుడై, బాలసూర్యునివలె ఎఱ్ఱనిముఖముగలిగి, కోరలు గలిగి నిలచి యిట్లనెను. "రావణసహితముగలంకనైనను పెల్లగించుకొని పోగలను. ఈ రాక్షసులు నా కొక లెక్కలోనివారుగారు తల్లీ! ఈ సముద్రమేగాదు; మరెంతటి విశాలసముద్రమునైనను దాటగలను."

నాయనా! హనుమా! నీవు మహాబలుడవు. సర్వశక్తి సంపన్నుడవు. నన్ను తీసికొనిపోగలవని నమ్ముచున్నాను. నీవొక్కడవు సమస్త రాక్షసులను సంహరించగలవనియు తెలిసికొన్నాను - కాని నేను నీబుజములపై నెక్కిరాజాలను. రాను - ఏలనందువేమో! నేను నిర్భయముగ సముద్రమును దాటజాలను. నేను నీ వెంటపోవుచున్న విషయము పసిగట్టిన రాక్షసులు నిన్ను విడువరు. తప్పక ఎదుర్కొందురు. వారితో యుద్ధముచేయుచు నిన్ను నీవు కాపాడుకొనుచు నన్ను కాపాడవలసి యుండును. ఏ మాత్రము ప్రమాదము జరిగినను నేను మహాసముద్రమున బడిపోవుదును. నీవు నిరాయుధుడవు. ఒంటరివాడవు. ఒకవేళ అపజయము కలిగిన రాక్షసులు నన్ను చేజిక్కించుకొందురు. చంపినను చంపవచ్చును. లేదా, యింత కంటె రహస్య ప్రదేశమున దాచవచ్చును. మరలనాకై శ్రమనొందు వారు మీరే.

రావణుని చంపి నన్ను గొంపోయిన కీర్తి రామునకు దక్కవలయును. నీవుతీసికొని వెళ్ళిన రామునకెట్లు కీర్తి వచ్చును? అదియును గాక పరపురుషుని తాకను. 'రావణుని తాకలేదా'? అందువేమో!

అప్పటి నాస్థితి వేరు. నేను దిక్కులేనిదాసనై యుంటిని. బలాత్కారముగా తేబడినాను. అస్వాధీననగు నేనేమి చేయగలను ?

కనుక రాముని తోడ్కొని రమ్ము. ఆతడు శత్రువును సంహరించి నన్ను గొంపోవును.

పతివ్రతయగు సీత చెప్పిన సమాధానము హనుమంతునికి తృప్తి గలిగించెను. ఆమెను రమ్మని కోరినందులకు నొచ్చుకొనెను. 'చిత్తము తల్లీ! నేను రామునివద్దకేగి నిన్ను జూచితినని చెప్పవలయునుగదా! ఆయన నన్ను విశ్వసించునటు లేదేని ఆనవాలు నిమ్మని కోరెను.

కాకాసురుని వృత్తాంతము :

చిత్రకూటమున సీతారాము లున్నప్పటి వృత్తాంతము నామె హనుమంతునకు చెప్పెను.

నేనును రాముడును ఏకాంతమున నుంటిమి. తిరిగి తిరిగి అలసిపోయి నేను రాముని తొడపై కూర్చొంటిని. ఒక కాకివచ్చి మాంసమునకై నాఱొమ్ములను పొడువ సాగినది. నేనా కాకిని తోలితిని. రాముడు నాతొడపై పరుండి నిద్రించెను. మరల ఆకాకి వచ్చి నా ఱొమ్ములను పొడిచినది. రక్తము స్రవించినది. మిక్కిలి బాధపెట్టినది. రామునిపై నెత్తురుచుక్కలు పడినవి. నేను రామునికి నిద్రాభంగము గావించితిని. ఆతడు లేచినా పరిస్థితిని జూచి మండిపడినాడు.

ఆకాకి ఇంద్రుని కొడుకట - కాకాసురుడట. రాముడు దర్భపుడకను గైకొని బ్రహ్మాస్త్రమును అభిమంత్రించి వానిపై వదలెను-అది నిప్పులు గ్రక్కుచు వానివెంట బడినది. అది లోకములన్నియు తిరిగినది. తండ్రివద్దకుపోయినది. రక్షించినవారు లేకపోయిరి. తిరిగి రామునివద్దకే వచ్చి శరణు జొచ్చినది. శరణాగతులను రక్షించు వ్రతముగల రాముడు దానిని కాపాడెను. కాని రామబాణము వృథాపోరాదుగదా!

ఈ బాణము నేమిచేయమందు'వని అడుగగా అది 'నా కుడికంటిని కొట్టు' మనినది. దర్భ, కాకి కుడికంటిని కొట్టగా కన్ను లొట్టబోయినది. ప్రాణము నిలచినది.

హనుమా! ఈ కథ అంతయు మాయిరువురకేగాని మరొకరికి తెలియదు-ఇది నీవు గుర్తుచేయుము. తప్పక నమ్మగలడు' అన్నది.

చూడామణి :

శ్రీరామునకు నా సాష్టాంగ నమస్కారములు చెప్పుము. లక్ష్మణుని కుశలమడిగితి ననుము. నాయనా! ఇక నీదే భారము. నేనింక నెలమాత్రమే బ్రతికియుందును. ఆపైని జీవింపదలచను. అనుచు కొంగున ముడివేసికొనియున్న చూడామణిని తీసి హనుమంతుని చేతి కిచ్చినది. దీనిని రామునికిమ్ము. దీనిని చూడగనే నన్ను, తల్లియగు కౌసల్యను, తండ్రియగు దశరథుని రాముడు తలచుకొనును. అని చెప్పినది.

రామలక్ష్మణులు పరాక్రమవంతులు. వారు వచ్చి నన్ను తీసి కొని పోవునట్లు చేయవలసినవాడవు నీవే! అని పలుమారులు చెప్పినది.

హనుమంతుడు మణిని కనులకద్దుకొని భద్రపఱచుకొనెను. ఆ తల్లికి ప్రదక్షిణముచేసి సాష్టాంగ నమస్కారము చేసినాడు. 'అమ్మా! నీవేమాత్రమును సందేహించకుము. తప్పక రాముడు వచ్చి శత్రు సంహారమొనర్చి నీకు సంతోషము కలిగించును. నిన్నాతడు చేబట్టుట తథ్యము.' అని ధైర్యముచెప్పి హనుమంతుడు సీతవద్ద సెలవు గైకొనెను.

అశోకవనవిధ్వంసము :

ఇక చేయవలసినదేమి? ఇప్పటికొక మహత్కార్యము సాధించి నాను. ఇక ఎట్లైనను రావణునితో యుద్ధము తప్పదు-రావణుని

బలపరాక్రమములు బాగుగా తెలిసుకొని కిష్కింధకు పోయిన ఎంతయో విషయ సేకరణ మొనర్చినవాడనగుదును. లంక యందలి బలగమునుగూర్చి అడిగిన రామునకుగాని, సుగ్రీవునకు గాని నేనేమి సమాధాన మీయగలను? కనుక ఇచ్చటి పరిస్థితులను అవగాహన మొనర్చుకొనుట ఉత్తమలక్షణము. అందులకేది మార్గమని తలపోసిన ఆంజనేయుడు రావణునకు ప్రీతికరమగు అశోకవనమును విధ్వంస మొనర్చుట ప్రథమ కర్తవ్యముగ భావించెను. అటుల చేసిన యెడల రావణుడు తన బలగమును బంపును; లేదా అతడే వచ్చును – నా బలపరాక్రములను వాని కెఱుక జేయుటయు వాని బలాబలములను నేను గుర్తించుటయు జరుగగలదు – అనుకొనెను.

అశోకవనమందలి మహావృక్షములను పెకలించెను. కొన్నిటి కొమ్మలను విరిచివేసెను. లతలను త్రెంచెను. పువ్వులను విరజిమ్మెను. వనవిధ్వంసము గావించి అశోకవన ద్వారముపై కూర్చొనెను – జరిగిన విషయమంతయు రావణునకు పరిచారికలు నివేదించినారు. రావణుడుగ్రుడైనాడు. రావణుని ఆజ్ఞపై ఎనిమిదివేలమంది రాక్షస వీరులు వచ్చినారు. హనుమంతునిపై ఆయుధములు విసరినారు. హనుమంతుడు విక్రమించి తోరణ స్తంభమును పెఱికి రాక్షసుల నందరిని చావమోదినాడు. మరల నాతడు తోరణముపై కూర్చొని యెదురు చూచుచుండెను.

ఇంతమంది వీరులను హనుమంతుడొక్కడే చంపెనను వార్త విని రావణుడు మహాబలశాలియగు జంబుమాలిని పంపెను.

జం బు మా లి ;

ప్రహస్తుని కుమారుడును, దుర్జయుడు నగు జంబుమాలి ఎఱ్ఱని వస్త్రములను ధరించి ధనుర్ధారియై పిడుగువలె వచ్చిపడెను. ద్వారముపై నున్న హనుమంతుని జూచి వాడియైన బాణములను వేసినాడు. అవి

హనుమంతుని దాకి రక్తము స్రవించునట్లు జేసినవి. దగ్గరనున్న మద్ది చెట్టును పెకికి వాయునందనుడు జంబుమాలిని మోదినాడు. జంబుమాలి వెఱువక మద్దిచెట్టును ముక్కలు ముక్కలుజేసి హనుమంతుని శిరమ్మును భుజములను తాకునట్లు పది బాణములను వదలినాడు. ప్రళయాగ్నివలె విజృంభించిన ఆంజనేయుడు ఇనుపగుదియను దీసికొని గిర గిర త్రిప్పి జంబుమాలిని చావగొట్టినాడు. జంబుమాలి చచ్చుటయే గాక అతని రథము, దేహము పిండి అయి నేల గూలినది. ఈ వార్తను రావణుడు విన్నాడు. క్రోధోద్రిక్తుడైనాడు. మహాబలశాలురైన మంత్రి పుత్రులను పంపినాడు.

## మంత్రి పుత్రులు :

మహాబలశాలురైన ఏడుగురు మంత్రి పుత్రులు బంగారు టెక్కెములు గలిగిన రథములపై నెక్కి ఆంజనేయునితో యుద్ధమునకు 'నేను, నేను' అనుకొనుచు వచ్చి బాణవర్షములో హనుమంతుని ముంచివేసినారు. రాక్షస సేనపై హనుమంతుడు దూకినాడు - పిడికిళ్ళతో పొడిచియు, కాళ్ళతో మర్దించియు వారి నందరను చంపి మరల తోరణ దుర్గము నెక్కినాడు.

ఏడుగురు వీరులు, సేనతో సహా నేలగూలినారని రావణుడు విని కలతజెంది సేనానాయకులతో ఇట్లనెను.

## సేనానాయకులు :

నేనిదివఱకు వాలి సుగ్రీవులను, జాంబవంతుని చూచియున్నాను గాని యిట్టి భూతమువలెనున్న వానరుని చూచి యుండలేదు. వీనితో జాగరూకత కలిగి యుద్ధముచేసి జయించిరండు అని ఆజ్ఞాపించినాడు.

ఐదుగురు సేనానాయకులు వెళ్ళి హనుమంతుని ఎదిరించిరి. రథముతో గూడ దుర్ధరుడు ఆకాశమున కెగిరెను. హనుమంతుడుగూడ

శరీరమును పెంచి ఆకసమున కెగిరి అక్కడనే వాని నెదుర్కొని నేల గూల్చినాడు. అదిచూచి విరూపాక్ష, యూపాక్షులు విజృంభించిరి. ఇనుప గుదియతో వారిని మోది హనుమంతుడు వారిరువురను చావ గొట్టెను. ప్రఘసుడు, భాసకర్ణుడు మండిపడినారు. శూలములతో ఆంజనేయుని నొప్పించిరి. ఒక పర్వతశిఖరమును పెకలించి వారిద్దఱను, వారి రథములను, సైన్యమును హనుమంతుడు హతమార్చినాడు. మరల తోరణము నెక్కెను.

అక్షకుమారుడు :

తన కుమారుడగు అక్షకుమారుని పంపినాడు రావణుడు. చతురంగబలముతో అక్షకుమారుడు బంగారురథము నెక్కి అట్టహాసముగా ఆంజనేయునితో యుద్ధము చేయవచ్చెను. యుద్ధనిపుణుడగు రావణుని పుత్రుడు తెక్కలుగల బాణములు వేసెను. బాలుడైనను నేర్పుగా యుద్ధము చేయుచుండిన వాని జూచి హనుమంతుడు సంతసించుచు ఆకాశమున కెగిరిన అక్షకుమారుని కాళ్ళు పట్టుకొని గిర గిర త్రిప్పి నేలకు వేసి కొట్టెను. ఎముకలు విరిగి ముద్దవలె అక్షకుమారు డయ్యెను. తోరణము నెక్కినాడు హనుమ.

మేఘనాదుడు :

ఇంద్రుని జయించి ఇంద్రజిత్తుని బిరుదు వహించినవాడు రావణుని పెద్దకుమారుడగు మేఘనాదుడు. అక్షకుమారుడు మరణించె నను వార్త రావణుని దుఃఖమునముంచివేసెను. ఆగ్రహోదగ్రు డయ్యెను. 'శత్రుంజయా! నీవంటి పరాక్రమశాలి మరొకరు లేరు. స్వర్గాధినాథుని సహితము పరాజితుని చేసినవాడవు. నిన్ను ఈ స్వల్పకార్యమునకు బంపుట యుక్తము కాకపోయినను నిన్ను పంపు చున్నాను. జయలక్ష్మిని చేపట్టుము' అని రావణుడనెను.

తండ్రికి ప్రదక్షిణముచేసి, యేనుగులు పూనిన రథమునెక్కి యుద్ధమునకు వచ్చెను. ఇంద్రజిత్తును జూచిన హనుమంతుడు సింహనాదము చేసెను. ఇంద్రజిత్తు వేయు బాణములను తప్పించుకొనుచు హనుమంతుడు వానితోబాటు నేలపైనను, ఆకాశముననుహోరాహోరిగా పోరాడినాడు. ఎంత ప్రయత్నించినను, నొప్పించినను అలసట నెఱుగని హనుమంతుని జూచి ఇంద్రజిత్తు ఆశ్చర్యపడెను, ఇక ప్రయోజనము లేదని గ్రహించి బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను.

బ్రహ్మయిచ్చిన వరము ననుసరించి అంజనా నందనుడు బ్రహ్మాస్త్రమునకు కట్టుబడి నేలపై పడెను. దానియెడగల గౌరవముతో కదలక మెదలకుండెను. రాక్షసులు నారత్రాళ్ళను తెచ్చి మారుతిని కట్టివేసిరి. వెంటనే బ్రహ్మాస్త్రము శక్తి విడిపోయినది. ఇంకొకదానితో కట్టినపుడు బ్రహ్మాస్త్రము విడిపోవునని ఇంద్రజిత్తునకు తెలిసియు ఊరకున్నాడు. రావణుని చూడదలచి హనుమంతుడు బంధములు విడివడినను, రాక్షసులు లాగినను నెట్టినను సహించి ఊరకొనెను.

కొలువు తీర్చియున్న రావణుని యెదుట హనుమంతుని నిలబెట్టినారు రాక్షసులు.

రావణుని కొలువుకూటము :

పది తలలును ఇరువది చేతులును కలిగిన రాక్షసరాజు రావణుడు స్ఫటిక సింహాసనముపై ఆసీనుడయియున్నాడు. రత్నములు పొదిగిన కిరీటము తళతళ మెరయుచున్నది. ముత్యముల హారములు, భుజకీర్తులు కలిగి కస్తూరి కలిపిన ఎఱ్ఱ చందనము శరీరమంతట పూసుకొనియున్నాడు.

దర్పోద్ధతుడగు రావణుడు అతి భయంకరుడుగ నున్నాడు. అతనికి దుర్ధరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, నికుంభుడు అను

నల్గురు మంత్రులు ముఖ్యమైనవారు కలరు. చుట్టును పరివారము భృత్యానుభృత్యులై కొలువున నున్నారు. 'క్రూరకార్యముల నితడు చేయకున్న త్రిలోకాధిపతి కాదగినవాడు రావణుడు' అనుకొనినాడు హనుమంతుడు.

హనుమంతుని జూడగనే పూర్వము కైలాసగిరివద్ద శాపము నిచ్చిన నందికేశ్వరుడు జ్ఞాపకమునకువచ్చి, 'అతడే ఇతడు కాదుగదా!' అనుకొనినాడు రావణుడు. ఎవరును జొరరాని యీ లంకానగరమున కేల ఇతడు వచ్చినాడో కనుగొనుమని మంత్రి ప్రహస్తునితో రావణుడు చెప్పెను.

'నీవెవరు? ఏలవచ్చితివి? భయపడక చెప్పుము. చూచుటకు వానరుడవుగాని నీప్రభావము అద్భుతముగా నున్నది. దాపరికము లేక నిజము చెప్పుము. లేదా శిక్షింపబడుదువు' అని ప్రహస్తు డాంజనేయునితో అనెను.

'నేను వానరుడనే. రాక్షసరాజువగు నిన్ను చూడదలచి అశోకవనము ధ్వంసము చేసినాను. ఆత్మరక్షణ కొఱకై యుద్ధ మొనర్చినాను – నే నెవరికిని లొంగను, బ్రహ్మాస్త్రమును గౌరవింప దలచి కట్టుబడినాను. నీ మేలుకోరి కొన్నిమాటలు చెప్పెదను. సుగ్రీవుడు నన్ను బంపినాడు. వాలిని నీ వెరుగుదువుకదా! ఆ వాలిని చంపి కిష్కింధరాజ్యమును దశరథరాముడు సుగ్రీవున కిచ్చినాడు. ధర్మశాస్త్రములు తెలిసిన నీవు పరదారాపహరణము చేయుట తగదు. నీయింట సీతను దాచినావు. ఆమెను వెదకుటకై వాయునందనుడనగు నేను సముద్రమునుదాటి వచ్చినాను. సీతను చూచినాను. రామదూతనైన నేను ప్రభు కార్యము నిర్వర్తించితిని. రాముని బలపరాక్రమములు అప్రతిహతములు. ఆయనను ఎవరును గెలువజాలరు. ఆ రాముడెట్టి వాడో తెలియక నీవు అజ్ఞానాంధకారమున బడుచుంటివి,

సీ. చరణాగ్రమున నీభు - జాదర్పమడచిన
దూర్జటివిలు లీల - ద్రుంచివైచె
వాలపాశంబున - వడి నిన్నుగట్టిన
వాలినొక్కమ్మున - గూలనేసె
అని నిన్నుజెఱగొన్న - యర్జునుబొరిగొన్న
పరశురామునినాజి - భంగపఱచె
కడిమిమైనొక్కడ - ఖరదూషణాదుల
పదునాల్గువేవుర - బారిసమరె

తే.గీ. అమ్మహాధనుర్ధరునకె - గ్గాచరించి
హరిహరబ్రహ్మశక్రాదు - లైననతని
భయదనిర్ఘాతసంఘాత - పాతశాత
బాణఘాత హతులుగాక - బ్రదుకగలరె ?

[భాస్కరరామాయణము]

ఇప్పటికిని మించిన దేమియు లేదు. సీతను రామునకిచ్చి శరణు వేడుము. నిన్ను నీవు రక్షించుకొనుము. అని హనుంతుడు పలికినాడు.

రావణుడు సావధానముగ ఈ మాటలను వినెను. అవియన్నియు దోషరహితములే. అయినను అప్రియముగనున్నవి. అరికాలుమంట నెత్తికెక్కినది. హనుమంతుని చంపవలసినదని రావణుడాజ్ఞాపించెను.

దూతను చంపరాదు :

నీతిమంతుడగు విభీషణుడిదివిని అన్నతో ఇట్లనెను. 'రాజా! కోపమును విడచి శాంతింపుము. దూతను చంపరాదని నీవెఱుగని ధర్మశాస్త్రము కాదు. అతడు పాపకృత్యములు చేసియున్నను చంప రాదు. అందుకు మారుగా నీయిచ్చవచ్చిన శిక్ష వేయుము.'

తమ్ముడు చెప్పినది సమంజసముగనే యున్నది. కోతులకు తోక ప్రియమైనది. వీని తోకను గాల్చి పంపుడు. కాలుచున్న తోకతో లంక అంతయు త్రిప్పుడు, అని రావణుడనెను.

రాక్షసభటులు హనుమంతుని తోకకు నూనెగుడ్డలు చుట్టిరి. నిప్పు ముట్టించిరి. లంక అంతయు త్రిప్పిరి. ఎగతాళిచేసిరి; త్రోసిరి; నెట్టిరి: కొట్టిరి. ఏమిచేసినను హనుమంతుడు కిక్కురుమన లేదు—పగటివేళ లంక అంతయు తిరిగి చూచినాడు.

రాక్షసాంగనలు సీతకీవార్త తెలిపిరి. ఇంతకు ముందు సీతతో మాటాడిన వానరుని పట్టుకొని తోకకు నిప్పు పెట్టినారని చెప్పిరి. సీత విచారపడినది. అగ్నిదేవుని ప్రార్థించినది. 'ఓ అగ్నిదేవా! రాముని యెడ పాతివ్రత్యము కలిగియున్న దాననైన హనుమంతునకు చల్లదనము నిమ్ము' అని వేడుకొన్నది.

## లంకాదహనము:

జాజ్వల్యమానముగ అగ్నిహోత్రుడెగయుచున్నను హనుమంతునకు వీసమైనను బాధ కలుగలేదు. చందనము పూచినట్లు చల్లగ, హాయిగనున్నది. సీతాదేవి దయవలన, రాముని అనుగ్రహము వలన, తన తండ్రికిని అగ్నిహోత్రునకును స్నేహమైనందున తనకు ఏమాత్రమును బాధ కలుగలేదని వాయుపుత్రుడు భావించెను.

ఒకనాడలి స్థానమునకు రాగనే హనుమంతుడు కుంచిత దేహుడయ్యెను. కట్లన్నియు సడలి త్రాళ్ళు క్రిందబడెను. వెంటనే ఆతడు పైకి నెగిరినాడు. దుర్మార్గులగు ఈ రక్కసి మూకల యిండ్లు అగ్నిదేవునికి ఆహుతి చేసిన బాగుండుననుకొని ఒక్కొక్క భవనమునకు నిప్పు బెట్టుచు తిరిగినాడు. అగ్నిదేవునకు వాయుదేవుడు తోడయ్యెను. ఆయింటికాయిల్లు నిప్పు అంటుకొనెను. ఆకాశము నంటునట్లు మంటలు

ఎగయ బ్రాకినవి. రావణాంతఃపురము సహితము దగ్ధమయ్యెను. లంక లోని ఆబాల గోపాలము వీధులలోనికి వచ్చి రోదన ధ్వనుల జేయ సాగిరి. హనుమంతుడే గాక ఆకసమునుండి చూచుచున్న దేవతా సమూహములుగూడ లంకా దహనమునకు ఆనందించినవి. హనుమంతుని తోకకు నిప్పంటింపబడినదనియు, లంకయందలి వీధులలో త్రిప్పబడు చున్నాడనియు రాక్షస స్త్రీలు సీతా దేవికి చెప్పినారు. తన వలన ఆంజనేయుడిట్లు బాధపడుటకు సీత చింతించెను.

శ్లో. యదిమాం వృత్తసంపన్నాం తత్సమాగమ లాలసామ్
సవిజానాతి ధర్మాత్మా శీతో భవ హనూమతః||

నేను పతివ్రతనయిన యెడలను, రామునియొక్క సమాగమము కోరుచు విలపించుచున్నానని రాముడు తలచుచున్న యెడలను అగ్నిహోత్రుడు హనుమంతునకు చల్లదనమును అనుగ్రహించునుగాక! అని ఆమె అగ్నిహోత్రుని ప్రార్థించినది. హనుమంతునకెట్టి ఆపదయు, బాధయు కలుగకుండెను. ఇందులకా రాముని అనుగ్రహమే కారణమని ఆత డనుకొనెను.

## సీతమ్మ కుశలము :

హనుమంతుడు పట్టరాని ఆనందముతో సముద్రము కడకుబోయి తోకనుముంచి చల్లార్చుకొనెను. ఒక్కసారి లంకవంక జూచెను. సీతమ్మ గుర్తుకువచ్చినది. 'అయ్యో, నేనెంత పొరబాటుచేసితిని. కోపము వచ్చినపుడు యుక్తాయుక్తములు మనసునకు తోచవుగదా! లంక తగులబడునని తలపోసితినిగాని సీతమ్మకేమి ప్రమాదము కలుగునో అని గూడ యోచింపనైతిని. ఆతల్లికి ప్రమాదమే సంభవించిన నేను వచ్చిన పని అంతయు వ్యర్థమేగదా! సీతమ్మ కుశలముగ నుండుటను మరల జూడవలె' ననుకొని హనుమంతుడు అశోకవనమునకు బోయినాడు.

శింశుపావృక్షచ్ఛాయను పరమ పవిత్రురాలగు సీతామహాసాధ్వి ధ్యాన నిమగ్నయై యుండుటను గాంచినాడు. ఆతల్లికి నమస్కరించినాడు, 'నా భాగ్య వశమున నీవు కుశలముగ నుంటివి తల్లీ! నాకిక సెలవిమ్ము' అని వేడుకొన్నాడు.

హనుమంతుడు మరల తనవద్దకు వచ్చినందులకు జానకి సంతసించినది. 'ఆ రాముని ప్రోత్సహించి నీవే రాముని లంకకు తీసికొని రావలెను' అనెను. హనుమంతుడామెకు ధైర్యము చెప్పినాడు.

**తిరుగు ప్రయాణము :**

సీతమ్మవద్ద సెలవు గైకొనిన మారుతి హుటాహుటి అరిష్ట పర్వతము పైకెక్కినాడు. నూరు యోజనముల లవణార్ణవమును జూచినాడు. ఉప్పొంగి పోయినాడు. ఇక ఏమాత్రమును జాగొనరింపక తన రాకకై వేచియుండు వానర ప్రముఖులను కలసి కొనవలెను. హుంకరించుచు ఆతడు గగనవీధి కెగసెను. వాయు వేగమున నా వాయుసుతుడు మబ్బులమాటున తేలిపోవుచుండెను. తన రాకకై వేచియున్న మైనాకుని వీపుపై తట్టినాడు. ముందుకు సాగిపోయి దూరమున నున్న మహేంద్రగిరిని చూచినాడు.

సముద్రతీరమున నున్న అంగదాదులు కన్పించిరి. సంతోషము పెల్లుబికినది సింహనాదము చేసెను. తోక విసరి కొట్టెను. సంతోష సాగరమున దేలియాడుచున్నట్లు కన్పించిన హనుమంతుడు లంకయందు కార్యము సాధించి యుండునని జాంబవంతుడు ఊహించినాడు.

పర్వతాకారుడగు హనుమంతుడు మహేంద్ర గిరిపై ఒక సెలయేటి యొడ్డున దిగినాడు. అంగద జాంబవంతాదులెల్లరు హనుమను చుట్టుముట్టిరి. హనుమంతుడు వారెల్లరకును నమస్కరించెను. హనుమంతుని నోటినుండి ఏ పలుకులు వినవచ్చునో అని అందరును ఆతురత పడుచుండిరి.

సీతాదేవిని చూచితిని :

సీతాదేవిని చూచితిని అని హనుమంతుడు చల్లనివార్త చెప్పెను. వానరుల ఆనందమునకు మేర లేదు. వారందరును కేకలు వేసిరి; తిరిగి గంతులు వేసిరి; తోకలు ఝాడించిరి; నేలకేసి కొట్టిరి. హనుమంతుని వలన వారందరికి గౌరవము హెచ్చినది.

అందరును ఒకచో చేరిరి. లంకయందలి వివరములను చెప్పుమని ఆంజనేయుని కోరిరి. తాను బయలుదేరినది మొదలు పూస గ్రుచ్చినటుల హనుమంతుడు వివరించి చెప్పెను. మైనాక పర్వతము, సురస, సింహిక అడ్డు వచ్చుట వానిని జయించుట చెప్పెను. లంకిణిని జయించి లంకలోనికి బోయి సీతను వెదకుట వివరించెను. రావణాంతఃపురము నందలి విశేషములు, తుదకు అశోకవనమునందు జానకిని చూచుటను చెప్పెను. 'రామునియెడ భక్తితో, ఆయననే స్మరించుచు, కనులలో ప్రాణములు బెట్టుకొని కాలము గడపుచున్నది. మాసిన చీర గట్టుకొనియున్నది. అది మనము ఋష్యమూక పర్వతముపై నుండి చూచినట్టిదే. ఆమె దుఃఖముతో క్రుంగిపోవుచున్నది.' అనెను. రావణుడు వచ్చి ఆమెతో పరుషముగ మాటాడినాడు. తనను చేరుటకు గడువు బెట్టి వెళ్ళెను. సీతారాములకు శుభము కలుగనున్నదని త్రిజట చెప్పిన కల వివరించెను. చెట్టుడిగి సీతమ్మతో సంభాషించుటయు, రామాంగుళీయకము నిచ్చుటయు మరల ఆమె చూడామణి నిచ్చుటయు తెలియజెప్పెను. పిమ్మట అశోకవనమును విధ్వంస మొనర్చి, రాక్షస వీరులతో పోరాడి, బ్రహ్మాస్త్రమున కట్టుబడి రావణుని కొలువుకు బోయి హితముపదేశించుట చెప్పెను. తనకు వేసిన శిక్షతో లంకాదహనమగుట వివరించి సీతమ్మ కుశలముగా నుండుట జూచి సెలవు గైకొని మరల మీ కడకు వచ్చితి ననెను.

సమాలోచనము :

దుష్టుడైన రావణుని చేజిక్కిన జానకీదేవి కడు నిడుములకు లోనై యున్నది. ఆమె దుఃఖమును నేను చూడజాలక పోయితిని. దినమొక యుగముగ ఆమె గడుపుచున్నది. రాక్షసుల బలాబలము లను నేను చూచియుంటిని. మనలో ఏ యొక్క వీరునికి అచట వారు సమానులు కాజాలరు. నిస్సందేహముగ మనము వారిని జయించ గలము. రాముడు సీతకొఱకును, సీతరామునికొఱకును పరితపించు చున్నారుగదా? మనము వెళ్ళి రాక్షసుల దునుమాడి సీతను గొని వచ్చుట యుక్తమేమో ఆలోచింపు'డని హనుమంతుడనెను.

మనము లంకకుపోయి జనకజను గొనివచ్చుటయే సమంజసము. రిక్త హస్తములతో రామునికడకు పోవుటకంటె ఆమెను తీసికొని వెళ్ళిన యెడల రామునుడు సుగ్రీవుడును సంతసింతురు' అని అంగదుడు బలికెను. మరికొందరు వానరులు అంగదుని బలపరచిరి.

సీతను గొనివచ్చుటుచితము కానేరదు. రాముడు మనలను పంపినది సీతను చూచి, యెక్కడున్నదో తెలిసికొని రావలసినదనియే కదా! రామ సుగ్రీవుల యాజ్ఞ నతిక్రమించుట తగద'ని మతిమంతుడగు జాంబవంతుడనెను.

జాంబవంతుని మాట కెవరును ఎదురు చెప్పలేదు. వారందఱును కిష్కింధకు ప్రయాణమైరి.

మధువనము :

సుగ్రీవునకు ప్రాణసమానమగు మధువనము ఇంద్రుని నందన వనమువలె మిక్కిలి సుందరమైనది. తియ్యనైన పండ్లును, తేనె తుట్టెలునుగల ఆవనమునకు సుగ్రీవుని మేనమామయగు దధిముఖు డధిపతి. కిష్కింధకు కొలది దూరమున నున్న ఆవనము ఆకాశ మార్గమున వచ్చుచున్న వానర ప్రముఖులను ఆకర్షించెను.

వానరులు మధువనమున జొరబడిరి. యువరాజగు అంగదుని యనుమతిపై మధువనమున విహరింప జొచ్చిరి. అవి కోతులు, సీత వార్తను గొనివచ్చుచున్న సంతోషమున నున్నారు. ఇష్టమువచ్చి నట్లు మధువును త్రాగినారు. మత్తెక్కి యున్నది. ఇక వారి చేష్టలకు అంతములేదు. ఆడినారు, పాడినారు, కొమ్మలను విరుగదీసినారు, చెట్లను పెకలించినారు, పండ్లను దులిపినారు, దధిముఖుడు వచ్చి వారించినాడు గాని వారు లక్ష్యపెట్టలేదు. మీదుమిక్కిలి దధిముఖుని బాదినారు. సామ, దాన, భేద, దండోపాయముల ప్రయత్నించి చూచినను అతని సేవకులను వానరులు లక్ష్యపెట్టలేదు.

మనము వెళ్ళి సుగ్రీవునకీసంగతి విన్నవింతము. అతడు చండ శాసనుడు. వీరిని తప్పక శిక్షించును. రండు పోదమని సేవకులనుకూడ దీసికొని దధిముఖుడు సుగ్రీవునికడకు బోయెను.

## శ్రవణానందము :

రామలక్ష్మణుల వద్ద సుగ్రీవుడు చేరియుండెను. వారు ముగ్గు రును కళాహీనమైన ముఖములతో నుండిరి. దధిముఖుడు వెళ్ళి సుగ్రీవుని కాళ్ళపైబడి మధువనమున జరిగిన భీభత్సమంతయు విన్న వించెను.

దీనుడగు దధిముఖుని విచారమునకు కారణమేమని లక్ష్మణుడు సుగ్రీవుని ప్రశ్నించెను. సుగ్రీవుడు విషయమంతయు లక్ష్మణునకు చెప్పి 'ఈ మధువనమును మాతండ్రియగు ఋక్షరజసునకు బ్రహ్మయిచ్చెను. నాటినుండి నేటివఱకు మరెవ్వరును అందు ప్రవేశింప సాహసింపరైరి. ఇప్పుడిట్లు అంగదాదులు చేసి యుండిరనుట విపరీతమే! అయినను వీరు దక్షిణదిశకు వెళ్ళిన వానరులు. ఇందు ఆంజనేయుడుగూడ కలడు. అతడు సాధింపలేని కార్యముండదు. వీరెల్లరు మధువనమును జేరి భీభత్స మొనరించిరన సీతాదేవిని వారు చూచి వచ్చియుందురనెను.

శ్రవణానందకరమగు ఈ మాటలు రామలక్ష్మణులు వినినారు. వారికి సంతోష మతిశయించినది. కనులు వికసించినవి. దేహము గగుర్పొడిచినది.

సుగ్రీవుడు దధిముఖుని మన్నించెను. 'నీవు తెచ్చిన వార్త నాకు అప్రియమైనదికాదు. అది శుభవార్తయే. త్వరగా తిరిగిపొమ్ము. రామలక్ష్మణులును నేనును వారి రాకకై ఎదురు చూచుచున్నామని చెప్పుము.' అని సుగ్రీవుడు దధిముఖునితో అనెను.

దధిముఖుడు మధువనమునన్న అంగదునివద్దకు బోయి సుగ్రీవాజ్ఞను విన్నవించెను. 'ఇక మనము తడయరాదు. వానరులందఱును ప్రస్రవణ పర్వతముకడకు చేరుటుచిత'మనినాడు అంగదుడు. రామచంద్రా! ఇక నీవు దుఃఖముడుగుము. పరాక్రమ శాలివగు నీవు ధైర్యమవలంభించుము. హనుమదాదులు సీతను జూచిరనియే నేను నమ్ముచున్నానని సుగ్రీవుడనెను.

ఆకాశము బ్రద్దలగు నట్లు సింహనాదములు చేయుచు అంగదుడు జాంబవంతుడు, హనుమంతుడు మున్నగు వానర శ్రేష్ఠులు ఆకాశము నుండి ప్రస్రవణ పర్వతముకడ నేలపై దిగినారు. రామలక్ష్మణులకును సుగ్రీవునకును మ్రొక్కినారు.

**శుభవార్త :**

సీతమ్మను జూచి వచ్చినాను. ఆమె మహాసాధ్వి. క్షేమముగ నున్నది. అని హనుమంతుడు శ్రీరామునకు విన్నవించెను. రాముని ఆనందమున కవధులులేవు. లక్ష్మణుడు సంతసించెను. సుగ్రీవుడు తోక విసరికొట్టెను.

సీతను చూచివచ్చినవాడు హనుమంతుడు! అతడే సీతమ్మ సంగతి వివరించు టుచితమని వానరులనగా హనుమంతుడు తాను

బయలుదేరినది మొదలు మరలి వచ్చువఱకు గల విశేషములను, తాను స్వయముగ చూచి వచ్చినవి రామునకు నివేదించినాడు.

'రామచంద్రప్రభూ! మా అమ్మ సీతమ్మ క్షేమముగ నున్నది' కాని నీకై పరితపించుచున్నది. నీయందుగల మక్కువచే ఆమె జీవించి యున్నది. రావణుడు ఆమెకు గడువు బెట్టెను. కాని ఆమె వానిని తృణప్రాయముగ చూచుచున్నది. 'ఒక నెల దినములలో వచ్చి రాముడు నన్ను తీసికొని వెళ్ళని యెడల నేనిక జీవింపను' అని ఆతల్లి నీతో మనవి చేయుమన్నది. నీకు సాష్టాంగ నమస్కారములు చెప్పినది. లక్ష్మణుని కుశలమడిగినది. ఇదిగో జనకజయిచ్చిన చూడామణి! ఆమె ఆనవాలుగ నీ కివ్వమన్నది.' అని హనుమంతుడు చూడామణిని రాముని చేతికిచ్చెను.

చూడామణిని చూడగనే రామునకు దుఃఖము పొంగి పొరలినది. ఈ చూడామణిని చూడగనే జనకమహారాజు, నాతండ్రి దశరథ మహారాజు గుర్తునకు వచ్చుచున్నారు. సీతను చూడలేక పోయితిని గాని ఆమె ధరించు మణినిగాంచి తృప్తి జెందవలసి యున్నది. సీతను చూచి నట్లే యున్నది.' అని రాముడు వాపోయినాడు.

ఇంకను సీతనుగూర్చి చెప్పమనియు, ఆమె అనిన మాటలను చెప్పుమనియు రాముడు కోరగా హనుమంతుడు చిత్రకూట పర్వతము నందలి కాకాసురుని వృత్తాంతమును సీత చెప్పినట్లు నివేదించెను.

మారుతీ! నీవు రామలక్ష్మణుల వద్దకేగుము. నేనీరాక్షసుల మధ్య లంకయందు పడుచున్న బాధలను వివరించుము. పరాక్రమ శాలురగు రామలక్ష్మణులను వచ్చి, రావణుని సంహరించి నన్ను గొని పొమ్మనుము. ఈ బాధ్యత నీపైనున్నది' అని సీతమ్మ చెప్పినదని హనుమంతుడు మనవిచేసెను.

రామచంద్రా! సాధ్వీమణియగు సీత నీకు చెప్పవలసినదని చెప్పిన దంతయు విన్నవించినాను. ఆమెకు నేను ధైర్యము చెప్పి వచ్చినాను. ఆమె క్షేమముగా నున్నది. ఇక ఆమెను తీసికొని వచ్చు మార్గ మాలోచింపుము.' అని హనుమంతుడ నెను.

శ్లో. తతో మయా వాగ్భిరధీన భాషిణా
శివాభిరిష్టాభిరభిప్రసాదితా
జగామ శాంతిం మమ మైథిలాత్మజా
తవాపి శోకేన తథాభిపీడితా॥



# యుద్ధకాండ

ప్రయాణము :

సీత జాడల కనుగొని వచ్చిన హనుమంతుని ప్రతిభా విశేషము నేమనవచ్చును. రఘువంశమునే అతడు నిలిపినాడు. నేనతనికిఏమియిచ్చి సంతోష పెట్టగలననుచు రాముడు హనుమంతుని కౌగలించుకొనెను.

ఉత్తముడగు హనుమంతుడు జానకి ఎచ్చట గలదో కనుగొని వచ్చెను. కాని సముద్రమును దాటి వానరసేన లంక నెట్లు చేరగలదను సమస్య రాముని పీడించెను. మన కెన్నియో శుభనిమిత్తములు కన్పించు చున్నవి. నిరుత్సాహపడిన కార్యము చెడును. సముద్రముపై సేతువు కట్టుటయే ప్రస్తుత కర్తవ్యమని సుగ్రీవుడు ధైర్యము చెప్పెను.

శ్లో. తపసా సేతుబన్ధేన సాగరోచ్ఛోషణేన వా
సర్వథా సుసమర్థోఽస్మి సాగరస్యాస్య లఙ్ఘనే"

రాము డిట్లనెను, తపస్సును జేసికాని, సేతువును బంధించిగాని, సముద్రమును శోషింపజేసికాని సాగరమును దాటు శక్తి నాకు కలదు, అనుచు లంకయందలి సైన్యము, రావణుని బలము మున్నగు సంగతులను రాముడు హనుమంతుని వలన తెలిసికొనెను. హనుమంతుడుత్సాహ వచనముల బలికెను.

'సుగ్రీవా! లంకాపట్టణమును నాశనముచేయుదును. నేడు ఉత్తరాఫల్గుణి నక్షత్రము, నాకు తారాబలము బాగున్నది. ఇపుడు సూర్యుడు నడినెత్తిపై ఆకాశమున నున్నాడు. ఇది అభిజిన్ముహూర్తము, మనకు విజయము తథ్యము. ఇపుడే వానరసైన్య మంతయు బయలుదేర వలయును. లక్షమంది వానరులతో నీలుడు ముందు నడువవలెను.' అని రాముడనెను.

రామాజ్ఞను శిరసావహించి సుగ్రీవుడు సైన్యమునంతను నియమిత మార్గముల నడపెను. దండు అంతయు దక్షిణ సముద్ర తీరము జేరెను. రాక్షసులు మన రహస్యములు తెలిసికొనుటకు వచ్చుచుందురు. కనుక సేనయు, సేనానాయకులును జాగ్రత్తగా నుండుడని రాముడు హెచ్చరించెను. గోలాంగూల వీరులు, భల్లూక యోధులు, వానర ప్రముఖులు అను మూడు విధముల సైన్యము విడి విడిగ నుండునట్లు సుగ్రీవు డాజ్ఞాపించెను.

సంధ్యాసమయ మయ్యెను. నిండు చందురుడు తూర్పు దిశను ఉదయించి మొగ్గబ్రాకుచుండెను. చంద్రోదయమునకు సముద్ర కెరటములు పై కెగసి పడుచుండెను. సముద్రమువలె నున్న వానర సమూహమున సంతోషముచే కేరింతలు మెండయ్యెను. సముద్రమును మించియున్న ఆకసము నిర్మలముగను చంద్రకాంతిచే నిండినదిగను నుండెను.

రాక్షసరాజు మంత్రాంగము :

రాక్షసరాజగు రావణుడు మంత్రిమండలిని సమావేశపరచెను. హనుమంతుడు ఒక్కడు లంకలో చేసిపోయిన ఘోరకృత్యములను దృష్టియందుంచుకొని బుద్ధిమంతులైన మీరందఱును ఇప్పట్టున మనము రాముని యెడల చేయదగిన కార్యమును ఆలోచింపుడ నెను. వానరసైన్యమును వెంటనిడుకొని, సముద్రమును దాటి రాముడు లంకనుచేరజూచుచున్నాడు. రాక్షసజాతికి మేలుకలుగు టెట్లో యోచింపుడనెను.

రాజేంద్రా ! మీరు వీరాధివీరులు. మూడులోకములను జయించినారు. దిక్పాలకుల సహితము లోబఱచుకొనినారు. మీకు సాటివచ్చువారెవరు ! మహేశ్వరమను యాగమునుజేసి దుర్లభములైన వరములను సంపాదించిన ఒక్క మీ కుమారుడు ఇంద్రశత్రు రాముని, అతని వానరసైన్యమును జయింపగలడు. అని మంత్రులెల్లరు ఏకోన్ముఖముగ పలికిరి.

ప్రిముఖ సేనాపతియగు ప్రహస్తుడు, "ప్రభూ! మనము అశ్రద్ధగా నున్నందున కోతి మోసముచేసెను; వానివలన నేమి?" అనెను.

దుర్ముఖుడు చేతులుజోడించి, "రాజేంద్రా! ఇపుడుమీఆజ్ఞ అయిన యెడల వానరజాతిని నశింపజేయుదును." అనెను.

వజ్రదంష్ట్రుడు వినయముగ, "మహారాజా! మనము నరరూపములతోపోయి భరతుడు పంపినాడనిచెప్పి రామునివద్దచేరి సమయము జూచి మోసగించవలెను." అనెను.

వజ్రహనుడు లేచి, "మహాప్రభూ! మీరు సుఖముగా నుండుడు నేను రాముని, సైన్యమును మంటగలిపివత్తును." అనెను.

కుంభకర్ణుని పుత్రుడు నికుంభుడు "రామలక్ష్మణులను, సుగ్రీవుని నాశనము చేసివచ్చుటకు నేనొక్కడనే చాలుదును." అనెను.

విభీషణు డిట్లనెను. "మహారాజా! ఒక్క వానరుడే యింతపని జేసినాడు. శత్రువుబలము సరిగా లెక్కకట్టవలెను. నీవు సీతాపహరణము జేసితివి. ఇది యెంతవరకు ధర్మము ? సీతవలన లంకకు రాక్షస జాతికి ముప్పురానున్నది. రాముడు దండెత్తిరాకముందే సీతను దీసి కొనిపోయి రామునికి అప్పగించిన మనకు మేలుకలుగగలదు. ఇట్లు చేయుమని అగ్రజుడవైన నిన్ను వేడుకొందును."

విభీషణుడు చెప్పిన హితోక్తులు రావణునకు రుచించలేదు. కోపముతో లేచి రావణుడు మారుబలుకక అంతఃపురములోనికి బోయెను.

## మరునాడు :

విభీషణుడు మరునాటి ఉదయమున రావణాంతఃపురమునకుపోయి జయమునుబలికి యిట్లనెను. "రాజేంద్రా! సీత లంకలోనికి వచ్చినది మొదలు అనేక దుర్నిమిత్తములు కానబడుచున్నవి. ఇవి లంకకుచేటు

కలుగుటను సూచించుచున్నవి. సీతను రామునికిచ్చివేసిన మనము సుఖింతుము. మంత్రులు నీకుభయపడి నిర్మోగమాటముగ చెప్పకున్నారు. నాప్రాణభయమువలన నేను నీకు చెప్పుటలేదు. నీమేలుకోరి నుడువుచున్నాను. తదుపరి నీచిత్తమువచ్చినట్లు చేయుము".

రావణునికోపము అతిశయించెను. "దేవేంద్రుడైనను నన్ను గెలువలేడు. సీతను రామునకివ్వను. నీవు వెళ్ళవచ్చును." అని రావణుడు పలికెను.

రావణుడు కొలువుదీర్చి సింహాసనారూఢుడై యుండెను. మంత్రులు, పండితులు, విద్వాంసులు, సేనానాయకులు మున్నగువారెల్లరును ఒక్కొక్కరు వచ్చి రావణునకు పాదాభివందనము జేసి తమతమ స్థానముల ఆశీనులగుచుండిరి. చివరకు విభీషణుడు వచ్చి తనపేరు జెప్పుకొని పాదములకు నమస్కరించి ఉచితాసన మలంకరించెను.

రాక్షసేంద్రుడగు రావణుడిట్లనెను. "రాక్షస వీరులారా! త్రిలోకసుందరియగు సీతను రమించు కోర్కెనాకు కలిగినది. నేనామెను తీసికొని వచ్చితిని. ఆమెనన్నొక ఏడాదిగడువుకోరినది. నేనిపుడామెను వదలుకొనజాలను. రామలక్ష్మణులు వానర సైన్యముతో వచ్చి సముద్రమున కావల విడిసియున్నారు. నరవానరులన నాకేమియు జంకులేదు. అయినను రానున్నది మనకు తెలియదుగదా! మీఅందరి తోడ్పాటుతో నేను సమస్త లోకములను జయించితిని. ఇప్పుడు సీత నాకు దక్కునట్లును, రామలక్ష్మణులు సంహరింపబడునట్లును ఉపాయము జెప్పుడు."

రావణుని సోదరుడగు కుంభకర్ణుడిట్లనెను. "అగ్రజా! సీతను తెచ్చునపుడు మాలో ఎవ్వరితోనైనను సంప్రదించియుండలేదు. అనాలోచితముగ నీవు అకార్య మొనర్చినావు. నీవు శత్రుంజయుడవేకాని

అధర్మాచరణమువలన నీ పరాక్రమమునందు గాడిపడినది; కానిమ్ము. నేనా రామలక్ష్మణుల ప్రాణముల బలిగొనగలను. నీవు నిర్భయముగ నుండుము.''

విభీషణుడేగాక కుంభకర్ణుడును తనను తప్పులుబట్టి యెంచుటను రావణుడు సహించలేదు. కోపోద్రిక్తుడగుట గమనించిన మహాపార్శ్వుడు రావణునితో, "రాజేంద్రా! సీతతో సుఖముండుము. నేను, ఇంద్రజిత్తు, కుంభకర్ణుడు కలసి ఎంతటి శత్రువునైనను నెదుర్కొందుము. సీతను నీవు లాలించుటేల? బలాత్కారముగనైన భోగించుము."అనెను.

అందుకు సమాధానముగ రావణుడిట్లనెను. "ఈ విషయమున ఒక రహస్యముగలదు. బ్రహ్మలోకమునకు వెళ్ళుచున్న పుంజకస్థల అను నొక అప్సరసాంగనను బలాత్కారముగ రమించితిని. ఆమె బ్రహ్మ వద్దకుపోయి ఏడ్వగా 'ఇకపైన ఏస్త్రీనైనను బలాత్కరించిన నీతలవేయి వ్రక్కలగు'నని బ్రహ్మ శపించెను. అందుచే సీతను బలాత్కరించి రమింపకున్నాను. అయినను రాముడనెంత? నాముందు నిలువలేడు."

ఈ సంభాషణము నంతయు వినుచున్న విభీషణుడు సహింపలేక "అన్నా! వజ్రాయుధమును మించినవి రామ బాణములు. రాముని నీవుగాని యీ రాక్షసవీరులుగాని జయింపజాలరు. ఏలనన ధర్మము మన పక్షమున లేదు. సీతను రామునకిచ్చి వేయుదము. ఇదిమన కెల్లరకును శుభమును చేకూర్చును.'' అని హితవులనాడెను.

"ఓయి పిఱికి విభీషణా! నేనొక్కడనే రామలక్ష్మణుల జయింతు'నని ఇంద్రజిత్తు అనెను.

అందుకు సమాధానముగ విభీషణుడిట్లనెను. ''బాలుడవైన నీకు మంత్రాలోచనము చేయుశక్తి లేదు. పేరునకు పుత్రుడవు గాని నిజముగ శత్రువవు. రాక్షసజాతి రక్షింపబడవలెననిన సగౌరవముగ సీతను రామునకు సమర్పించుకొనటొక్కటే మార్గము."

విభీషణుని హితోక్తులు రావణునకు కర్ణకఠోరముగ నుండెను. "తామరాకుపైని నీటి బిందువుల వలె జ్ఞాతులలో ఒకరికొకరు కలిసి ఐకమత్యముతో నుండరు. నీవు నా తమ్ముడవైతివి. మరొకరైన విడచెడివాడనుకాను. ఓరీ. ద్రోహీ ! పొమ్ము "అని పరుషముగ బలికెను.

రావణుని కఠినోక్తులు విభీషణుడు సహింపలేకపోయెను. వెంటనే అతడు గదాపాణియై ఆకాశమునకెగిరెను. విభీషణుని అనుచరులు అనలుడు, శరభుడు, సంపాతి, ప్రఘసుడు అనువారు నలుగురును పైకెగిరిరి. ఆకసమునుండి విభీషణు డిట్లనెను "అన్నవు, తండ్రి వంటి వాడవు. నన్ను కఠినముగ మాట్లాడినావు. నా హితము నీకు రుచించ లేదు. ప్రియవచనములు బలుకువారు సులభముగా లభింతురు కాని హితము బలుకువారు లభించుట కష్టము. నీలంకను రక్షించుకొనుము. నేను లేని నీవు సుఖించుము". అని వెడలి పోయెను.

విభీషణ శరణాగతి :

అనుచరులతో విభీషణుడు గగనమార్గమున రామలక్ష్మణు లున్న సముద్రతీరమునకు వచ్చెను. ఆకసముననున్న వారినిగాంచి సుగ్రీవుడు 'రామా ! అనుజ్ఞనిచ్చిన వారినికూల్తు' మనెను.

పైనుండి విభీషణుడిట్లు పలికెను. "సుగ్రీవా ! నా పేరు విభీషణుడు. రావణుని తమ్ముడను. సీతను తెచ్చుట ధర్మముకాదనియు, రామునకు అప్పగించి శరణువేడుమనియు నేనుచెప్పిన హితవు మా అన్నకు రుచించలేదు. అతడు నన్ను కఠినోక్తుల అవమానపరచినాడు. భార్యా బిడ్డలనుకూడవదలి, రాముని శరణువేడుటకై వచ్చినాను. సర్వలోక శరణ్యుడగు రామునకు నా రాకనుగూర్చి నివేదింపు'' మనెను.

సుగ్రీవుడు చెప్పినది రాముడు వినెను. అందరి అభిప్రాయము లను రాముడు కోరెను.

సుగ్రీవుడు :- విభీషణుడు శత్రువగు రావణుని తమ్ముడు. ఉన్నట్లుండి మనలను మోసగించును. ఇతనిని శిక్షించ వలయును.

అంగదుడు :- విభీషణుని నమ్ముటకు వీలులేదు. వంచకులు తమ దురుద్దేశ్యములు తెలియకుండునట్లు మసలు చుందురు.

శరభుడు :- గూఢచారివలన విభీషణునిగూర్చి తెలిసికొనవలెను.

జాంబవంతుడు :- విభీషణుడు అనుమానించవలసినవాడే!

మైందుడు :- రావణునిమాట ఏమిటని విభీషణుని అడుగవలెను.

హనుమంతుడు :- రామచంద్రా ! విభీషణుడు తగిన సమయమునకు వచ్చినాడు. రావణుని దుర్మార్గము, నీపరాక్రమమును గుర్తించి నాడు. వాలినిచంపి సుగ్రీవునకు పట్టముకట్టుటను వినియుండును. రాజ్యకాంక్షతో వచ్చియుండును. అతనిని చేర్చుకొనుటవలన మనకేమియు నష్టములేదు. తదుపరి నీ యిష్టము.'

అందరి అభిప్రాయములను వినిన రాముడిట్లనెను.

"జ్ఞాతులు తమలో దాము కలహించుకొనుట సహజము. లంకా రాజ్యము నతడు కోరుచున్నాడు. మనము లంకారాజ్యము కోరము. అందరు సోదరులును భరతుని వంటి వారు కారు. తండ్రులందఱకు నావంటి కుమారులుండరు. సుగ్రీవుని వంటి వారు అందరు మిత్రులు ఉండరు. అతడెట్టివాడైనను నన్నేమిచేయగలడు ? శరణాగతుడనని వచ్చిన శత్రువునైనను అభయమిచ్చి రక్షించుట నా వ్రతము, కావున సుగ్రీవా ! అతనినితోడ్కొనిరమ్ము".

సుగ్రీవుని పిలుపునందుకొని విభీషణుడు రాముని వద్దకువచ్చి "సర్వభూత శరణ్యుడవైన నిన్ను శరణువేడుచున్నాను. నా రాజ్యము, నా జీవితము, నా సుఖము నీ అధీనములు," అనెను.

రాముడు విభీషణుని కరుణించెను. రావణుని యొక్కయు, రాక్షసుల యొక్కయు బలాబలములను తెలియ జేయుమని రాముడు కోరెను.

"మహారాజా! బ్రహ్మవరమువలన రావణుడు దేవ, దానవ, యక్ష, గంధర్వాదులచేచావడు. కుంభకర్ణుని దేవేంద్రుడుకూడ ఎదు ర్కొనజాలడు. ఇంద్రజిత్తు అదృశ్యుడై యుద్ధముచేయును. సేనాధిపతు లగు ప్రహస్తుడు మున్నగువారు వీరాధివీరులు. రాక్షసయోధులు పదికోట్లమందిగలరు. అందరు కామరూపులు.'' అని విభీషణుడు చెప్పెను.

అంత ఎంతటివాడైనను రావణునిచంపి లంకారాజ్యము నీకు పట్టము గట్టుదును. లేనిచో అయోధ్యలో అడుగుపెట్టను. నాతమ్ముల పైని ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నానని రాముడన్న ప్రతిజ్ఞ విభీషణుని మనసును సంతోషమున ముంచెను.

"లంకను జయించుటకు నా ప్రాణములనైన బలియిత్తును."

"లక్ష్మణా! సముద్రజలమును తెచ్చి విభీషణునకు లంకారాజ్యము పట్టము కట్టుము" అని రాముడనెను.

వానరులందరును సంతోషముతో జయజయధ్వానములు చేయు చుండగా లక్ష్మణుడు రాముని యాజ్ఞచే సముద్రోదకమునుదెచ్చి వాన రుల సమక్షమున రాక్షసరాజ్యము విభీషణునకు పట్టాభిషేకముచేసెను.

## చర్భశయనము :

విశాలసముద్రమును వానరసైన్యము దాటుటకు మార్గాంతర మేమని అడిగిన సుగ్రీవునకు, హనుమంతునకు విభీషణుడిట్లనెను.

"సగరవంశీయులకు సాగరుడు తోడ్పడును. రాముడు సము ద్రుని శరణు వేడవలయును."

సుగ్రీవు డీవిషయము రామునకెఱుక జేసెను. లక్ష్మణుని యభిప్రాయముకూడ దీసికొని సముద్రతీరమున దర్భాసనముపరచుకొని దానిపై రాముడు కూర్చొనెను.

వానరసైన్య సమేతుడై రాముడు సముద్రపు టొడ్డున విడిసియున్నాడని వినిన రావణుడు శుకుని బిలిచి 'ఏటులైనను రాముని సుగ్రీవుని విడదీయుము' అని చెప్పి పంపెను.

శుకుడు పక్షిరూపమునవచ్చి 'నీవు కిష్కింధకుపోయి సుఖముగా ఉండుము. లేకున్న ప్రమాదము కలుగు'నని సుగ్రీవునితో చెప్పెను. వానరులు వానినిపట్టి కొట్టిరి. వాడు రామునివద్దకువచ్చి శరణు వేడెను. రాముడు శుకుని విడిపించెను.

'నీవునాకు శతృవవు, మహాత్ముడగు రాముడు నీప్రాణములు హరించు'నని సుగ్రీవుడు రావణునకు కబురంపెను.

మూడు రాత్రులు దీక్షతో రాముడు దర్భపై పరుండి గడపినను సముద్రుడు ప్రసన్నుడుకాలేదు. రామునకు కోపమువచ్చెను.

"లక్ష్మణా! బాణములను, బాణాసనము నిటు తెమ్ము. ఈ సముద్రుడు గర్వించి నన్నుగుర్తింపకున్నాడు. ఇప్పుడీ సముద్రమును ఇంకగొట్టెదను." అనెను. రాముడు తీవ్రమైన బాణమును సంధించి విడచెను. సముద్రమునందలి జలచరములన్నియు చచ్చి పైకి తేలెను. కొన్ని పైకి ఎగిరిపడెను. రాముడు మరొకబాణము తీసెను. వెంటనే లక్ష్మణుడు, 'అన్నా, ఆగుమాగుము' అనెను. రాముడు బ్రహ్మాస్త్రమునే తీసెను.

సముద్రుడు గడగడలాడుచు చేతులు జోడించుకొని రామున కెదురుగవచ్చెను. "రామ భద్రా! పంచభూతములు ప్రకృతిసిద్ధమైనవి. అవి వాని సహజ ధర్మమును కోల్పోవు టుచితముకాదు. ఈ సముద్ర

జలమును లేకుండ చేయుట నా వశముగాదు. నీవు అవతలి యొడ్డునకు చేరుటకు నా శక్తి కొలది సహాయము చేయుదును.'' అని వినయముగ బలికెను.

'నేను బాణమును సంధించినాను. దీని నెచట విడువమందువు ?' అని రాముడడిగెను. 'ఇచటకు ఉత్తర దిక్కున ద్రుమకులమను ప్రదేశమున్నది. అచ్చట దస్యులు చేరి ఘోర కృత్యములు చేయుచున్నారు. వారిపై నీ బాణమును వదలుము.' అని సముద్రుడనెను. రాముడు బాణము విడచెను. దస్యులు నశించిరి. అచట మధుకాంతారమను రమ్య ప్రదేశ మేర్పడెను.

'రఘురామా ! వానరులలో విశ్వకర్మ కుమారుడగు నలుడను వానికి వరము కలదు. ఆతని చేతితో వేసిన ఎంతటి శిలయైనను నీట తేలును. వానిచే వారధి కట్టించుము. నేనును తోడ్పడుదును.' అని చెప్పి సాగరుడు వెడలిపోయెను.

సేతుబంధనము :

రామాజ్ఞ అయినది, వానరులిక బయలుదేరిరి. చిన్నవాని నుండి పెద్దవాని వరకు శిలలు, కొమ్మలు, చెట్లు తీసికొని రాసాగిరి. నలుడు సేతువును నిర్మించుచుండెను. ఐదు దినములలో వారు నూరు యోజనముల వారధి నిర్మాణము పూర్తి జేసిరి. విభీషణుడు దారి తీయగా వానర సైన్యము సేతువుపై గంతులు వేయుచు సాగిపోయిరి. హనుమంతుని భుజములపై రాముడును, అంగదుని భుజములపై లక్ష్మణుడును ఎక్కి సమస్త వానర సేనాసమూహముతో లంకకు చేరిరి.

వానర వీరు లెవరెవ రేయే ప్రదేశములందుండవలెనో రాముడు నిర్ణయించి చెప్పెను.

వానర సైన్యము లంకకు చేరినటుల రావణునకు దెలిసెను.

వేగుల వాండ్రు :

రాక్షససైన్యమున శుకసారణులు మిక్కిలి. చతురత గలిగిన వేగులవాండ్రు. రావణుడంపగా వారు వానర రూపముల వచ్చి జొర బడిరి. వానరసైన్యము ఎంతకలదో లెక్కించుట వారి కసాధ్యమయ్యెను. వారిని విభీషణుడు గుర్తించెను. రాముని వద్ద వారు నిజము నొప్పుకొనిరి.

ధర్మస్వరూపుడగు రాముడిట్లనెను. "మా సైన్యమున ఇంకను మీరు చూడదగిన దేమైన నున్నచో పోయి చూచిరండు. మీ ప్రభువు వద్దకు వెళ్ళి నా మాటగా ఇట్లు చెప్పుడు. 'ఏ బలము చూచుకొని సీతను దొంగిలించుకొని వచ్చితివో ఆ బలము నిప్పుడు చూపుము. రేపు నీలంకను నాశనము చేయుదును."

శుకసారణులు పోయి రావణునకిట్లు విన్నవించిరి."వానరసైన్యమెంతకలదో లెక్కపెట్టలేము. రాముని చూడగా అతడొక్కడే లంకను నాశనము చేయగలడనిపించినది. నూరు యోజనముల పొడవును పదియోజనముల వెడల్పునను వారధి యున్నది".

రావణుడు మరల శార్దూలుడను వేగునుబంపెను. అతడును వానరసైన్యమును చూచి రావణుని యొద్దకేగి రామలక్ష్మణుల బల పరాక్రమములు వర్ణించుటగాక, రాముడు విభీషణునకు లంకా రాజ్యము పట్టము కట్టుటను గూడ తెలిపెను.

రావణుడు బెదరిపోయెను. ఉపాయ మాలోచించెను. విద్యుజ్జిహ్వుడను రాక్షసుని బిలిచి వానిచే రాముని కృత్రిమ శిరస్సు, ధనుర్బాణములను తెప్పించి అశోకవనమున నున్న సీత వద్దకు తీసికొని పోయి చూపించెను. రాముడు మరణించినాడు; ఇకనాకు స్వాధీనము కాగోరెదన నెను. సీత దుఃఖమునకు మేర లేకపోయినది. ఇంతలో

మంత్రుల వద్ద నుండి వార్త రాగా రావణుడు వెడలిపోయెను. వెంటనే రాముని కృత్రిమ శిరస్సు మాయమయ్యెను. విభీషణుని భార్యయగు సరమ సీత వద్దకు వచ్చి 'అమ్మా, నీవు దుఃఖించకుము. ఇది అంతయు రాక్షసమాయ. రాముడు సురక్షితముగనున్నా'డని ఓదార్చెను ఇట్లు చెప్పుచుండగనే యుద్ధభేరి భయంకరముగ మ్రోగెను.

## మాల్యవంతుని హితవు :

రావణుడు మంత్రులను చేరబిలిచి మంత్రాంగము నెరపెను. అందు రావణుని తల్లియగు కైకసికి పినతండ్రి మాల్యవంతుడను వృద్ధుడుండెను. అతడిట్లు అనెను. "రాజేంద్రా ! ఇట్టి తరుణమున శత్రు బలమును, మనబలమును పోల్చుకొనవలెను. నీవు నరవానరుల వలన చావులేకుండా వరము కోరుకొనలేదు. ఇపుడు వచ్చినవారు నరులు, వానరులు! మన కనేక దుర్నిమిత్తములు కన్పించుచున్నవి.' అని ఇంకను చెప్పబోవుచున్న మాల్యవంతుని రావణుడడ్డగించి, 'నీవు శత్రువు క్షేమము కోరుచున్నావు' అని విమర్శించెను.

## సువేలాద్రి :

రాముడు ఎత్తుగానున్న సువేల పర్వతము నెక్కెను. రామునితో వానరసైన్యము వెంబడించెను. అటనుండి లంకా నగరము స్పష్టముగ కన్పించినది. సూర్యుడస్తమించెను. ఆ రాత్రి రాముడచటనే గడపెను.

తెల్లవారినది. మరల వానరులు లంకాపట్టణమును విస్పష్టముగ చూచిరి. విభీషణుడు పట్టణమంతయు వర్ణించి రామునకు చెప్పెను. రావణుని బలపరాక్రమములు వివరించి, 'రామభద్రా ! నీకు రావణుడొక లెక్కకురాడు, సులభముగ జయించ గలవు.' అనెను.

తూర్పుద్వారమున నీలుని, పశ్చిమమున హనుమంతుని, దక్షిణ మున అంగదుని దండెత్తవలసినదని రాముడాజ్ఞాపించెను. రాముడు ఉత్తరద్వారమున నుండదలచెను. కామరూపులైనను వానరు లందఱు వానరులుగనే యుండవలెను. రామలక్ష్మణులు, విభీషణుడు అతని మంత్రులు కలసి ఏడుగురు మాత్రము మానవ రూపములలో నుండుట కును రాముడు నిర్ణయించెను.

ఇంతలో ఒక గోపురాగ్రమున రావణుడుండి వానరసైన్యమును పరికించుటను సుగ్రీవుడు చూచెను. ఆగ్రహమును పట్టజాలక సుగ్రీవుడు ఆకసమున కెగిరి గోపురమందుగల రావణుని కిరీటము తన్నెను. కిరీటము నేలబడెను. రావణుడు రోషముతో లేచి సుగ్రీవునిపై తలబడెను. ఇరువురు రక్కుకొనిరి; పీకుకొనిరి; గ్రుద్దుకొనిరి. ద్వంద్వ యుద్ధము చేసిరి. మాయా యుద్ధము జేయనూహించుచున్న రావణుని గుర్తించి సుగ్రీవుడు ఆకసమున కెగిరి, రాముని వద్దకు రివ్వున వచ్చెను. వానరులు సంతసించిరి.

### అంగద రాయబారము :

యుద్ధ నీతి ననుసరించి రాముడు, మరునాడు రాయబారమంప దలచి అంగదునికి చెప్పవలసిన మాటలు చెప్పిపంపెను.

రావణుడు మంత్రులతో సమాలోచనము జరుపుచున్న సమయ మున అంగదుడు రావణునితో ఇట్లనెను. "నేను వాలి కుమారుడనగు అంగదుడను. రాముడంపిన దూతను. రాముడిట్లు నీతో చెప్పుమనెను. 'రావణా ! సీతను నాకు సమర్పించి నన్ను శరణు వేడుము. నిన్ను క్షమించెదను. లేదేని నిన్ను, నీ వంశమును సంహరించి విభీషణునకు పట్టము కట్టుదును.,

రావణునకు పట్టరానికోపము వచ్చెను. "వీనిని బట్టి నరుకుడు" అనెను. అంగదుడు వారికి చిక్కకపైకెగిరి రాముని కడకు వచ్చెను.

రామ రావణ యుద్ధము :

యుద్ధమారంభించ వలసినదని వానరులకు రాముడాజ్ఞాపించెను. చెప్పినదే తడవుగ వానరులు అగడ్తను పూడ్చిరి. కోటగోడ బ్రద్దలు చేసిరి. బురుజులు పడగొట్టిరి. గోపురములు కూల్చిరి.

రావణుడు చూచెను. యుద్ధమున కనుజ్ఞనిచ్చెను. భేరీభాంకృతులొక్కపెట్టున మ్రోగెను. శంఖారవములు మిన్నుముట్టెను. దేవదానవులవలె వానరరాక్షసులు సంకుల సమరము నారంభించిరి. ఘోరముగ యుద్ధము చేయసాగిరి. రాక్షసులు రథములు, ఏనుగులు, గుఱ్ఱములపై నెక్కి విల్లునంబులు, ఖడ్గములు, గదలు, శక్తి తోమరములు, శూలములు మున్నగు ఆయుధముల నుపయోగించుచు యుద్ధము చేయుచుండ, వానరులు నేలపైనుండి, చెట్లు, చెట్లకొమ్మలు, రాళ్ళు, బండలు మొదలగు వానిని గొని యుద్ధము జేయుచుండిరి. సూర్యాస్తమయమైనను, చీకట్లు గ్రమ్మినను వారు సమర రంగమును వీడలేదు. ఒకరి కొకరు గుర్తింపలేక రాక్షసులలోనే రాక్షసులు, వానరులనే వానరులు హతమార్చుకొన జొచ్చిరి.

ఇంద్రజిత్తు - నాగబంధము :

ఇంద్రజిత్తు విజృంభించి రణమొనర్చుచుండెను. రామలక్ష్మణులు వేయు బాణముల నాతడు తప్పించుకొని వారిపై నిశితశరముల గురిపించుచుండెను. ఇంద్రజిత్తు అదృశ్యుడై యుద్ధము చేయుచుండెను. బాణము వేయుటకుగూడ ఆతడు కన్పించుట లేదు. ఇంద్రజిత్తు నాగబంధాస్త్రములు ప్రయోగింపగా రామలక్ష్మణులు నిశ్చేష్టులై నేలకొరిగిరి. వానరులు నిరాశతో ముఖములు తేలవైచిరి.

ఇంద్రజిత్తు విజయగర్వముతో లంకలోనికరిగి తండ్రితో రామలక్ష్మణుల చంపి వచ్చితినని చెప్పెను. రావణుని కపరిమితానందము కలిగెను. కుమారుని కౌగలించుకొనెను.

పట్టణమంతయును అలంకరింప వలసినదని రావణుడాజ్ఞాపించెను. అశోకవనమున నున్న త్రిజటను బిలిపించి, "రామలక్ష్మణులు మృతి జెందిరని సీతకు జెప్పుము. ఇంద్రజిత్తుచే నిహతులైనారని చెప్పుము. పుష్పక విమానముపై సీతను గొనిపోయి యుద్ధరంగమున నున్న రామ లక్ష్మణుల శవములను సీతకు జూపుము." అని యానతిచ్చెను.

త్రిజట మున్నగు రాక్షసాంగనలు రాజాజ్ఞ మేరకు సీతను పుష్పక ముపై గొంపోయి పడిపోయియున్న రామలక్ష్మణులను చూపించిరి. విచారగ్రస్తులై యున్న హనుమదాదులను, నేలకొరిగియున్న రామ లక్ష్మణులను జూచి సీత గోడుగోడున ఏడ్చెను.

"అమ్మా! రామలక్ష్మణులు మరణింపలేదు. వారి ముఖముల జీవకళనశింపలేదు. వారు మూర్ఛనొందియున్నారు. అదియునుగాక

తే, గీ, నాతి ! యీ దివ్యమణి విమానంబు పుష్ప
కాహ్వ యంబిది గతపతులైన సతుల
మోవ దిప్పుడు నిన్నిటు మోచుచున్న
దట్లగుట నీకు వైధవ్య మరయలేదు.

[గోపినాథరామాయణము]

భర్తృవిహీనులగు స్త్రీలను ఈ పుష్పకము మోయదు.' అని త్రిజట సీతను ఓదార్చెను. సీతమరల అశోకవనమునకు గొంపోబడెను.

విభీషణుడు, సుగ్రీవుడు ఒకచో జేరి కర్తవ్యతా మూఢులై యుండిరి. ఇంతలో పెద్ద సుడిగాలివచ్చెను. గరుత్మంతుడు మహావేగ మున అచటకు వచ్చెను. గరుడుని చూచుటతోడనే రామలక్ష్మ ణుల బంధించి బాధించుచున్న నాగసర్పములు పారిపోయెను. రామ లక్ష్మణులు గరుడుని యనుగ్రహమున పూర్వముకంటె తేజశ్శాలురై సుఖముగ లేచి గరుడుని ఆలింగన మొనర్చుకొనిరి. గరుడు డాకసమున కెగిరిపోయెను. వానరులు సింహనాదములుచేసిరి.

క్రూర సర్పములను బోలిన నాగాస్త్రములనుండి విముక్తిపొంది నటుల రామలక్ష్మణులగూర్చి రావణుడు తెలిసికొని ఏమియులోచని పిచ్చివాడయ్యెను.

రాక్షసవీరులు :

రాక్షసాధిపతియగు రావణుడు మహావీరుడగు ధూమ్రాక్షుని యుద్ధమునకు బంపెను. ధూమ్రాక్షుడు యుద్ధమున అనేకమంది వానరులను బరిమార్చెను. హనుమంతుడును ధూమ్రాక్షుడును తలపడిరి. హనుమంతుడొక కొండను తెచ్చి ధూమ్రాక్షునిపై వేయగా నతడు దాని క్రింద నలిగిచచ్చెను.

పిమ్మట వజ్రదంష్ట్రుడువచ్చెను. దక్షిణద్వారముకడనున్న అంగదునిపై బడెను. అంగదుడు వాని రథమును విరుగగొట్టెను. ఇరువురును కొంతతడవు ముష్టియుద్ధముచేసిరి. పిమ్మట ఖడ్గముల బుచ్చుకొని కొట్టుకొనసాగిరి. అంగదుని శరీరము రక్తముతో తడిసెను. ఏమరి యున్నతటి వజ్రదంష్ట్రుని అంగదుడు కత్తితో మెడపై కొట్టగా తల తెగి దూరముగ బడెను. రాక్షససైన్యము పారిపోయెను.

రావణుని పనుపున అకంపనుడువచ్చెను. వానరులపై శరవర్షము కురిపించెను. హనుమంతుడు వాని నెదుర్కొని చెట్టునొక దానిని పెరికి వానిని మోదగా అకంపనుడు నేలగూలెను.

ప్రహస్తుడు బయలుదేరెను. అతనివెంట అతని ముఖ్యానుచరులును బయలుదేరిరి. జాంబవంతుడు మున్నగువారు ముఖ్యులను చావబాదిరి. ప్రహస్తుని నీలుడెదుర్కొనెను. పెద్దబండతో ప్రహస్తుని తల బ్రద్దలు చేసెను. వానరులు సంతసమున గంతులువైచిరి.

రావణుడు :

ప్రహస్తుడు మున్నగు రాక్షస ప్రముఖులు యుద్ధరంగమున నాహుతియైరని తెలిసి, రావణుడు స్వయముగ తొలిసారి రణరంగమున

కరిగెను. అతని వెంట ఇంద్రజిత్తు, మహోదరుడు, త్రిశిరుడు, నరాంతకుడు మున్నగువారు వచ్చిరి.

రావణుడు కొట్టిన బాణమునకు సుగ్రీవుడు పడిపోయెను. అంతట హనుమంతుడు రావణు నెదుర్కొనెను. హనుమంతుడుకూడ రావణుని దెబ్బకు దిమ్మరపోయెను. నీలుడు అంగుష్ఠ ప్రమాణ శరీరము గలవాడై రావణుని కిరీటముపై నెక్కియు, ధ్వజముపై గంతులను వేసియు, విల్లుపై గెంతియు రావణుని బాధించెను. రావణుడు ఆగ్నేయాస్త్రము ప్రయోగించెను. అగ్నిదేవుని కుమారుడగు నీలుని ఆ బాణమేమియు బాధింపదయ్యెను.

తరువాత రావణ లక్ష్మణులు ఒకరిపై నొకరు బాణముల వర్షము కురిపించుకొనిరి. రావణుని శక్తిబాణమునకు లక్ష్మణుడు పడిపోయెను గాని మరల తేరుకొనగలిగెను.

రాముడు హనుమంతుని భుజముపై నెక్కి రథముపైనున్న రావణుని ఎదుర్కొనెను. రావణుని రథమును నేలమట్టముచేసి, ధనుస్సును జారగొట్టి, కిరీటమును ఢుల్లగొట్టెను. "రావణా ! ఆయుధము లేక నిరాయుధుడవైతివి. నిరాయుధునితో నేను యుద్ధము చేయను. ఇంటికిపోయి శ్రమ దీర్చుకొని మరలరమ్ము !" అని రాముడనగా రావణుడు సిగ్గుతో యుద్ధభూమిని విడచి వెళ్ళెను.

కుంభకర్ణుడు :

మరలి పోయిన రావణుడు మంత్రులను సమావేశపరచెను. అతడు వారితో ఇట్లనెను. "నరులవలన నీకు భయము కలుగు" నని చెప్పిన బ్రహ్మవాక్కు గుర్తునకు వచ్చుచున్నది. ఇక్ష్వాకు వంశీయుడగు అనరణ్యుడు, వేదవతి, పార్వతి, నందికేశ్వరుడు, పుంజకస్థల మున్నగువారి శాపములన్నియు నన్నిపుడు బాధించుచున్నవి. లేకున్న

మానవుడు నన్ను పరాభవించుటేమి? ఈరహస్యములను మీ మనస్సు లందుంచుకొనుడు. లంక నెటులైన రక్షించవలయును. కనుక కుంభకర్ణుని నిద్రనుండి లేపుడు."

కుంభకర్ణుని గాఢనిద్రనుండి మేల్కొల్పుటకు రాక్షసులు మిక్కిలి కృషి చేయవలసివచ్చెను. రాసులకొలది అన్నము, భోజన పదార్థములు, కుండలకొలది మద్యము సిద్ధముగనుంచిరి. వెయ్యిభేరీలను మ్రోగించిరి. కడవలతో నీరు చెవులలో బోసిరి. గూటములతో ఱొమ్ములపై బాదిరి. వెయ్యి ఏనుగులను వక్షస్థలముపైనుండి నడపిరి. తుదకెట్లో ఆవలించుచు నిద్రలేచుచు సిద్ధముగనున్న పదార్థముల నన్నిటిని మెసవి, కల్లుత్రాగి త్రేన్చెను. 'మహారాజు దర్శనము చేయు' డని మంత్రులు విన్నవించిరి. అతడు రావణునికడకుబోయి నమస్కరించి ఉచితాసనాశీనుడయ్యెను. "కుంభకర్ణా! రాముడు వానరసేనతో లంకను ముట్టడించినాడు. రాక్షసజాతినిపుడు నీవురక్షించవలసియున్నది" అని రావణుడనెను.

అన్న చెప్పిన మాటలనువినిన కుంభకర్ణుడిట్లనెను. "ధర్మార్థ కామము లనుభవించవలసినదే గాని కేవలము కామముననే ప్రాధాన్య మిచ్చినగడపువాడు అధముడగును. రాజు తన హితముకోరు వారెవరో, మోసగించు వారెవరో గుర్తింపని యెడల ఆత్మ రక్షణమునకు ముప్పు వచ్చును. సోదరుడగు విభీషణుడు చెప్పినట్లు చేయుటుచితము. లేదా నీకు తోచినట్లు చేయుము."

రావణునకు కోపమువచ్చినది. కనులెఱ్ఱబాఱినవి 'నీవు నాకు ధర్మము బోధించ వలసిన అవసరము లేదు. తెలిసియో తెలియకయో చేసిన దాన్నికై యిపుడు కలిగిన ఆపదనుండి బయట బడుటకు నీ బల పరాక్రమములు చూపుము. వట్టి మాటలు కాదు.' అనెను.

అగ్రజునకు కోపమువచ్చినదని గ్రహించిన కుంభకర్ణుడు 'రాజేంద్రా! ఇప్పుడేపోయి రామలక్ష్మణులను యమపురికంపుదును. నీ యాజ్ఞ జవదాటుదునా?' అనెను.

కుంభకర్ణుడు యుద్ధమునకు వచ్చెను. పర్వతమువలెనున్న నతనిని జూచి వానరులు పారిపోసాగిరి. అంగదుడు వానరులకు ధైర్యముచెప్పి 'ఇది యంత్రము, భయపడవలదు. దానినిప్పుడే విఱుగగొట్టెదము' అని వారి నందర మరలించెను.

ఒక్కొక్కసారికి ఇరువదిమంది వానరులను కుంభకర్ణుడు నోటిలో వేసికొని మ్రింగజొచ్చెను. ద్వివిదుడు, హనుమంతుడు, నీలుడు, అంగదుడు పర్వతముల పెఱికి కుంభకర్ణునిపై యుద్ధముచేయజొచ్చిరి. ఇవి యన్నియు కుంభకర్ణుడు లక్ష్యపెట్టనేలేదు. సుగ్రీవుడువచ్చిపడెను. మలయపర్వతముతో కుంభకర్ణుడు కొట్టిన దెబ్బకు సుగ్రీవుడు మూర్ఛపోయెను. సుగ్రీవుని ఎత్తి కుంభకర్ణుడు లంకలో పారవేసెను. రాక్షసులు సంతసించిరి. మూర్ఛ తేరుకొని సుగ్రీవుడు కుంభకర్ణుని చెవులు కొరకెను; ముక్కు కఱచెను. కుంభకర్ణుడు వానిని వదలెను. అతడు వచ్చి రాముని చేరెను.

కుంభకర్ణుడు మరల యుద్ధమునకుబోయెను. లక్ష్మణుడు వానిపై బాణములను వేసెను. వానిని సరకుసేయక కుంభకర్ణుడు రామునితో యుద్ధమునకు తలపడెను. చెట్టును పెఱికి రామునిపై విసరివేసెను. రాముడు వాయవ్యాస్త్రముచే కుంభకర్ణుని ఒకచేతిని, ఐంద్రాస్త్రముచే రెండవచేతిని, బ్రహ్మదండమునకు సరివచ్చు బాణముతో కుంభకర్ణుని తలను తెగవేసెను. కొండ విరిగిపడినట్లు కుంభకర్ణుడు పడగా అనేక మంది వానరులు రాక్షసులు నలిగిచచ్చిరి. కుంభకర్ణుని మరణమునకు దేవతలు సంతసించిరి.

మరికొందరు :

కుంభకర్ణుడు మరణించెనను వార్త రావణుని దుఃఖములో ముంచెను. తమ్ములు చెప్పిన హితవును పాటించనందువలననే తనకీ దురవస్థ కలిగినదని యేడ్చెను. దుఃఖపడుచున్న తండ్రిని కుమారుడగు త్రిశురుడు ఓదార్చి యుద్ధమునకు బయలుదేరెను. రావణుడు సంతసించి ఆతనివెంట మరికొందఱిని బంపెను. త్రిశురుడు, మహోదరుడు, మహాపార్శ్వుడు, అతికాయుడు, నరాంతకుడు, దేవాంతకుడు బయలుదేరి.

నరాంతకుని అంగదుడు నేలగూల్చెను. దేవాంతకుని హనుమంతుడు చంపెను. త్రిశురుని మూడు తలలను హనుమంతుడు నరికెను. ఋషభుడు కొట్టిన దెబ్బకు మహాపార్శ్వుడు మరణించెను. అతికాయుడును లక్ష్మణుడును ఘోరముగ పోరాడిరి. తుదకు లక్ష్మణుడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించగా అతికాయుడు తల తెగి క్రింద పడెను. రాముడు లక్ష్మణుని మెచ్చుకొని కౌగలించుకొనెను.

రెండవసారి ఇంద్రజిత్తు :

అతికాయునివంటి మహావీరులు రణరంగమున నేలకొరిగిరనువార్త విని రావణుడు మూర్ఛపోయెను. ఇక తాను జయించుట దుర్లభమనుకొని దుఃఖించెను. ఇంద్రజిత్తు తండ్రిని ఓదార్చి యుద్ధమునకు బయలుదేరెను. పుత్రుని ఆశీర్వదించి రావణుడు పంపెను.

ఇంద్రజిత్తు శాస్త్రోక్తముగ యజ్ఞముచేసి బ్రహ్మాస్త్రమంత్రి జపమును చేసికొని రణమొనర్పబోయెను. రాక్షస సైన్యము మహోత్సాహముతో ఇంద్రజిత్తు వెంటబోయెను. ఇంద్రజిత్తు వేసిన బాణములకు తట్టుకొనలేక సుగ్రీవుడు, అంగదుడు, జాంబవంతుడు మున్నగు అనేకమంది వానరయోధులు మూర్ఛిల్లిరి.

ఇంద్రజిత్తు రామలక్ష్మణులతో యుద్ధముజేసి బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. రామలక్ష్మణులు మూర్ఛిల్లిరి. తన గొప్పతనమును చాటుకొనుటకై అతడు లంకలోనికి పోయెను.

మొదటిసారి సంజీవని :

వానరులకు ధైర్యము చెప్పుటకై హనుమంతుడు, విభీషణుడు ఆ రాత్రికాలమున కొరివిపట్టుకొని యుద్ధరంగమున తిరిగిరి. వానర వీరుల శవములు లెక్కకు మిక్కిలిగానుండెను. నీరసించి మూలుగుచున్న జాంబవంతుడు వారికంటబడెను. హనుమంతుడు జాంబవంతునికి నమస్కరించెను. జాంబవంతుడిట్లనెను. "నాయనా ! మారుతీ ! నీవు సంజీవని తెచ్చినయెడల రామలక్ష్మణులు మూర్ఛనుండి తేరుకొందురు. హిమాలయపర్వతమువద్ద ఓషధిపర్వతముకలదు. అందు అనేక ఓషధులు కలవు. వానిలో సంజీవని, విశల్యకరణి, సావర్ణ్యకరణి, సంధానకరణి మనకు కావలెను. అవి తేజోవంతములై యుండును. నీవు క్షణములో తిరిగి రావలెను. లేనియెడల రామలక్ష్మణులకు, వానరులకు ప్రమాదము సంభవింపగలదు."

హనుమంతు డుత్సాహముతో లేచి జాంబవంతునకు నమస్కరించెను. రాముని పాదములకు మ్రొక్కెను. ఆకసమున కెగిరి హిమవత్పర్వతమును జేరెను. తేజోవంతములైయుండు ఓషధులు హనుమంతుడు తమనుగొనిపోవునేమో అని అదృశ్యమయ్యెను. హనుమంతుడు వానిని గుర్తింపజాలక పర్వతమును పెకలించి గగనమార్గమున లంకకువచ్చెను. ఓషధుల వాసన తగిలినంతనే రామలక్ష్మణులు లేచిరి. పిమ్మట వానరులందఱును లేచిరి. వారి శక్తి ఇనుమడించెను.

చనిపోయిన రాక్షసులును ఈ సంజీవని వాసనకు బ్రతికెడివారే గాని మృతిజెందిన రాక్షసులను ఎప్పటి కప్పుడు రావణుడు సముద్రమున నెట్టించెను.

మరల లంకాదహనము :

సుగ్రీవుని ఆజ్ఞ అయినదే తడవుగ వానరులు కాగడాలతో లంకలో జొరబడిరి. రాక్షస గృహములకు కోటబురుజులకు నిప్పు ముట్టించిరి. మరియొకసారి లంకాదహనమయ్యెను. రాక్షసులు గగ్గోలు పెట్టిరి. రథములు కాలిపోయెను. ఏనుగులు, గుఱ్ఱములు కొన్ని చచ్చినవి ; మరికొన్ని త్రెంచుకొని పరుగెత్తినవి.

రావణునకు భయము, కోపము, తొట్రుపాటు ముప్పిరిగొనెను. కుంభకర్ణుని కుమారుల బిలిచి యుద్ధమున కుత్సాహము రేపి పంపెను.

మిగిలిన యోధులు :

రావణుని పనుపున కుంభ నికుంభుల వెంట యూపాక్షుడు, శోణితాక్షుడు, ప్రజంఘుడు, అకంపనుడనువారు సమరతలమున కేగిరి.

వానర రాక్షసులొండొరులు తలపడిరి. ఆకసమున కెగిరి యుద్ధము జేయు శోణితాక్షుని కంటె మిన్నగా అంగదుడెగిరి వానితల నరికి వేసెను. ప్రజంఘుని చేతియందలి కత్తినే లాగికొని, అంగదుడు ప్రజంఘుని శిరము ఖండించెను. యూపాక్షునితో మైందుడు పోరి నేల గూల్చెను. అంగదుడు, జాంబవంతుడు, సుషేణుడు మున్నగు వారు కుంభునితో రణమొనర్చిరి. కాని కుంభుని ధాటికి తట్టుకొనలేక మూర్ఛపడిరి. సుగ్రీవుడును కుంభుడును ద్వంద్వయుద్ధ మొనరించిరి. సుగ్రీవుడు విసరి వేయగా సముద్రమున పడిన కుంభుడు మరల లేచివచ్చెను. సుగ్రీవుని ఱొమ్ము పగులునట్లు గ్రుద్దెను. సుగ్రీవుడెట్లో తట్టుకొని కుంభుని గ్రుద్దిచంపెను. నికుంభుడు రాగా హనుమంతుడెదుర్కొని అతనిని పడవేసి రొమ్ములపై కూర్చొని తల నేలకు వేసికొట్టి చంపెను.

మకరాక్షుడు వచ్చెను. ద్వంద్వ యుద్ధము చేయుమని రాముని పైకి వచ్చెను. ఇరువురు శరపరంపరల గురిపించిరి. రాముడు పావకాస్త్రము ప్రయోగింపగా మకరాక్షుడు చచ్చెను.

మూడవసారి ఇంద్రజిత్తు :

ఇంద్రజిత్తు మూడవసారి యుద్ధరంగమునకు సన్నద్ధుడై వచ్చెను. రామలక్ష్మణులపై తలపడెను. అతడదృశ్యుడై శరవర్షము కురిపించెను. బాణములు వచ్చు దిశ ననుసరించి రామలక్ష్మణులు అమ్ములను వేసిరి. ఇంద్రజిత్తు తాళలేక లంకలోనికి పోయి మరల వచ్చెను.

ఇంద్రజిత్తు రథముపై సీత యుండెను. వానరులు చూచుచుండగా అతడు ఖడ్గముతో సీత తలను నఱుకుచుండెను. హనుమంతుడది చూడలేక కొండదీసికొని వానిపై రువ్వెను. సీత 'హా రామా ! హా లక్ష్మణా! అని రోదనము చేయసాగెను. రాక్షసులు సింహనాదములు చేసిరి.

రామునితో చెప్పవలెనని హనుమంతుడు వెళ్ళెను. వెంటనే ఇంద్రజిత్తు నికుంభిళా హోమము చేయుటకు లంకలోనికి పోయెను.

సీత గొంతు ఇంద్రజిత్తు కోసెనని హనుమంతుడు చెప్పగా రాముడు దుఃఖసముద్రమున మునిగెను. రాముని లక్ష్మణుడు ఓదార్చి "నేనిదే వెళ్ళి ఇంద్రజిత్తును వధించెద''నని బయలుదేరెను.

"ప్రభువరా ! సీతను ఇంద్రజిత్తు వధించలేదు. ఇది అంతయు రాక్షసమాయ. వానికి సీతనుతాకు ధైర్యములేదు. హోమము చేయుటకుగాను వేసినఎత్తు. ఈ హోమము పూర్తి అయిన మనమిక వానిని గెలుచుట దుర్లభము. హోమమును భంగపరచవలెను. కనుక లక్ష్మణునిబంపుము." అని విభీషణుడనెను.

రాముడు ధైర్యము తెచ్చుకొని, 'లక్ష్మణా, విభీషణుడు చెప్పినట్లు చేయుము.' అనెను. లక్ష్మణుడు, విభీషణుడు, అంగదుడు, హనుమంతుడు వానర సైన్యముతో వెళ్ళిరి.

లక్ష్మణుని వెంటబెట్టుకొని వచ్చిన విభీషణునిచూచి ఇంద్రజిత్తు దూషించెను. 'పరులనాశ్రయించి, ఆత్మీయులను నశింపజేయజూచు కుచ్చితుడవు.' అనెను. "నేను సాత్విక ప్రకృతికలవాడను. అధర్మమును సహించను. పాపచింతకలవానిని వదలివచ్చినను దోషములేదు" అని విభీషణుడు సమాధాన మిచ్చెను.

లక్ష్మణుడు బాణములను వేసెను. మఱ్ఱిచెట్టుక్రింద నల్లమేకను బలినివ్వబోవుచున్న ఇంద్రజిత్తు లక్ష్మణునిపై బాణములను వేయుటకు వచ్చెను. ఇరువురును మహారణ మొనరించిరి. ఇంద్రజిత్తు రథము నుజ్జు అయ్యెను. గుఱ్ఱములు మృతినొందెను. సారథి చచ్చెను. అయినను ధైర్యమును కోల్పోవక మరల రథము నెక్కి వచ్చి యుద్ధము జేసెను. లక్ష్మణుడు వేసిన అస్త్రముల నన్నిటిని ఇంద్రజిత్తు త్రుంచివేసెను. ఇంద్రజిత్తు విడచిన గొప్ప అస్త్రముల నన్నిటిని లక్ష్మణుడు ప్రతిహత మొనరించెను. తుదకు లక్ష్మణుడు ఒక మహాస్త్రమును తీసి,

శ్లో. ధర్మాత్మా సత్య సన్ధశ్చ రామో దాశరథి ర్యది
పౌరుషే చాప్రతి ద్వన్ద్వశ్శరైనం జహి రావణిమ్.

(రాముడు ధర్మతత్పరుడు, సత్యసంధుడు, అప్రతిహత పౌరుషశాలి అయినవాడేని ఓ అస్త్రమా! ఇంద్రజిత్తును వధింపుము) అని వదలెను. ఆ బాణము తిరుగులేనిదై మహాయోధుడగు ఇంద్రజిత్తు తలను ఖండించెను.

దేవత లెల్లరును ఆనందించిరి. పుష్ప వర్షము కురిపించిరి. రాక్షసులు భయ విహ్వలులై పరుగిడిరి. వానరులు జయ జయ ధ్వానములు సల్పిరి. రామునివద్దకు వెళ్ళిన లక్ష్మణుని అన్న కౌగలించుకొనెను.

మూడు దినములు ఘోర యుద్ధముచేసిన లక్ష్మణుని గాయములు సుషేణుడు మాన్పెను.

రెండవసారి రావణుడు :

ప్రియపుత్రుడును, మహాయోధుడును అగు ఇంద్రజిత్తు మరణించెనను వార్త వినుటతోడనే రావణుడు మూర్ఛపోయెను. లేచి భోరుభోరున యేడ్చెను. దీనికెల్ల కారకురాలగు సీతను వధింతునని బయలుదేరెను. స్త్రీహత్యాపాతకమున కొడిగట్టవలదని సుపార్శ్వుడు వారించెను.

కోట్ల సంఖ్యలో నున్న మూల బలమును రావణుడు పంపెను. ఏడు ఘడియలలో రాముడు సమస్త రాక్షసబలమును దునుమాడెను. ఈ విషయము తెలుసుకొని రావణుడు కోపోద్రిక్తుడై అతడే స్వయముగ బయలుదేరెను. అతనివెంట మహోదర, మహాపార్శ్వ, విరూపాక్షులు కూడా వచ్చిరి. దారివెంట కనిపించిన అనేక దుశ్శకునములను రావణుడు లక్ష్యపెట్టలేదు.

యుద్ధము ముమ్మరముగ సాగెను. విరూపాక్షుని, మహోదరుని సుగ్రీవుడు చంపెను. అంగదుడు మహాపార్శ్వుని పొడిచిచంపెను.

రావణుడు రోషావేశుడయ్యెను. రావణుడు వేసిన వివిధాస్త్రములను రాముడును, రాముడు వేసిన బహువిధాస్త్రములను రావణుడు ప్రతిఘాత మొనరించిరి. లక్ష్మణుడు రావణుని రథసారథిని, పతాకమును నేలగూల్చెను. విభీషణుడు గుఱ్ఱములను కూల్చెను. విభీషణునిపై రావణుడు ప్రయోగించిన శక్తిని లక్ష్మణుడు విరిచెను. అవుడు రావణుడు లక్ష్మణునిపయిననే శక్తిని ప్రయోగించెను. రాముడు శరపరంపరల గురిపింపగా తాళలేక రావణుడు లంకలోని కరిగెను.

రెండవ సారి సంజీవని ;

లక్ష్మణుడు పూర్తిగా స్పృహ కోల్పోయెను. అతని స్థితినిజూచి రాముడు కుమిలిపోయెను.

శ్లో॥ దేశే దేశే కళత్రాణి దేశేదేశే చ బాన్ధవాః
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః॥

ప్రతి దేశమందును భార్యలుదొరుకుదురు. ప్రతి దేశమందునను బంధువులు దొరుకుదురు. కాని సహజన్ముడైన సోదరుడు దొరుకు దేశమేదియును లేదు - కంటికి రెప్పవలెనుండి కాపాడిన ఇట్టి తమ్ముని గోల్పోయిన నాకింక సుఖమెందులకు ? సీత యెందుల'కని విలపించెను.

సంజీవని మరలతెచ్చిన యెడల లక్ష్మణుడు త్వరలో లేచును. సూర్యోదయము కాకపూర్వమే తేవలయునని సుషేణుడు చెప్పగా హనుమంతుడు మరల సంజీవనికై బయలుదేరి పోయెను

**కాలనేమి :**

మారీచుని కుమారుడు కాలనేమియను రాక్షసుడు తండ్రివలె ఇతడును మాయలమారి. హనుమంతుని వంచన జేసి విజయమును సాధింపుమని రావణుడు కాలనేమిని ప్రోత్సహించిపంపెను.

హనుమంతుడు హిమవత్పర్వతమున మిక్కిలి అందమైన తపో వనమును సృష్టించి అందు కాలనేమి మాయా తపస్వియైయుండెను. హనుమంతుడు దానిని చూచి పూర్వమిది లేదనియు. మార్గము తప్పితిననియు సంశయించెను. ఆశ్రమమునకున్న మునికడ కేగి వినయముతో తాను వచ్చిన విషయమంతయు చెప్పెను. మునియు జరిగిన వృత్తాంతమంతయు ఎఱిగి యున్నట్లుచెప్పి, "నావద్ద మూలికలుగలవు, ఇచ్చెదను. తెల్లవారినపిదప తీసికొనిపొమ్ము'' అనెను. "మిక్కిలి డస్సి యున్నావు ఈ ఆశ్రమ సమీపమునగల సరోవరమునగల తియ్యని నీరు త్రాగుము" అని శిష్యులను తోడుగానిచ్చి హనుమంతుని బంపెను.

ధా న్య మా లి ని :

మారుతి నీరు త్రావుచుండగా ఒక మొసలిపట్టి మ్రింగెను. దాని గర్భము ఛేదించుకొని హనుమంతుడు బయటకు వచ్చెను. ఆ మొసలి పొట్ట చీల్చుకొని పోవుటచే అది చనిపోయి శాపమునుండి విముక్తయైన ఒక గంధర్వాంగన నిజరూపమునొంది నిలువబడి తన వృత్తాంతము నిట్లు హనుమంతునితో చెప్పెను.

"ఆర్యా! నేనొక గంధర్వాంగనను; నాపేరు ధాన్యమాలిని - ఒకనాడు విమానముపై విహరించుచు ఈ సరోవరముకడకు జలక్రీడకై వచ్చితిని. ఇచట శాండిల్యుడను ముని నన్నుజూచి మోహించెను. నేను రజస్వలను, మూడుదినములోపిక బట్టుము. నాలవనాడు వచ్చెదననగా ముని సమ్మతించెను.

ఇంతలో దిగ్విజయయాత్ర ముగించుకొని గర్వముతోనున్న రావణుడు సైన్యసమేతముగ ఈ ప్రాంతమునందు విడిసెను. అతడును నన్నుజూచి మోహపరవశుడై, రజస్వల నైతినన్నను వినక 'మద్య పానమున మత్తెక్కినవారు, రజస్వలయైన స్త్రీలు, వరాంగనలు లభించిన నాకు మిక్కిలి సంతోషము' అనుచు నన్ను రమించెను. సద్యోగర్భముననాకు అతికాయుడను వాడుద్భవించెను. రావణుడు వానిని తోడ్కొనిపోయెను.

నాల్గవనాడు స్నానముచేసి శాండిల్యముని వద్దకు పోయితిని. అతడు నావలన జరిగిన అపరాధమును గుర్తెరిగి కినిసి 'యీ కొలను నందు మొసలివై యుండు'మని శపించెను. "నిన్నుబట్టి రమించిన కామాయత్తుడు పుత్రసోదర సుహృత్సేనా సమేతముగా యుద్ధమున చచ్చును." అనియు శపించెను. నేనా మునిని శాపవిముక్తిని ప్రసాదింప వేడుకొనగా '(శ్రీ)రామ కార్యార్థియై హనుమంతుడు వచ్చును. వానివలన శాపవిముక్తినొందెద'వని అనుగ్రహించెను.

ఇపుడు నీవలన శాపవిముక్తినిబొంది నాస్వస్థానమున కరుగుచుంటిని. ఈ కాలనేమి మాయలవాడు; జాగరూకతతో మెలగుము' అని చెప్పి ధాన్యమాలిని యదృశ్యమయ్యెను.

మాయలమారి మరణము :

హనుమంతుడు మరలి ఆశ్రమమునకు వచ్చెను. హనుమంతుని జూచుటతోడనే కాలనేమి, 'సంజీవని ఉపదేశించెదను. గురుదక్షిణ పెట్టు' మనెను. హనుమంతుడు పిడికిలి బిగించి కాలనేమి బొమ్మున ఒక్కపిడిగ్రుద్దు గ్రుద్దెను. అంతట ఆరాక్షసుడును విజృంభించెను. పక్షిరూపమునను, సింహాకృతితోడను హనుమంతునితో పోరొనర్చి, గెలువజాలక, వంచన జేయుటయే గత్యంతరమని యెంచి పారిపోయెను. సుగ్రీవుని రూపమున హనుమంతుని కడకు వచ్చి, 'వాయుపుత్రా! లక్ష్మణుడు మూర్ఛనుండి తేఱినాడు. సంజీవికై పోవలదు' అనిచెప్పెను. కపటోపాయముల గుర్తెఱిగిన హనుమంతుడు సుగ్రీవునితోనే పోరొనర్చెను. తుదకారాక్షసుడు రూపమును మార్చుకొని శతశృంగుడై విల్లునమ్ములతో హనుమంతుని మిక్కిలి నొప్పించెను. వానిని బట్టి పిడికిళ్ళతో మర్దించి, బొమ్మను బగులగొట్టి చంపెను.

హనుమంతుడు ద్రోణాద్రికేగెను. తనకు కావలసిన ఓషధులిమ్మని ప్రాథేయపడినను పర్వతుడు ప్రసన్నుడు కాలేదు. ఓషధుల నాతడుగుర్తింపలేక, ఆలస్యమగుటకు సహింపక కొండ అంతయు పెకలించి, తేబోవుచుండగా చిత్రసేనాది గంధర్వులు పదుమూడు కోట్లమంది ఆయుధపాణులై వచ్చి హనుమంతునెదుర్కొనిరి. వారందఱతోడను వాయునందనుడు పోరాడి జయించి కొండతో లంకకు బయలుదేరెను.

భరతుని దుస్స్వప్నము :

ఆ రాత్రి భరతుడు దుస్స్వప్నమున అడవియందు రామలక్ష్మణులు నూనెలో ముంచబడిన శిరములు కలవారై బురదయందు చిక్కుకొని, కృశాంగులై విపరీతముగ దుఃఖించుచున్నట్లు చూచి భయభ్రాంతుడయ్యెను. ఇతర దుశ్శకునము లనేకముగాంచెను. పదునాలుగేండ్లు నిండవచ్చుచున్నవి. సీతారామలక్ష్మణులెట్టి యిడుములపడుచుండిరోయని వెతజెందెను. వేదవిదులగు బ్రాహ్మణులను రావించి దుస్స్వప్న దోష శాంతికై దాన ధర్మములాచరించెను.

అట్టి సమయమున హనుమంతుడు సంజీవని పర్వతమును తెచ్చుచు నందిగ్రామము చూచెను. భరతుని జూచిన మారుతి, సీతాలక్ష్మణుల వదలివచ్చిన రాముడని భ్రాంతిజెంది మరల కాదనుకొని లంకకు పోయెను.

ఆకసమున నరుగు హనుమంతుని వెనుభూతముగ భావించి భరతుడు విల్లుచేబూని బాణము సంధింపనుండెను. ఇతడు నీకు విరోధి కాడు, మేలుచేయుచున్నవాడు. 'ఇతడు నీకు ఆప్తబంధువు' అని అశరీరవాణి పలికెను. అంత భరతు డాశ్చర్యమునొంది మిన్నకుండెను.

మాల్యవంతుడు:

హనుమంతుడు కాలనేమిని చంపి సంజీవని పర్వతము తెచ్చుచున్నాడని విని రావణుడు పండ్లు పటపటకొఱుకుచు తాను జేసిన ఎట్టి యుపాయమునను విజయములభించునట్లు కన్పింపమిక్రుద్ధుడయ్యెను. అతడు మాల్యవంతుని పంపి హనుమంతు నెదుర్కొనుమనెను.

వాయునందనుడు సముద్రమును దాటుచున్నప్పుడు మాల్యవంతుడు సైన్యసమేతుడై ఎదుర్కొనెను. ఘోరయుద్ధ మొనరించెను "కొండను సముద్రమున పారవేయుము, విడిచెద"నని మాల్యవంతు

డనెను. హనుమంతుడు తుదకు తోకతో చుట్టి విసరివేయగా మాల్యవంతుడు రసాతలమునబడెను. మిగిలిన రాక్షసులు పలాయనము చిత్తగించిరి.

## రాముని సంతోషము:

హనుమంతుడు లంకను సమీపించెను. సంజీవిపర్వత కాంతులు దశదిశలబ్రాకగా తెల్లవారివచ్చెనని రాముడు దిగులొందెను. రోషకషాయితలోచనుడైన రాముడు "అరాక్షసము జేయుదును; భానుమండలమునే నేలగూలనేసెద' నని, శరచాపములచేబట్టెను. హనుమంతుడు సంజీవని పర్వతము దెచ్చెననియు, వానికాంతులు భ్రాంతినొందించుచున్నవనియు సుగ్రీవుడు విన్నవించి రాముని శాంతింపజేసెను. సుషేణుడు వానరులయందు నిపుణుడగు వైద్యుడు. అతడు కొండపైకి వెళ్ళి, అందు 'విశల్యకరణి' యను ఓషధి గొని తెచ్చి ప్రయోగింపగా లక్ష్మణుడు మూర్ఛదేరి సుఖముగ లేచెను. రాముడు మిక్కిలి సంతసించి ప్రజ్ఞావంతుడగు హనుమంతుని, ధీమంతుడగు సుషేణుని కొనియాడెను. ఈ పర్వతమును యథాస్థానమునసుంచి రమ్మని రాముడనగా హనుమంతుడు తీసికొని మరల ఉత్తరాభిముఖముగ బోవుచుండెను.

రావణుడు మరియొక ప్రయత్నము చేయదలచెను. బలయుతులగు రాక్షస వీరులనుబంపి హనుమంతుని చంపుడు; లేదా కొండను సముద్రమున పడునట్లుచేయుడు; మీకు అర్థరాజ్యమిచ్చెదననెను. రాక్షస యోధులుపోయి హనుమంతు నెదిర్చిరి. కాని హనుమంతుడు వారి నందర చావ చితుకగొట్టి సముద్రమున ద్రోసెను. ద్రోణాద్రిని యథాస్థానమున నుంచి తిరిగి వచ్చెను.

'అగ్రజా! ఈనాడు నాయ్యెడ క్షమింపక పూర్వమే రావణుని నీవు నేలగూల్చవలయును.' అని లక్ష్మణుడు కోపమున రామునితో అనెను. రాముడందులకు సన్నద్ధుడైయుండెను.

## మండోదరి హితవు :

చేసిన ప్రయత్నములన్నియు నిష్ఫలములయ్యెను. రావణునకు నిస్పృహతోబాటు ఆగ్రహముకూడ మెండయ్యెను. ఈనాడెట్లైనను రాముని హతమార్చవలయునని కృతనిశ్చయుడై రావణుడు యుద్ధ సన్నద్ధుడయ్యెను. ఈ వికటాట్టహాసముజూచి మండోదరి దుఃఖపరవశయై నాథునిచెంతజేరి వినయ విధేయతలతో ఇట్లనెను. "నాథా ! మనకు కాలము కలసివచ్చునట్లు లేదు. ఎన్నియో దుర్నిమిత్తములు కన్పించు చున్నవి. దుస్స్వప్నములు వచ్చుచున్నవి. రాక్షసయోధు లందఱును యుద్ధాగ్ని జ్వాలలకు ఆహుతియైరి. అజేయుడగు కుంభకర్ణుడు మడిసెను. స్వర్గాధిపతిని జయించిన వీరశిఖామణి, ఇంద్రజిత్తని బిరుదముపొందిన మేఘనాథుడు స్వర్గమలంకరించినాడు. ధర్మము మనపక్షమున లేదని తోచుచున్నది. సీత సామాన్యవనితకాదనియు, రాముడు పురుషోత్తము డనియు వినియుంటిని. అది యథార్థముగ నేయున్నది. నేను మీకు చెప్పతగినదానను కాను. అయినను ఇప్పట్టున నాకుతోచిన సంగతి మనవిచేయదలచినాను. ఇప్పటికైనను మించిపోయినదిలేదు. ఆ సీతను దీసికొనివెళ్ళి రామునకు అప్పగించుడు. అదియే మంచిమార్గము."

## నాకుతెలియును :

మండోదరి చెప్పిన మాటలను వినినరావణు డిట్లు సమాధానము నిచ్చెను. నాబలపరాక్రమములు తెలిసియు నీవేల పిరికి మాటలు మాటాడుచున్నావు. దిక్పాలకులను జయించితిని, స్వర్గాధినాథుని పార ద్రోలితిని. స్వర్గ మర్త్య పాతాళ లోకముల నన్నెదిరించి నిలిచిన వాడొక్కడును లేడు. ఈ రాముడెంత ? నరుడు! నరులనినను వాన రులనినను నాకు లెక్కలేదు; నాకు జయము నిశ్చయము. ఈనాడు ఎట్టు లయినను ఆ రామ లక్ష్మణుల జయించి తీరెదను." అనెను.

మండోదరి భర్తమాటల కడ్డుతగిలెను. పూర్వాపరముల యోచింపుము. రాముని పరాక్రమము నీవు గుర్తింపకున్నావేమి? పదునాల్గు వేల రాక్షసులను ఒక్క చేతిమీదుగా హతమార్చెను. కోట్ల కొలది మూలబలమును ఏడుగడియలలో నేల గూలనేసెను. ఇంద్రజిత్తు నాగాస్త్రము, నీ శక్తి ఆయుధము వృథా అయినవి కదా! మనమిక రాజ్యకాంక్ష నువీడి, మోహమును, భోగమును మాని మునివృత్తితో అడవుల నుందము. కనుక సీతనిచ్చివేయుడు." అనెను.

ఓసి పిచ్చిదానా! నాకు సర్వమును తెలియును. తెలిసీ యుండియు నేనిట్లు చేసితిని. నీకు పరమార్థమెఱిగింతును. వినుము. ఉత్తమోత్తమమగు స్థానము పొందుటకై నేనిట్లు చేసితిని. రాముడు శ్రీమన్నారాయణుని యవతారమని ఎరుగుదును. లక్ష్మీదేవియే సీతగా జన్మించెనని ఎఱుగుదును. ఎరిగి యుండియు ఆమహామహుని చేతి మరణము ముక్తి నొసంగునని యింత చేసితిని. ఈ యుద్ధ యజ్ఞమున నా ఆత్మనాహుతి చేసెదను. ముక్తికాంతను శుభప్రదముగ వివాహమాడి విశ్రుత సౌఖ్యములొందబోవుచున్నాను.చింతింపకుము."

అని రావణుడిక మారుబలుకక నిశ్చింతగా రథమునెక్కి సైన్య సమేతుడై సమరతలమున కరిగెను.

మూడవసారి రావణుడు :

నాకాధిపతియగు దేవేంద్రుడు రామునకు సహాయముగనుండుటకై తన రథము నిచ్చి తన రథసారథి యగు మాతలిని బంపెను. రాముడు సంతసించి ఆ రథము నెక్కి రావణునితో యుద్ధమొనర్చెను. రావణుడు వేసిన గంధర్వాస్త్రమును గంధర్వాస్త్రముతోను, దైవాస్త్రమును దైవాస్త్రముతోను రాముడు త్రుంచివేసెను. రావణుడు ప్రయోగించిన రాక్షసాస్త్రమును రాముడు గరుడాస్త్రమును ప్రయోగించి తుత్తునియలు చేసెను. రావణుడు విడచిన బాణములన్నియు రాముని ఏమియు

చేయజాలక పోయెను. రాముని బాణములు రావణుని మిగుల బాధించుచుండెను. రావణుడు డలసిపోయెను. విశ్వాస్యుడగు తన రాజును చూచి సారథి రావణుని రథమును యుద్ధభూమినుండి తొలగదోసుకొనిపోయెను. ఇట్లు సారథి తొలగిపోవుటను రావణుడు మన్నించక మరల యుద్ధరంగమునకు పొమ్మని పరుషముగ మాటాడెను.

అగస్త్యమహర్షి - ఆదిత్యహృదయము :

అనేకమంది దేవతలు, మహాఋషులును వచ్చి యుద్ధమును చూచుచుండిరి. వారెల్లరును రామునకు జయము, రావణునకు అపజయము కోరుచున్నవారే! రామరావణులు మరల యుద్ధమునకు సన్నద్ధులగుటను జూచిన అగస్త్యమహర్షి రామునివద్దకు వచ్చెను. "రఘురామా! నీవు సునాయాసముగ శత్రువును జయించుటకు ఆదిత్యహృదయము అను మంత్రమును చెప్పెదను.

సీ॥ ఆవిత్యహృదయంబు - శ్రీదంబు పుణ్యంబు
నఖిల విరోధి సం-హారకంబు
పరమశివంబును - భద్రకారణమును
నిత్యమక్షయ్యంబు - నిఖిలపాప
విదళనక్షమమును - విజయకారణమును
శోకచింతాది ని-షూదనంబు
నుత్తమ మంత్ర మా-యుర్వర్ధనము సర్వ
మంగళ మాంగల్య - మహితయశము

తే.గీ. భక్తి జపియింప, దన్మనూ - పాశ్యమాను
రశ్మిమంతు సముద్యతు - రవిసురాసు
రాదివందితు భాస్కరు - నఖిలలోక
వల్లభుని గొల్వుమీ వివ-స్వంతు దండ్రి !

(శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము.

నీవు ఏకాగ్రచిత్తమున ఆ మంత్రముతో సూర్యుని ఉపాసించుము. జయము కరతలామలకమగును." అని రామునకు ఆదిత్యహృదయ మహామంత్ర ప్రభావమును, మంత్రమును అగస్త్యుడు చెప్పెను. రాముడట్లే ముమ్మారు ఆ మంత్రమును జపించి రావణుని వధించి తీరవలెనను దీక్షతో స్థిరసంకల్పుడై నిలచెను.

రామరావణులకు ఘోరసంగ్రామము జరిగెను. గగనవీధినుండి చూచుచున్న దేవతలిట్లు అనుకొనిరి.

శ్లో॥ గగనం గగనాకారం సాగరస్సాగరోపమః
రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ॥

ఆకాశమునకు పోల్చతగినది ఆకాశమే. సముద్రమునకు పోల్చదగినది సముద్రమే. రామరావణ యుద్ధమునకు పోల్చతగినది రామరావణ యుద్ధమే. అనగా ఇట్టి మహాసంగ్రామము మరియొకటి లేదని భావము.

రాముడనేక బాణములను వదలెను. రావణుని తల నరికెను. వాని తల నేలపై బడినను మరల మరుక్షణముననే వాని తల మొలచియుండెను. ఇట్లు నూరుమారులు నఱికినను మరల మొలచుచు ఉండుటకు రాముడు విసిగిపోయెను. రావణుడు బాణములతోను, శూలములతోను రోకళ్ళతోను రాముని నొవ్వజేయుచుండెను.

ఇది అంతయు ప్రత్యక్షముగ గాంచుచున్న ఇంద్రుని సారథియగు మాతలి, "రామభద్రా! ఇంకను ఆలసించెదవేల? వీడిట్లు చచ్చువాడు కాడు. బ్రహ్మాస్త్రమును ప్రయోగింపుము." అనెను.

అంతట శ్రీరాముడు మాతలి హితవు ననుసరించి బ్రహ్మాస్త్రము నభిమంత్రించి రావణునిపై వదలెను. భూనభోంతరాళములు బ్రద్దలగునట్లు మహాధ్వనిచేయుచు, ప్రళయకాల మార్తాండునివలె బ్రహ్మాస్త్రముపోయి

...తి నాశనాథుడగు రావణుని హృదయమును బ్రద్దలుగాజేసి, ప్రాణ ములఁ బలిగొని భూమికి మరలి తిరిగి రాముని అమ్ములపొదియందు ప్రవేశెను. రావణుని ఘాతిక దేహము కొండవలె నేలబడెను. రాక్షసులు భయభ్రాంతులై నలుదెసల బరుగులెత్తిరి. వానరుల సింహనాదములు, విజయజయధ్వానములు మిన్నుముట్టెను.

దేవతలు పుష్పవర్షమును కురిపించిరి. దేవదుందుభులు దిక్కులు పిక్కటిల్ల మ్రోగెను. దేవతలు, మహర్షులు రాముని కొనియాడిరి. వానరసేనా సమూహమంతయు రాముని చుట్టుముట్టి తమ తమ ఆనందో త్సాహముల బ్రకటించిరి.

ఉత్తర క్రియలు :

రావణుడు మృతినొందుటనుజూచిన విభీషణుడు దుఃఖపరవశు డయ్యెను, "నీ అన్న వీరాధివీరుడై యుద్ధరంగమున అసువుల బాసి నాడు. ఇట్టివానికై క్షత్రియ వీరులు విచారించతగదు. విచారముడిగి యికముందు జరుగవలసిన పనినిగూర్చి ఆలోచింపుము." అని రాముడు విభీషణుని ఓదార్చెను.

యుద్ధరంగమున రావణుడు నేలగూలెనని తెలియుటతోడనే పట్టమహిషి అయిన మండోదరియు, రావణుని భార్యలందఱును గోడు గోడున నేడ్చుచువచ్చిరి. రావణుని శవముపై బడి పెద్దపెట్టున ఏడ్చిరి. సీతను తీసికొని రాకుండిన యెడల ఇంతఘోరము సంభవించెడిదికాదు.' అని ఒకరనిరి. "సీతను మరల రామునికి అప్పగించియున్న మేలయ్యెడిది' అని మరియొక రనిరి. 'దైవమే యిట్లు నీచేత చేయించెను' అని వేరొ కరు బలికిరి. 'దైవగతిని మనము తప్పింపజాలము' అని ఇంకొకరునుడివిరి. "దేవతలు సహితము నిన్నుజూచి గడగడలాడి పారిపోయిరి. ఇపుడు నిన్నొక మానవమాత్రుడు చంపెనన్న వింతగనున్నది. యమధర్మరాజే

రాముని రూపమున వచ్చియుండును. అయినను రాముడు సామాన్య మానవుడు కాడు. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే. అందుకు సందియము లేదు. సీత మరెవరో కాదు. లక్ష్మీదేవియే-సీత నాకన్న అందమున మిన్నయైనదికాదు. కామాంధుడవై గుర్తింపకపోయితివి. హంసతూలికాతల్పమున పట్టుపాన్పులపై పరుండునీవు యీ భూమిపై, యీ పీనుగలమధ్య, ఈ దుమ్ములో పడిపోయితివా? ఔరా ఎట్టి గతిపట్టెను?" అని మండోదరి రావణుని వక్షముపైబడి యేడ్చి మూర్ఛిల్లెను. మిగిలిన భార్యలు ఆమె నోదార్చి లేవదీసిరి.

ఇది అంతయుచూచుచున్న రాముడు విభీషణునితో, 'నీ అన్నకు ఉత్తరక్రియల నెరవేర్చుము' అనెను. "ఇతడు నాకు అన్నరూపములో నున్న శత్రువు. అధర్మవర్తనుడు. వీనికి నేను దహన సంస్కారాదుల నుచేయు"నని విభీషణుడనెను. అందులకు రాముడు, 'విభీషణా! చచ్చిన వానితో శత్రుత్వము కూడదు. మరణముతో వైరమంతరించినట్లే. ఇతడు నీకెట్లో నాకును అట్లే" అనెను.

తదుపరి విభీషణుడు అంతఃపుర స్త్రీల నందరును లంకలోనికి పంపివేసెను. మంచి గంధపుచెక్కతో చితిని పెట్టించెను. పద్మకము, పట్టివేళ్ళు, సుగంధ ద్రవ్యములు, చిత్రాసనము లుంచబడెను. కాళ్ళ మధ్య రోలునుంచిరి. కపిలగోవును వధించి చర్మమునుదీసి నేతిలో తడిపి శవముపై కప్పిరి. గంధము, పూలమాలలు, లాజలుచల్లి వస్త్రము లుంచిరి. వేదోక్తముగా విభీషణుడు చితికి నిప్పు అంటించెను.

విభీషణునికి పట్టాభిషేకము :

విభీషణునికి లంకారాజ్య పట్టాభిషేకము చేయవలసినదని రాముడు లక్ష్మణునికి చెప్పెను. అన్నగారి ఆజ్ఞ ప్రకారము లక్ష్మణుడు లంకా నగరములోనికేగి శాస్త్రోక్తముగ విభీషణునకు పట్టాభిషేకము గావించెను. విభీషణుడు సింహాసనాధిష్ఠితుడై ప్రజల కష్టసుఖముల నించుక విచారించి రాముని వద్దకువచ్చి వినయముతో నమస్కరించెను.

శుభవార్త :

తన ప్రక్కనే నిలచియున్న హనుమంతునిజూచి రాముడిట్లనెను. "రావణుని సంహరించితిని. నేను, లక్ష్మణుడు, సుగ్రీవాదులు సుఖముగ నున్నారము." అని సీతకు చెప్పుము. ఆమె సందేశమును గొనిరమ్ము.

ఆంజనేయుడు సీతవద్దకు వెళ్ళెను. జానకీదేవికి నమస్కరించెను. 'అమ్మా! రామలక్ష్మణులును, సుగ్రీవుడును క్షేమముగనున్నారు. మన శత్రువును, దుష్టుడును అగు రావణుని రాముడు సంహరించినాడు. ఇపుడు లంకారాజ్యమునకు విభీషణుడు ప్రభువుగానున్నాడు. కనుక నీకిది స్వగృహముగా భావించవచ్చును. నీకీ శుభవార్త చెవినివేయుటకై నాప్రభువు రాముడంపగా వచ్చినాను.' అనెను

సీత ఆనందమున కవధులులేవు, 'నీకేమి బదులు చెప్పవలయునో తెలియకున్నది. మిక్కిలి ప్రియమైనవార్త నాచెవినిబడవేసితివి' అనెను.

"అమ్మా! ఇంతకాలమునుండియు, ఈరాక్షసాంగనలు నిన్ను పరిపరి విధముల బాధించినారు. వీరినందఱను తోకచుట్టి నేలగొట్టెదను. సెలవిమ్ము." అని మారుతి అనెను.

'నాయనా! అది వారి తప్పుకాదు. రాజాజ్ఞ నెరవేర్చినారు' వారిని క్షమించివదులుట ఉత్తమ లక్షణము' అని సీత మన్నించెను.

'అమ్మా! రామలక్ష్మణులను త్వరలో చూడగలవు.' అనుచు వాయుసందనుడు వెడలిపోయెను.

సందేశము :

'నా భర్తను చూడగోరుచున్నాను.' అన్న సీత అభిమతమును హనుమంతుడు చెప్పగా రాముడు నిట్టూర్చి, ప్రక్కన నిలిచియున్న

విభీషణునితో, "అభ్యంగనముచేయించి, శుభ్రవస్త్రముతోను, ఆభరణములతోను అలంకరింపజేసి సీతను తీసికొనిరమ్ము." అనెను.

విభీషణుడు స్త్రీలను వెంటనిడుకొని జానకివద్దకేగి, "అమ్మా! సుస్నాతవై, సర్వాభరణ భూషితవై పాలకి నెక్కిరమ్ము. నీ భర్త నిన్నుచూడ గోరుచున్నాడు." అనెను. "స్నానము చేయకనే భర్తను చూచెదను." అని సీత అనెను. "మీ భర్త చెప్పినరీతిగా మీరు చేయవలసినవారు." అని విభీషణుడనగా సీత సమ్మతించెను.

తే. గీ. సతులు నిర్మల జలముల - జలకమార్చి
పట్టుపుట్టంబు ముదమున-గట్టఁబెట్టి
చందనమలంది సురభి పుష్పములు ముడిచి
మేలిమణిభూషణంబులు-సాలఁదొడిగి॥

(కొల్ల రామాయణము)

రాక్షసాంగనలు సీతకు సకలవిధాలంకారములుచేసిరి. బంగరు పాలకి నెక్కించి సీతను రామునివద్దకు విభీషణుడు కొనివచ్చెను.

సీత అగ్నిప్రవేశము :

సీత వచ్చియుండుటకు రాముడు సంతోషము, దైన్యము, రోషము నొందెను. రాముని చూచుటతోడనే సీతకు సంతోషము, ఆశ్చర్యము, ప్రేమ ముప్పిరిగొనగా సిగ్గుతో భర్త ముఖమువంక కన్నెత్తి చూచెను.

రామునిలోనున్న సంతోషదైన్యముల నణగద్రొక్కి, రోషము క్రోధము రూపముతో పైకుబికెను. చురచురచూచుచు రాముడిట్లనెను. "సీతా ! నేను లేని సమయమున నిన్నెత్తుకొని పోయిన దుష్టుని చును మాడి నా పౌరుషమును ప్రకటించుకొంటిని. నా ప్రతిన నెరవేర్చు కొంటిని. పరపురుషుని యింట ఇంతకాలముండిన నిన్ను, సద్వంశ

సంజనితుడనైన నేను పరిగ్రహింపజాలను నీ యిష్టము వచ్చినచోటకు వెళ్ళవచ్చును. లక్ష్మణునివద్ద, భరతునివద్ద, సుగ్రీవునివద్ద లేక విభీషణుని వద్ద నీవుండి కాలము గడుపుకొనుము. అందమైన నిన్ను జూచి రావణుడు ఊరకుండెనా ?"

కర్ణకఠోరమైన రాముని పలుకులను విని సీత, "వీరాగ్రేసరా! పామరుడు పామరస్త్రీని దూరినట్లు పలికినావు. అగ్నిసాక్షిగ వివాహ మాడుటగూడ త్రోసివైచితివి నామనస్సు నీయందే లగ్నమై యుండు టను గమనింపవైతివి. నాశీలముపై ఒట్టుపెట్టుకొనుచున్నాను. నేనెట్టి దుర్వృత్తికిని లోనుగాలేదు. రావణుడు నన్ను పట్టుకొని తీసికొని వచ్చినమాట నిజమే. అపుడు నేను అస్వాధీనను, అది దైవికముగ జరిగినది. ఇట్లనెడివాడవు హనుమంతుని బంపుటేల? పంపకున్న అప్పుడే నా ప్రాణములను తీసికొనియుందును. కలసిమెలసియున్న నన్ను నీవు అర్థము చేసికొనవైతివి. ఇక నేను చచ్చినదాననే." అనుచు లక్ష్మణు నితో, "నా భర్త నన్ను ఇంతటి మహాసభలో పరిత్యజించినాడు. నాకిక గత్యంతరమేమున్నది? ఈనిందను మోయుచు నేను జీవింప నొల్లను. లక్ష్మణా! చితిని పేర్చుము" అనెను.

లక్ష్మణుడు రామునివంక చూచెను. రాముడు అంగీకారము సూచించెను. లక్ష్మణుడు చితిని ఏర్పాటుచేసెను. సీత రామునిచుట్టు తిరిగి నమస్కరించెను. సమస్త దేవతలకును, సూర్యచంద్రులకును అంజలి ఘటించెను. ప్రజ్వలించుచున్న అగ్నిహోత్రునికి ప్రదక్షిణ నమస్కారము లాచరించెను.

సీ. అనిశంబు మచ్చిత్త మాత్మనాథునియందు
దవిలి వర్తించుట తథ్యమేని
వితత దుష్టత్వ శంకితనైన యే నుర్వి
నతిశుద్ధ చారిత్ర నైతినేని

కరము వాఙ్మానస కర్మంబుచే మనో
ధిపు మాట మీఱి వర్తింపనేని
రవిచంద్ర దిగ్వాయు రాత్రి సంధ్యాదిన
భూ నభంబులు సర్వభూతములును

తే గీ. సకల దిక్పాలకులు నాదు సచ్చరితము
సర్వము నెఱింగి యుండుట సత్యమేని
సపనహేతువు లోకైక సాక్షియైన
చిత్రభానుండు నన్ను రక్షించుగాక॥

(గోపీనాథ రామాయణము)

"సకలధర్మస్వరూపుడయిన రాముని నేను మనసా, వాచా, కర్మణా నమ్మియున్నట్లయిన ఈ అగ్నిదేవుడు నన్ను రక్షించునుగాక." అనుచు నాలుకలుజాపి ప్రజ్వలించుచున్న అగ్నిలో ప్రవేశించెను.

లంకాధినాథుడగు విభీషణుడు, కిష్కింధాధిపతియగు సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు మొదలగు వారెల్లరును, వానరులును, రాక్షసులును, ఆకాశమునుండి వీక్షించుచున్న దేవ, గంధర్వ సమూహములును కనులు వప్పజెప్పి చూచుచుండిరేగాని ఒక్కరును రామునకు అభ్యంతరము చెప్పినవారు లేకపోయిరి. అందరి హృదయములును బరువెక్కి కనులవెంట నీరుగార్చిరి.

అపుడు శివుడు, బ్రహ్మ, యముడు, ఇంద్రుడు మున్నగువారు విమానములపై రామునికడకు వచ్చిరి. వారిట్లు అనిరి. "రామా! సీత అగ్నిప్రవేశము చేయుచుండగా నీవు సామాన్య మానవునివలె చూచుచు ఊరకొందువేల?"

శ్లో॥ ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్
యోఽహం యస్య యతశ్చాహం భగవాం స్తద్బ్రవీతు మే॥

"నేను సాధారణ మానవుడననియు, దశరథుని కుమారుడననియు భావించుచున్నాను. కానియెడల నేనెవరను ? ఎందుకిట జన్మించితిని సమస్తమును తెలిసిన భగవంతుడవైన నీవు ఈ వివరమంతయు చెప్ప వలెను." అని రాముడు బ్రహ్మతో అనెను.

సృష్టికర్తయగు బ్రహ్మ ఇట్లనెను. "రామా ! నీవు లోకకర్తవు. చక్రాయుధుడవగు శ్రీమన్నారాయణుడవు, పురాణపురుషుడవు. పురుషోత్తముడవు. సూర్యచంద్రులు నీ నేత్రములు. నీవు సృష్టికి పూర్వము, ప్రళయమునకు తరువాత కనిపించువాడవు. నీ యెడల భక్తిగలవారు ఇహమున సమస్త సుఖములను పరమునందు స్వర్గసుఖములను అనుభవింతురు."

పవిత్రురాలు :

అగ్నిహోత్రుడు చితినుండి సీతతో వెలుపలకు వచ్చెను. "రామా ! నీ సీత ఏ పాపమెరుగని పతివ్రత. స్వీకరించుము. నా ఆజ్ఞకు అడ్డుచెప్పకుము." అనెను.

ఈ మాటలకు సంతసించుచున్న రాముని కనుల నుండి ఆనంద బాష్పములు రాలెను. బ్రహ్మతో ఇట్లనెను. "సీత పరమ పవిత్రురాలు. నాకును, ముల్లోకముల వారికిని ఈ విషయము తెలియును. అయినను లోకులు విశ్వసించుటకై అగ్నిలో పడుచున్న సీతను నేనడ్డగించలేదు. మీరు చెప్పినట్లు చేయుదును." అని సీతను పరిగ్రహించెను.

ఈ సమయమునకు విమానముపై దశరథుడును స్వర్గమునుండి వచ్చెను. అతడు సీతా రామ లక్ష్మణుల నాశీర్వదించెను.

రావణ సంహారమునకు దేవేంద్రుడు ఆనందించి "నీ కేమి కావలయునో కోరుకొను"మని రామునితో అనెను.

నా కొఱకు అనేక కష్టములకు గురియై, అసువులుబాసిన వానర సేన మరల తొల్లిటివలె శక్తిసామర్థ్యములతో నుండునటులను, వారు జీవముల పొందునట్లును కోరుదును." అనిన రాముని కోర్కె నెరవేరు నట్లు దేవేంద్రుడు, 'అట్లే అగునుగాక' అనెను. దేవతలు వెడలిపోయిరి.

వానర సమూహమంతయు సంతసించునట్లు చనిపోయిన వారం దరు నిదుర మేల్కాంచిన వారివలె లేచిరి.

### తిరుగు ప్రయాణము :

అమావాశ్య వెళ్ళగా పాడ్యమి ఘడియలయందు రావణవధయు, విదియ తదియలలో విభీషణ పట్టాభిషేకము సీత అగ్ని ప్రవేశము జరిగెను. ఆ రాత్రి గడచిపోయెను.

మరునాడు విభీషణుడు రామునివద్దకేగి, స్నానము, అలంకారము చేసికొనుడనెను. అందులకు రాముడు, 'విభీషణా! నాకొఱకై భరతుడు వేచియుండును. నేనిట అలంకారములతో కాలము గడుప జాలను. నీసత్కారములు సుగ్రీవాదులకు చేయుము. నేను అయోధ్యకు త్వరగా వెళ్ళవలయును' అనెను.

విభీషణుడు సుగ్రీవాది వానరోత్తములకు రత్నాభరణములనిచ్చి సత్కరించెను. మరియును రామునితో విభీషణుడిట్లనెను. "ప్రభూ! కుబేరుని గెలిచి రావణుడు తెచ్చిన పుష్పక విమానమున్నదికదా! దానిపై మీరు త్వరితగతిని అయోధ్యకు చేరగలరు."

రాముని ఆజ్ఞపై విభీషణుడు పుష్పక విమానము గొనితెచ్చి శ్రీరాముని ముందుంచెను. రాముడా విమానమునందాసీనుడై ప్రియ పత్ని సీతను అంకభాగమున కూర్చుండబెట్టుకొనెను. లక్ష్మణుడును విమానమునందాసీనుడయ్యెను. విభీషణ సుగ్రీవాదులుకూడ రాముని వెంట అయోధ్యకువచ్చు తమ అభిమతమును తెలిపిరి. రాముడంగీక

రించెను. వానరులు, రాక్షసులు విమానము నెక్కిరి. శ్రీరామ చంద్రుని యధిష్ఠితము నెఱిగిన పుష్పకము ఆకసమున కెగిరెను.

సముద్రమును, వారధియును, దర్భపై శయనించిన స్థలము మున్నగు వానిని చూపుచు రాముడు సీతకు పూర్వవృత్తాంతమును తెలిపెను. కిష్కింధకు వచ్చితిమని రాముడనగనే సీత 'ఆర్యపుత్రా! తార మున్నగు కిష్కింధయందలి స్త్రీలను చూడవలయుననియు, వారిని గూడ అయోధ్యకు తీసికొని పోవలయుననియు కోరికగనున్నద నియు అనెను. విమానము క్రిందికిదిగెను.

రామాజ్ఞననుసరించి సుగ్రీవుడు అంతఃపురములోనికి వెళ్ళి తార, రుమ మున్నగు వానర వనితారత్నములను వెంటనిడుకొని వచ్చి పుష్పకము నధిరోహించెను. మరల విమానము బయలుదేరి ఋష్యమూక పర్వతమును, దండకారణ్యమును దాటి, చిత్రకూటమధిగ మించి భరద్వాజాశ్రమమును చేరెను. ఆనాడు చైత్ర శుద్ధపంచమి. సీతా రామ లక్ష్మణులు అరణ్యవాసమునకు బయలుదేరి ఆనాటితో పదునాలుగు సంవత్సరములు ముగియుచుండెను.

అయోధ్యయందలి భరతుడు, తల్లులు, ప్రజలు మున్నగువారి క్షేమసమాచారములను భరద్వాజమహర్షివలన రాముడు తెలిసి కొనెను. మహర్షి కోరికపై రాముడానాడు ఆశ్రమమున నుండి ఆతి థ్యము స్వీకరించెను. రాముని కోరికపై వానరసేనా సమూహమునకు భుజింప ననువుగ నుండునట్లు అకాలమైనను వృక్షములు ఫలముల నిండియుండునట్లు భరద్వాజ మహర్షి అనుగ్రహించెను.

నందిగ్రామము :

ఆరాత్రి భరద్వాజాశ్రమమున గడుపదలచెను. హనుమంతుని రాముడు బిలిచి ఇట్లనెను. "శృంగిబేర పురమునకు బోయి గుహుని తోడను, నందిగ్రామమున నున్న భరతునకును మారాకను గూర్చి

తెలియజేయుము." హనుమంతుడు నరరూపమున బోయి "గుహానకును, భరతునకును సీతా రామలక్ష్మణులు రేపు ఉదయమున వచ్చుచున్నారు." అను ప్రియమైన వార్తను తెలిపెను. భరతుడు హనుమంతుని కౌగలించుకొని సత్కరించెను. పిమ్మట హనుమంతుని వలన రాముని వృత్తాంతమంతయు, అనగా పాదుకలు గొనివచ్చిన దాది తిరిగి రాముడు భరద్వాజాశ్రమము చేరువరకు భరతుడు శ్రద్ధగా వినెను. శత్రుఘ్నునకీవార్త చెప్పి అయోధ్య వరకు గల బాటను సిద్ధము చేయించెను.

తల్లులు ముగ్గురు, అంతఃపురాంగనలు, మంత్రులు, పురజనులు మున్నగు వారెల్లరు అయోధ్యనుండి నందిగ్రామముచేరిరి. భరతుడు రాముని పాదుకలను నెత్తిననిడుకొని, వందిమాగధులు స్తోత్రవాచకములు బలుకుచుండగా బ్రాహ్మణులు వేదమంత్రముల నుచ్చరించుచుండగా, మంగళవాద్యములు మ్రోగుచుండగా ఊరి వెలుపలకు వచ్చెను. ఇంతలో రాముని విమానము కంటబడెను.

జనుల కోలాహలముమధ్య విమానము నేలపై వ్రాలెను. భరతుడు రామునికి నమస్కరించెను. రాముడు భరతుని కౌగలించుకొనెను. సీతా రాములు పెద్దలెల్లరకును నమస్కరించిరి. భరతుడు పాదుకలను రాముని ముందుంచెను. స్వయముగ రాముని పాదములకు తొడిగెను. 'అన్నా! ఇది నీరాజ్యము, నీవు స్వీకరించుము. నా కోరిక నెరవేరును, నేను ధన్యుడనౌదును' అనెను.

అందరును విమానముపై నందిగ్రామములోని భరతాశ్రమమునకు వచ్చిరి. 'విమానమా! ఇక నీ యజమానియగు కుబేరునివద్దకుపొమ్ము' అని రాముడు పుష్పకమును పంపివేసెను.

దీక్షాబద్ధులైయున్న రామ, లక్ష్మణ, భరతులు క్షురకర్మల గావించుకొని మంగళాస్నానములనొనర్చిరి. సమస్తభూషణాలంకృతులు

గావింపబడిరి. కౌసల్యా మున్నగువారు సీతను అలంకరింపజేసిరి. సుమంత్రుడు ప్రకాశవంతమగు రథము తెచ్చెను.

## శ్రీరామ పట్టాభిషేకము :

మంగళవాద్యములు మ్రోగుచుండెను. మేలుజాతి గుఱ్ఱములు కట్టిన రథముపై రాముడు అయోధ్యానగరమునకు బయలుదేరెను. భరతుడు రథము నడపెను. శత్రుఘ్నుడు తెల్లగొడుగుపట్టెను. లక్ష్మణుడును, విభీషణుడును వింజామరలు విసరిరి. సుగ్రీవుడు ఏనుగునెక్కి ముందుదారిచూపెను. మిగిలిన వారెల్లరును ఉచిత వాహనము లెక్కి బయలుదేరిరి.

అయోధ్యానగరము శోభాయమానముగ అలంకరింపబడెను. సుమంత్రుడు మున్నగు మంత్రులు ఎదురువచ్చి స్వాగతము పలికిరి. ముత్తైదువలు సౌధోపరిభాగములనుండి పుష్పములు, లాజలు చల్లుచుండిరి. ప్రజలు జయజయలు పెట్టుచుండ శ్రీరాముడు దశరథుని సౌధమున ప్రవేశించెను.

భరతుని కోర్కెమేరకు సుగ్రీవుని ఆజ్ఞపై నలుగురు వానర ప్రముఖులు నాలుగు సముద్రములకేగి నాలుగు బంగారు కలశములనిండ నీరు దెచ్చిరి.

వసిష్ఠుడు సీతా సమేతుడైన రాముని రత్నసింహాసనముపై కూర్చుండ జేసెను. వసిష్ఠాదు లెనమండుగురు రాముని అభిషేకించిరి. లోకపాలురు, దేవతలు ఆకసము నుండి ఓషధులచే రాముని అభిషేకించిరి. శత్రుఘ్నుడు శ్వేతచ్ఛత్రము పట్టెను. సుగ్రీవుడును, విభీషణుడును వింజామరలు వేసిరి. నూరు బంగారు తామరలు గల మాలికను, రత్నమయమాలికను దేవేంద్రుడు వాయుదేవుని వలన బంపి సమర్పింపజేసెను.

రాముడు బ్రాహ్మణులకు గోహిరణ్యాది దానముల నొసగెను. సుగ్రీవునకు రత్నహారమును, అంగదునకు భుజకీర్తులను ఇచ్చెను. ఒక ముత్యాలహారమును రాముడు సీతకిచ్చి నీ కానందము కలిగించిన వానికిమ్మనెను. ఆమె హారమును హనుమంతున కిచ్చెను. విభీషణునకు, జాంబవంతునకు, తదితర వానరులకు వారివారికి తగిన విధముగ బహూకరణముల నొసగెను.

దేవతలు పుష్పవృష్టి గురిపించిరి. అప్సరసలు నృత్యమాడిరి. రాముని వద్ద సెలవు దీసికొని విభీషణుడు, సుగ్రీవుడు తమ పరివార జనముతో తమతమ నెలవులకు జనిరి.

రా మ రా జ్య ము :

భూమి సస్యసమృద్ధమయ్యెను. వృక్షములు పుష్పఫలశోభితములయ్యెను. దేశమున కఱవు కాటకములు లేవయ్యెను.

రాముడు భరతునకు యౌవరాజ్య పట్టాభిషేకము చేసెను. సోదరుల సహాయముతో అనేక యజ్ఞములను చేసెను.

రాముని రాజ్యమున అన్ని వర్ణముల వారును తమ కులవృత్తుల నిర్వర్తించుకొనుచు సత్యవంతులు, ధర్మపరాయణులును అయియుండిరి. స్త్రీలు విధవలగుట గాని, పెద్దలుండగా పిన్నలు మృతినొందుట గాని లేదు. రోగముల వలన, దొంగలవలన, ప్రజలు భయము నెరుగరు. ప్రజలకు రాముడే తండ్రి, రాముడే ప్రభువు, రాముడే దైవము.

సమస్త జనులును సర్వ సుఖములను అనుభవించుచుండిరి. శ్రీమంతుడయిన రాముడిట్లు తమ్ములతో గూడి పదునొకండు వేల సంవత్సరములు రాజ్య పరిపాలన మొనర్చెను.

శ్లో॥ దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ
భ్రాతృభిస్సహితః శ్రీమాన్రామో రాజ్యమకారయత్.

శ్లో॥ ఆదికావ్య మిదం త్వార్షం పురా వాల్మీకి నా కృతమ్
యఃపఠేచ్ఛృణుయాల్లోకే నరః పాపాద్విముచ్యతే.

శ్లో॥ ఆయుష్య మారోగ్యకరం యశస్యం
సౌభ్రాతృకం బుద్ధికరం సుఖంచ
శ్రోతవ్య మేతన్నియమేన సద్భి
రాఖ్యాన మోజస్కర మృద్ధికామైః



# ఉ త్త ర కాం డ

## అ భి నం ద న లు :

శ్లో॥ ప్రాప్తరాజ్యస్య రామస్య రాక్షసానాం వధేకృతే
ఆజగ్ముర్మునయః సర్వే రాఘవం ప్రతినన్దితుమ్॥

శ్రీరాముడు పట్టాభిషిక్తుడై ధర్మపరిపాలన మొనర్చుచుండగా నాలుగు దిశల నుండి అనేకమంది మునులు వచ్చి అభినందించిరి. అట్టి వారిలో సప్తమహాఋషులు, అగస్త్యుడు, కణ్వుడు, ధౌమ్యుడు మున్నగు మహా ఋషులు కూడగలరు.

రాముడు వచ్చుచున్న మహా మునులకు ఎదురేగి అర్ఘ్య పాద్యములనిచ్చి సత్కరించి ఉచితాసనాశీనుల గావించెను. మునులిట్లనిరి. "రామభద్రా! దేవతలను గూడ గడగడ లాడించిన రావణ కుంభకర్ణుల సంహరించినావు. వారికంటె అవధ్యుడగు ఇంద్రజిత్తును తెగటార్చితివి. మూడులోకములకు సుఖమును ప్రసాదించితివి. చాల సంతోషమైనది."

'ఇంద్రజిత్తును ప్రత్యేకించి చెప్పితిరి. వారిపుట్టుపుర్వోత్తరములు దయతో ఆనతీయు'డని రాముడనెను.

అగస్త్య మహాముని ఇట్లు చెప్పదొడగెను.

## పులస్త్యబ్రహ్మ :

కృతయుగము నందు ప్రజాపతి కుమారుడును, బ్రహ్మర్షియు నగు పులస్త్యుడు కలడు. ధర్మము తెలిసికొనుటకు మేరుపర్వత సానువుల నున్న తృణబిందుని ఆశ్రమమున కొంతకాలము పులస్త్యు డుండెను. 'ఆశ్రమ సమీపమునకు వచ్చిన కన్య గర్భవతియగు' నను

పులస్త్యుని శాపము తెలియక ఒకనాడు తృణబిందుని కుమార్తె ఆశ్రమ సమీపమునకు బోయి గర్భవతి అయ్యెను. తృణ బిందు ఈ విషయము దివ్యదృష్టి వలన తెలిసికొని కుమార్తెను దీసికొనిపోయి పులస్త్యుని వద్ద పరిచర్యలు చేయ అంగీకరింపజేసెను. ఆమెకు ఒక మగబిడ్డ కలిగెను. వేదాధ్యయనము చేయుచున్నపుడు కలిగిన వాడగుటచే విశ్రవుడని నామకరణము చేసెను.

కుబేరుడు :

భరద్వాజుని కుమార్తెయగు దేవవర్ణిని విశ్రవుడు వివాహమాడెను. వారికుమారుడు వైశ్రవణుడు. అతడే కుబేరుడని ప్రఖ్యాతి నొందెను. ఇతడు బ్రహ్మనుగూర్చి వేయివత్సరములు ఘోర నియమములతో తపస్సు జేసి బ్రహ్మవలన "లోక పాలుడుగను, ధనాధ్యక్షుడు"గను వరములనందుటయేగాక పుష్పక విమానముకూడ పొందెను.

కుబేరుడు తండ్రివద్దకుపోయి వరముల సంగతిచెప్పి తనకు నివాస స్థానము చూపగోరెను. "దక్షిణ సముద్రమున లంకాపురము కలదు. విష్ణుభయముచే రాక్షసులు దానిని వదలి రసాతలమునకుబోయిరి. ఆ పట్టణమున నీవుండుము." అని విశ్రవుడనెను. కుబేరుడు లంకకుచేరి యక్షులకు ప్రభువై పాలించెను.

యక్షులు, రాక్షసులు :

సృష్టికర్తయగు బ్రహ్మ ప్రాణులను సృష్టించెను. జలమును రక్షించుచుండుడని బ్రహ్మ అనెను. వారిలో కొందరు 'భక్షామః' (తినెదము) అనిరి; కొందరు 'రక్షామః' (రక్షింతుము) అనిరి. భక్షామః అనినవారు యక్షులుగను, రక్షామః అనినవారు రాక్షసులుగను అయిరి.

రాక్షసులలో హేతి, ప్రహేతి అను అన్నదమ్ములలో ప్రహేతి తపము జేసికొనుటకు బోయెను. కాలుని కుమార్తె భయ అను నామె వలన హేతికి విద్యుత్కేశుడు జనించెను. సంధ్య కూతురగు సాలకంట కను విద్యుత్కేశుడు పెండ్లాడెను. రతియందనురక్తిగల సాలకంటక తనకు అంతరాయముగాకుండ కలిగినబిడ్డను మంధర పర్వతముపై వదలెను. పార్వతీ పరమేశ్వరులాశిశువు ఏడుపువిని జాలినొందిరి. బాలుడు వెంటనే తల్లితో సమానమగు వయసుకలిగి యుండునట్లును, మరణము లేకుండునట్లును శివుడు వరములిచ్చి ఆకాశమున సంచరించు పట్టణముకూడ నిచ్చెను. రాక్షసులకు గర్భాదానమైనంతనే గర్భము దాల్చునట్లును, వెంటనే శిశువు జనించునట్లును, జనించగనే తల్లితో సమానవయసు కనిగినవాడగు నట్లును పార్వతీదేవి వరములను ప్రసాదించెను. పార్వతీ పరమేశ్వరులీబాలునికి సుకేశుడని పేరుబెట్టిరి.

గ్రామణియను గంధర్వుని కుమార్తె దేవవతి వలన సుకేశునకు మాల్యవంతుడు, మాలి, సుమాలి అను ముగ్గురు కుమారులు కలిగిరి.

## లంకానగర నిర్మాణము :

ఈ ముగ్గురన్నదమ్ములు బ్రహ్మనుగూర్చి ఘోరమైన తపస్సు జేసి శత్రువులను జయించునట్లు, మహారాజులై యుండునట్లు బ్రహ్మ వలన వరములను పొంది వరగర్వమున దేవతలను సహితము వేధించిరి. విశ్వకర్మను బిలిచి కైలాసము వంటి పట్టణము నిర్మించుమనిరి. త్రికూట పర్వత శిఖరమున రమ్యమగు లంకాపట్టణమును విశ్వకర్మ వలన నిర్మింప జేసికొని వారందు ప్రవేశించిరి.

సుందరి, కేతుమతి, వసుధ అనువారు నర్మదయను గంధర్వాంగన దుహితలు. వీరుసుకేశుని ముగ్గురు కుమారులను పెండ్లాడిరి. మాల్యవంతుడు, సుందరివలన వజ్రముష్టి, విరూపాక్షుడు, దుర్ముఖుడు సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, మత్తుడు, ఉన్మత్తుడు, అను మగ సంతాన

[illegible]. అనల యను కుమార్తెను బడసెను. సుమాలి, కేతుమతి దంపతులకు ప్రహస్తుడు, అకంపనుడు, వికటుడు, కాలకర్ముడు, ధూమ్రాక్షుడు, దండుడు, సుపార్శ్వుడు, సంహ్రాది, ప్రఘసుడు, భాసకర్ణుడు అను పుత్రులును, పుష్పోత్కట, కైకసి, కుంభీనసి అను పుత్రికలును జనించిరి. మాలి భార్య అయిన వసుధకు అనలుడు, అనిలుడు, హరుడు, సంపాతి అను కుమారులు పుట్టిరి.

విష్ణువుతో పోరాటము :

మహాబలవంతులగు సోదరులు ముగ్గురును విచ్చలవిడిగ సంచరించుచు, మునులను బాధించుచు, యజ్ఞములను ధ్వంసము చేయుచుండిరి. దేవతలను, నాగులను కూడ బాధించిరి. ముల్లోకములవారును శివుని వద్దకు పోయి మొరబెట్టుకొనిరి. సుకేశునిపై గల అనురాగముచే శివుడు మిన్నకుండెను. అంతటవారు నారాయణుని కడకుపోయి రక్షింప వేడుకొనిరి. నారాయణుడభయ మిచ్చెను.

ఈ విషయ మెరిగిన సోదరులు దేవతలపై దండెత్తిరి. శ్రీమన్నారాయణుడు శంఖ, చక్ర, గదా, శార్ఙ్గములను బూని గరుడ వాహనారూఢుడై మాల్యవంతాదుల నెదుర్కొనెను. వారలకు పోరు ఘోరముగ జరిగెను. అందు విష్ణువు చక్రాయుధముతో మాలి శిరమును ఖండించెను. మాల్యవంతుడు, సుమాలియు మరికొంత కాలము విష్ణువుతో పోరాడిరి కాని వృథా అయ్యెను. అంతట వారిరువురును లంకయందుండుట క్షేమము కాదనుకొని అనుచరులతో రసాతలమునకు పారిపోయిరి. సుమాలితో నున్న వారందరును సాలకంటక వంశీయులు. రావణుడు మున్నగువారు పౌలస్త్య వంశీయులు. ఎంతయో బలవంతులైన ఈ ఇరు వంశముల వారిని శ్రీమన్నారాయణుడు మాత్రమే సంహరించ గలడు. మాల్యవదాదులు రసాతలమునకు పారిపోయి లంకా పట్టణమున నెవ్వరును లేకుండుటచే కుబేరుడు ఆక్రమించెను.

## కైకసి సంతానము:

ఒకనాడు సుమాలి భూలోకమునకువచ్చి కుబేరుడు విమానముపై సంచరించుచుండుట జూచి అసూయతో తిరిగిపోయి తన కుమార్తె కైకసితో "విశ్రవుని అనుగ్రహముపొంది కుబేరునివంటి కుమారుని కనుము" అనెను.

కైకసి విశ్రవునికడకు పోయెను. అది సంధ్యాసమయము. అతడు అగ్ని కార్యమును జేయుచుండెను. కైకసి తలవంచుకొని కాలి బొటన వ్రేలితో నేలరాయుచుండెను. యోగదృష్టిచే విశ్రవుడు కైకసి మనోగతము నెఱిగి వివాహమాడెను. "నీవు సంధ్యాసమయమున వచ్చితివి. దుష్టకాలమగుటచే దుష్టులగు కుమారులు కలిగెదరు. వారు రాక్షసులయ్యెదరు." అని భర్త చెప్పెను. ఇట్టి దుష్టసంతానము కలుగుటకు చింతించుచు కైకసి భర్త పాదములబట్టి వేడుకొనగా, 'ఇది తప్పునది కాదు. కాని నీ కనిష్ఠ సంతానము ధర్మజ్ఞుడగును.' అని అనుగ్రహించెను.

కొంతకాలము గడచినది. పది తలలు, ఇరువది చేతులుగల భయంకరాకారుడు జన్మించెను. అప్పుడు భూమి వడకెను. రక్తము వర్షించెను. ఇతడే దశముఖుడు (రావణుడు). తరువాత మహాబలశాలి యగు కుంభకర్ణుడు, పిమ్మట వికృతరూపియగు శూర్పణఖ, తుదకు విభీషణుడును కైకసికి జన్మించిరి.

ఒకనాడు తండ్రిని చూచుటకు విమానముపై వచ్చిన కుబేరునిజూచి కైకసి రావణునితో 'నీ అన్నవలె నీవును ఐశ్వర్యవంతుడవు కావలె'నని చెప్పెను. 'అన్నకంటె మించినవాడనగుదు' నని దశముఖుడు తల్లితో అనెను.

## వరములు:

దశముఖుడు సోదరులతో గోకర్ణాశ్రమమునకు బోయెను. బ్రహ్మను గూర్చి ముగ్గురును గొప్పతపస్సు జేసిరి. వేయి సంవత్సరముల కొక

లవంతున ఖండించుకొని అగ్నిలో వేసి దశముఖుడు హోమము చేయసాగెను. ఇట్లు పదివేల సంవత్సరములకు పదియవతలను నరుకుకొనబోగా బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. "చావు లేకుండ వరమునిమ్ము" అనగా బ్రహ్మ, "పుట్టినవాడు చావక తప్పదు" అనెను. అట్లయిన "దేవా! దేవతలు, నాగులు, యక్షులు, గంధర్వులు, దైత్యులు, రాక్షసులు సుపర్ణులు చేత చావకుండ వరమిమ్ము, మనుష్యాదులు గడ్డిపరకల వంటి వారు. వారివలన నాకు భయము లేదు." అని దశముఖుడనెను. బ్రహ్మ అటులే వరమిచ్చి, మరియును అతడు కోసికొనిన తలలు మరల మొలచునట్లును, కోరుకొనిన రూపము వచ్చుటను గూడ అనుగ్రహించెను.

కుంభకర్ణుడు పంచాగ్ని మధ్యమందుండి పదివేల సంవత్సరములు తపమాచరించెను. ఈతడు వరములను బడయకముందే ఘోరకృత్యములు చేసినాడు; వరములీయరాదని మునులు బ్రహ్మను వేడుకొనిరి. సరస్వతి కుంభకర్ణుని నాలుక యందుండునట్లు జేసి, కుంభకర్ణునిచే 'నాకు నిద్రను ప్రసాదించుము' అని వారనిపించిరి. బ్రహ్మ అట్లే అగు గాక అనెను.

విభీషణుడు వేదపఠనము జేయుచు ఒంటి పాదముపై నిలిచి అయిదు వేల సంవత్సరములును, ఊర్ధ్వ బాహువై మరి అయిదు వేల వర్షములను తపస్సు జేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై వరము లు కోరుకొనుమనెను. "నే నెట్టి కష్టదశలో నున్నను ధర్మము విడువ కుండునట్లు అభ్యసింపకయే బ్రహ్మాస్త్రము నాయధీనమందుండునట్లు, ఉన్న ఆశ్రమ ధర్మము ననుచరించి మనస్సు నిశ్చలమైయుండునట్లు వరము ప్రసాదించుము" అని విభీషణుడు ప్రార్థించెను. అతడు కోరినట్లే ఇచ్చుటగాక, అతని ధర్మ దృష్టికి సంతసించి, విభీషణునికి స్థిరకాల జీవియైయుండు వరమును గూడ నొసగెను.

లంక రాక్షసుల పాలు :

మనుమలు ముగ్గురును బ్రహ్మను మెప్పించి వరముల బడసినందు లకు సంతసించి సుమాలి తన వద్ద మంత్రులగు ప్రహస్తుడు, మారీచుడు, విరూపాక్షుడను వారితో దశముఖుని వద్దకు వచ్చెను. అభినందించెను. "లంకాపట్టణము మనది. నీ వెట్టులైన కుబేరుని పారద్రోలుము. సమర్థుడవైన నీవు రాక్షసజాతి నుద్ధరించి రాక్షసరాజువు కమ్ము" అని బోధించెను. కాని అన్నయగు కుబేరునిపై దండెత్తుటకు దశముఖుడంగీకరించ లేదు. సమయము జూచి దశముఖునికి నచ్చచెప్పుటకై ప్రహస్తుని అతని కడనుంచి, తాతయగు సుమాలి రసాతలమునకు బోయెను.

కాలక్రమమున ప్రహస్తుని ప్రబోధము దశకంఠునకు వచ్చినది. లంక రాక్షసులది కనుక తన కిచ్చివేయుమని ప్రహస్తుని రాయబార మంపగా, "దశకంఠుడును నేనును సోదరులము. అభిభక్తముగ అతడును ఇచటనే ఉండవచ్చు"నని కుబేరుడనెను. కాని విశ్రవుడందుకు సమ్మతించక, "దశముఖుడువరగర్వితుడుగా నున్నాడు. దుర్మార్గుడగు వానితో పొత్తువలదు. విరోధమువలదు. కైలాసమున, మందాకినీ నదీతీరమున, గంధర్వ నాగకిన్నరలు నడయాడు రమ్యప్రదేశమున నుండుము. సుఖము కలుగును." అనెను.

తండ్రి తలపున కనువుగ కుబేరుడు కైలాసమునకుపోయి అలకాపురి యందుండెను. దశముఖుడు రాక్షసులతో వచ్చి లంకాధిపతియై రాజ్యమేలసాగెను.

వి వా హ ము లు :

దశముఖుడు చెల్లెలగు శూర్పణఖను కాలకేయవంశమువాడగు విద్యుజ్జిహ్వునకిచ్చి వివాహము జేసెను.

మయునకు హేమ అనునామెనిచ్చి దేవతలు పెండ్లిచేసిరి. హేమ అప్సరసాంగన. వీరికి మాయావి, దుందుభి అనుకుమారులును, మండోదరి యను కుమార్తెయు కలిగిరి. మయుని విడచి హేమ వెడలిపోయెను. ఒకనాడు వేటకు వెళ్ళిన దశముఖుడు మండోదరినిజూచి వివాహమాడ గోరెను. మయుడు సంతోషముతో దశముఖునకు మండోదరినిచ్చి పెండ్లిచేయుటేగాక, శక్తి అను గొప్ప ఆయుధమునుగూడ అల్లుని కిచ్చెను. కుంభకర్ణుడు వైరోచనుని కుమార్తె వ్రజజ్వాలను, విభీషణుడు శైలూషుడను గంధర్వరాజు దుహిత సరమను పెండ్లాడిరి. దశముఖునకు మండోదరి వలన ఒక కుమారుడు కలిగెను. మేఘనాదమువలె పుట్టినప్పుడేడ్చినందున మేఘనాదుడని వానికి పేరుపెట్టిరి. ఇతడే ఇంద్రజిత్తు అని ప్రసిద్ధిజెందెను.

అ ల కా పు రి :

కైలాసమున కేగిన వైశ్రవణుడు శివునిగూర్చి ఎనిమిది వందల సంవత్సరములు తపస్సుజేసెను. పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమైరి. పార్వతీదేవిని కుబేరుడు ఓరకంట చూచెను. దురుద్దేశ్యము లేకపోయినను పార్వతీదేవి ఆతడట్లు చూచుటకు కోపించి ఎడమకంటిని కాల్చివేసెను. కుబేరుడు పట్టువిడక ఇంకను తపమాచరించెను. శివుడు ప్రత్యక్షమై కుబేరుని తన మిత్రకోటిలో నంగీకరించి, కైలాసమున అలకాపురి యందుండ స్థానమొసగెను. నాటినుండి కుబేరుడు దిక్పాలకుడై, నవనిధులకధిపతియై, యక్షులను పాలించుచుండెను.

తమ్ముడగు దశముఖుడు చేయుచున్న దుండగముల గూర్చివిని ఆతని మేలుగోరి రాయబారివలన హితము నుపదేశింపగా కబురంపెను దశముఖుడు దూతను నఱికెను.

## యక్ష రాక్షస యుద్ధము :

మేలుచేయబోయిన కుబేరునకు కీడు ఎదురయ్యెను. తనంతి వానికి హితము చెప్పువాడా కుబేరుడు అను దురహంకారముతో దశముఖుడు ప్రహస్తుడు, మారీచుడు మున్నగు వారిని వెంటగొని అలకాపురముపై దండెత్తెను.

కుబేరుడు తన సేనాధిపతులగు సంయోధకంటకుడు, మణిభద్రుడు అనువారలను బంపెను. వీరోచితముగ పోరాడినను దశముఖుని యుద్ధమున తట్టుకొనలేక లొంగిపోయిరి. కుబేరుడు తనవాహనము నెక్కి స్వయముగ యుద్ధము జేయబోయెను. భీకరముగ పోరాటము జరిగెను. కాని కుబేరుడు ఓడిపోయెను. యక్షులు పారిపోయిరి. దశముఖుడు కుబేరుని వద్దగల పుష్పక విమానమును స్వాధీన పఱచుకొని విజయగర్వముతో లంకకు బోయెను.

## రావణుడు :

దశముఖుడు పుష్పకముపై ప్రయాణము జేయుచుండగా కుమారస్వామి జన్మస్థలమైన శరవణవనము నుండి విమానము కదలక నిలిచిపోయెను. కారణము తెలియక దశముఖుడు క్రిందికి చూచెను. 'పార్వతీ పరమేశ్వరులిట ఏకాంతమున నున్నారు. వెనుదిరిగి పొమ్మ'. అని అచట నున్న నందికేశ్వరుడనెను. దశముఖుడు వానివంక జూచి నవ్వి, "ఓహో కోతిముఖము వాడవు నీ వెవడవురా ?" అని హేళన జేసెను. నందికేశ్వరుడు క్రుద్ధుడై "నా వంటి కోతిముఖముగలవారు కోట్లకొలది జన్మించి నిన్నును నీ వంశమును నాశన మొనరింతురు గాక !" అని శపించెను.

కోపోద్దీపితుడైన దశముఖుడు తన విమానము ఆగిపోయిన కొండనే పెకలించిపార వేయ నడుముగట్టి, చేతులబట్టి పర్వతమును

ఊపి వేసెను. దానిపై గల దేవగంధర్వగణము కంపించిపోయెను. పార్వతీ దేవి భయముతో పరమేశ్వరుని కౌగిలించుకొనెను. శంకరుడు కాలిబొటన వ్రేలితో పర్వతము నదిమిపట్టెను. కొండక్రింద దూర్చిన దశముఖుని చేతులు నలిగి, బయటకు తీసికొనజాలక భయంకరముగ రావము జేసెను. అటుల నతడు బాధతో అరచుచు సామగానమున శివుని స్తోత్రము చేసెను. వేయిసంవత్సరములు గడచెను.

తృప్తి చెందిన పరమేశ్వరుడు ప్రత్యక్షమై దశముఖుని చేతులు కొండ క్రిందనుండి తీసికొన నవకాశమిచ్చెను. చంద్రహాసమను ఒక ఖడ్గమునిచ్చి 'దీనిని ఎప్పుడైనను అవమానపరచకుము. అట్లు జేసితివేని నాకడ్డకు వచ్చును.' అని ఈశ్వరుడు మరియునిట్లనెను. "ముల్లోకములు భయము నొందునట్లు రావము జేసితివి గాన నేటినుండి రావణుడు అను పేరు నీకు ప్రసిద్ధమగును."

## వేదవతి :

బృహస్పతి కుమారుడు కుశధ్వజుడు. వేదవతి కుశధ్వజుని కుమార్తె. మిక్కిలి అందమైనది. ఎందరడిగినను అంగీకరించక కుశధ్వజుడామెను శ్రీమన్నారాయణునికిచ్చి వివాహముచేయదలచెను శంభుడను దైత్యుడు ఈర్ష్యతో నిద్రలోనున్న కుశధ్వజుని తల నరికివేసెను. భార్య సహగమనము చేసెను.

వేదవతి శ్రీమన్నారాయణునిగూర్చి తపస్సు చేయసాగెను. ఒకనాడామెను రావణుడు చూచి మోహించెను. తన కోర్కెను తెలిపెను. శ్రీమన్నారాయణునిదప్ప అన్యుని పెండ్లాడనని ఆమె చెప్పెను. రావణుడు నారాయణుని దూషించుచు వేదవతి జుట్టుపట్టుకొనిలాగెను. ఆమె జుట్టును చేతితోనే ఖండించుకొని "దుష్టుడా! నేను అయోనిజనై మరొక జన్మమునెత్తి నీపాలిటి మృత్యువునగుదును." అని అగ్నియందు దుమికెను.

"ఆ వేదవతియే సీతయై పుట్టినది; నీవు నారాయణుడవు!" అని అగస్త్యుడు రామునితో చెప్పి తరువాతి కథను మరల చెప్పదొడగెను.

జయాపజయములు - శాపములు :

రావణుడు జైత్రయాత్ర చేయ ప్రారంభించెను.

మరుత్తుడు :

మరుత్తుడను రాజు ఉశీరబీజమనుచోట యజ్ఞము చేయుచుండెను, బృహస్పతిసోదరుడు సంవర్తుడు యజ్ఞము చేయించుచుండెను. ఆహూతులగు దేవతలెల్లరువచ్చిరి. రావణుడు యజ్ఞము చేయుచున్న చోటికి వెళ్ళెను. రావణుని చూచి దేవతలెల్ల పారిపోయిరి. ఇంద్రుడు నెమలి గాను, యముడు కాకిగాను, కుబేరుడు తొండగాను, వరుణుడు హంసగాను మారిపోయిరి. మరుత్తుడు రావణునితో యుద్ధము చేయ నుంకించెను. "యజ్ఞదీక్షలో నున్నవారు కోపమును విడువవలెను. యుద్ధము చేయరాదు. యజ్ఞము విఘ్నమైన యజ్ఞకర్త వంశము నశించును." అని పురోహితుడు చెప్పెను. మరుత్తుడు శాంతించెను. రావణుడు "నేనే గెలిచితి" ననుచు బోయెను. ప్రాణములు దక్కించుకొనుటకేయే రూపము లెత్తిరో ఆయా దేవతలు ఆయా పక్షులకు వరముల నొసగిరి.

అనరణ్యుడు :

రావణుడనేక మంది భూపాలకులపై దండెత్తగా దుష్యంతుడు సురథుడు గాధి గయుడు మున్నగు వారు లొంగిపోయిరి. అయోధ్యను పాలించు అనరణ్యుడను ఇక్ష్వాకు రాజు ఎదిర్చి యుద్ధము చేసెను. కాని రావణుని దెబ్బకు నేలబడెను. రావణుడు వానిని జూచి నవ్వెను. అందుకు అనరణ్యుడు కినిసి, "నీచుడా! నా ఇక్ష్వాకు వంశమున జనించు దశరథరాముడు నిన్ను వధించగలడు." అని ప్రాణములు వదలెను.

యముడు :

నారదుడు చెప్పిన మాటలు విని ముల్లోకములును గడగడలాడు యమునిపై రావణుడు యుద్ధమునకు బోయెను. యమలోకము నందు, పాపములు చేసినవారు నరకమున బాధలనుభవించుటయు, పుణ్యము చేసినవారు సుఖము లనుభవించుటయు రావణుడు చూచెను. యమ కింకరులపై రావణుడు బడెను. కింకరులు ఘోరముగ పోరాడిరి. యముడు స్వయముగ యుద్ధమునకు వచ్చెను. రావణునిపై పాశమును ప్రయోగింపనుద్యుక్తుడయ్యెను. "కాల పాశము నేనిచ్చినదే - తిరుగు లేనిది. రావణుడు చావకుండ నేనే వరమిచ్చితిని. కాన కాలపాశమును ప్రయోగింపవలదు." అని బ్రహ్మ చెప్పగా, యముడు పాశమును ప్రయోగింపక అదృశ్యుడయ్యెను. "నేనేగెలిచితిని" అని చాటుచు రావణుడు వెడలిపోయెను.

నివాతకవచులు :

రావణుడు రసాతలమునకుబోయెను. వాసుకిచే పాలింపబడు భోగవతీపురమును వశపఱచుకొని మణిపురమునకు బోయెను. దానవు లగు నివాతకవచులు మణిపురము నేలుచుండిరి. వారితో రావణుడు యుద్ధముచేసెను. వారును అనేక వరములను పొందినవారగుటచే ఎవరి కిని జయము కలుగలేదు. బ్రహ్మవచ్చి నివాతకవచులకును, రావణున కును స్నేహ మొనర్చి వెళ్ళెను. రావణుడట ఒక సంవత్సరముండి వారి వద్ద తొంబది తొమ్మిది మాయోపాయములు నేర్చుకొనెను.

విద్యుజ్జిహ్వుడు :

విద్యుజ్జిహ్వుడు శూర్పణఖభర్త. ఎట్టి వారినైనను నాలుకతో చీకి చంపగలడు. చాలమంది రాక్షసులను చంపెను. అందుచే సోదరి భర్త అనియైనను వెనుకాడక రావణుడు విద్యుజ్జిహ్వుని చంపెను.

కాలకేయులు :

అశ్మనగరమును పాలించు కాలకేయులను జయించెను.

వరుణుడు :

పాతాళలోకమున వరుణునిపై రావణుడు దండయాత్ర చేసెను. వరుణుడాసమయమున సంగీతము వినుటకై బ్రహ్మవద్దకు పోయెను. అతడు లేనందున వరుణుని కుమారులు, మనుమలు, సేనానాయకులు రావణునితో యుద్ధముచేసి ఓడిపోయిరి. "వరుణుడు పారిపోయెను; నేనే జయించితి"నని రావణుడు చాటుకొనెను.

కన్యల శాపము :

రావణుని జైత్రయాత్రయందు అనేకమంది చక్కని స్త్రీలను చూచుట సంభవించెను. వారినందఱపట్టి తన వెంట నుంచుకొనెను. అందు దేవకన్యలు, రాజపుత్రికలు, దానవ కన్యలుగూడ నుండిరి. అవివాహితలు, వివాహితలుగూడ కలరు. బలాత్కారమున కొనితేబడిన ఆ అంగనామణులు "పరస్త్రీలను చెరబట్టుచున్న నీకు పరస్త్రీ వలననే చావుమూడును" అని శపించిరి.

శూర్పణఖ :

తన భర్తను చంపిన విషయము తెలిసికొని శూర్పణఖ లంకకువచ్చి రావణుని తిట్టిపోసెను. రావణుడు సోదరి నోదార్చి, "నీభర్త యుద్ధమున చచ్చినాడు. దుఃఖింపకుము. శుక్రుని శాపము వలన దండకారణ్యము రాక్షసుల నివాసభూమి అయినది. మన పినతల్లి కుమారుడగు ఖరుడు రాజుగను, దూషణుడు సేనానిగను అచట నుందురు. నీవును అచట యథేచ్ఛగా నుండుము." అని పంపివేసెను.

మేఘనాదుడు :

రావణుడు నికుంభిలా వనమునకు పోయెను. తన కుమారుడట సప్తయజ్ఞములు చేసెననియు, దానివలన ఆకసమున నడచు రథము, తామసి అను మాయను, అక్షయ తూణీరమును, గొప్పవిల్లును సంపాదించెనని శుక్రాచార్యుని వలన తెలిసికొనెను. తనకు విరోధిఅయిన ఇంద్రుని, ఇతర దేవతలను పూజించినందులకు కుమారుని మందలించి మేఘనాదుని, విభీషణుని వెంటతీసుకొని వెళ్ళెను.

మధువు :

మాల్యవంతుని కుమార్తె పుష్పోత్కట. ఆమెకు కుంభీనసి అను కుమార్తె కలదు. రావణుడు జైత్రయాత్రలలో ఉండుటను, మేఘనాదుడు యజ్ఞదీక్షలో నుండుటను, కుంభకర్ణుడు నిద్రలో నుండుటను, విభీషణుడు తపము ఆచరించుచుండుటను గమనించి మధువను వాడు వచ్చి కుంభీనసి నెత్తుకొని పోయెను.

ఈ విషయమును విభీషణుని వలన రావణుడు తెలిసికొని మండిపడుచు మధువుపై దండెత్తెను. సోదరులు, కుమారుడు, సైన్యము వెంట నడచెను. మధుపురము సమీపమునకు పోగానే కుంభీనసి వచ్చి అన్నయగు రావణుని కాళ్ళమీదబడి తన భర్తయగు మధువును చంపవలదని వేడుకొనెను. రావణుడు మన్నించెను. కాని తనతోపాటు దేవతలపై మధువుకూడ దండెత్తవలయునని చెప్పెను. అందులకు కుంభీనసి అంగీకరించి రావణునితోబాటు మధువును బంపెను. అందరును కలసి కుబేరుని అలకాపుర సమీపమునకు కైలాసమునకు చేరిరి.

రంభ :

పండువెన్నెల, చల్లనిగాలి, పుష్పముల సువాసన, ఆకర్షణీయమగు ప్రకృతి సౌందర్యము వెల్లివిరియుచుండెను. అట్టితఱి శోభాయమానముగ అలంకరణము చేసికొని, ఒయ్యారపు నడకలతో రంభ

రావణుని కంటబడెను. రావణుడు హుటాహుటిపోయి రంభ చేయి పట్టుకొని తన మన్మథతాపమునుగూర్చి చెప్పెను. రంభ బెదరిపోయి చేయి వదలించుకొన యత్నించెను. 'ఓ సుందరాంగీ ! నేను లంకాధిపతిని. రావణుడను. నాకు సాటివచ్చు వీరుడీముల్లోకములయందును లేడు. రమ్ము సుఖింతము' అనెను.

కుబేరుని కుమారుడు నలకూబరుడు. నలకూబరుని అర్థాంగి రంభ. దేవేంద్రుని సభామందిరమున నాట్యము చేయుచుండును. యజ్ఞయాగాదుల నొనర్చిన పుణ్యులకు స్వర్గమున సుఖముల నిచ్చును. రంభ రావణునితో, 'నీవు నాకు మామ వగుదువు నీకు నేను కోడలను, అజ్ఞానులవలె నీవు నన్నిట్లు కోరతగునా ?' అనెను.

రంభ మాటలకు రావణుడు పక పక నవ్వి, "అచ్చర మచ్చెకంటీ ! వావి వరుస లెన్నుచుంటివా ?

సీ. జనకుండు సుతుడును - జన్మంబు సేసిన
వనిత ! వారేమి కా-వలయు నీకు ?
అన్నదమ్ములు సోమ - యాజులై వెలసిన
వనిత ! వారేమి కా-వలయు నీకు ?
బావయు, మరదియు - బవరాన గూలిన
వనిత ! వారేమి కా - వలయు నీకు ?
అల్లుడు, మామయు - నని[ద్రె]ళ్ళి వచ్చిన
వనిత ! వారేమి కా - వలయు నీకు ?

తే. గీ. వావి వరుసలు గణియింప - వచ్చితేని
వనిత ! మాతోడ మాటాడ - వశమె నీకు
చాలు నికనేల ? రమ్మని - కేలుపట్టి
బాల గొనిపోయి చెంగల్వ-పాన్పుజేరి"

(కంకంటివారి ఉత్తర రామాయణము నుండి)

కొంతవడికి రావణుడు రంభను వదలెను. ఆమె మిక్కిలి సొక్కి పోయెను. ఆమె ఏడ్చుచు నలకూబరుని వద్దకుపోయి జరిగినది విన్న వించెను. నలకూబరుడు రోషకషాయితలోచనుడై "బలాత్కారముగ పరాంగనను గలిసినయెడల రావణుని తల వేయి వ్రక్కలగును" అని శపించెను.

దేవేంద్రుడు :

కైలాసమునుండి రావణుడు దేవలోకమునకు పోయెను. ఇంద్రుడు భయపడి విష్ణుమూర్తి వద్దకేగి రావణుని బారినుండి రక్షింపు మని మొఱబెట్టుకొనెను. "రావణునకు బ్రహ్మ వరము కలదు. వాడు దేవతల వలన చావడు. వాని పాపము పండపలెను. సమయముచూచి నేను వానిని, వాని వంశమును సంహరింపగలను. నీవిపుడు భయపడక వానితో యుద్ధము చేయుము." అని శ్రీమన్నారాయణుడు దేవేం ద్రునితో చెప్పి పంపెను.

దేవతలకును, రాక్షసులకును గొప్పయుద్ధము జరిగెను. అందు అష్టవసువులలో నొకడగు సావిత్రుడు సుమాలి నెదుర్కొని చంపి వేసెను. రాక్షసులు పరుగులెత్తసాగిరి. మేఘనాదుడు రాక్షసులకు ధైర్యముజెప్పి మరల యుద్ధమునకు తలపడెను. దేవేంద్రుని కుమారు డగు జయంతుడును రావణుని కుమారుడు మేఘనాదుడును ఘోరసం గ్రామ మొనర్చిరి. మేఘనాదుడెన్నియో కపటోపాయముల యుద్ధము చేసెను, అదృశ్యుడయ్యెను. అంధకారము కప్పెను. బాణవర్షము కురిపించెను. దేవతలు దిక్కుదోచక పారిపోవుచుండిరి. జయంతుని తాత (శచీదేవి తండ్రి) యగు పులోముడు జయంతుని తీసికొని పోయి సముద్రమునందు దాచెను.

ఇంద్రుడు స్వయముగ రణరంగమునకు వచ్చెను. రావణుడెదు ర్కొని యుద్ధము చేసెను. ఇరువక్షముల యందును రక్తము నదుల వలె ప్రవహించెను. కుంభకర్ణుడు దేవతల నెందరినో పట్టి నోట వేసికొని మ్రింగెను. మేఘనాదుడు శరపరంపరల గురిపించెను. స్వర్గాధిపతి అదృశ్యుడయి ఎచటనుండెనో కనుగొనవీలు లేక పోయెను. వసు, రుద్ర, ఆదిత్యుల సహాయముతో ఇంద్రుడు రావణుని ముట్టడించి పట్టుకొని స్వర్గమునకు తీసికొని పోయెను.

మేఘనాదుడిది విని విజృంభించెను. అదృశ్యుడై వచ్చి ఇంద్రుని బంధించి తండ్రిని విడిపించెను. తండ్రి, కుమారులు ఇంద్రునితో లంకా నగరము చేరిరి.

దేవతలందరును భయభ్రాంతులై బ్రహ్మ వద్దకుపోయి జరిగిన సంగతి యంతయు చెప్పి మొఱబెట్టుకొనగా బ్రహ్మలంకకు పోయెను. ఆసమయమున రావణుడు కొలువు దీరి యుండెను. ఆకసము నుండియే బ్రహ్మ ఇట్లనెను. "లంకాధినాథా! నీ కంటె నీ పుత్రుడు బలపరా క్రమముల మేటియని తెలియుచున్నది. నీ కుమారుడిక 'ఇంద్రజిత్తు' అని ప్రసిద్ధినొందును. నీవు ఇంద్రుని విడచివేయుము. దేవతలు నీకు వరములనిత్తురు".

ఇది విని ఇంద్రజిత్తు "నాకు అమరత్వము ప్రసాదింపు"మనెను. "భూమిపై పుట్టినది, గిట్టుట తప్పదు." అని బ్రహ్మనుడివెను. అట్లయిన "దేవా! నేను యుద్ధమునకు బోవునపుడు శాస్త్రోక్తముగ హోమము చేయుదును. అది సక్రమముగ నెరవేరినయెడల అగ్నిహోత్రుడు రథము సిద్ధముగా నుంచునటుల, ఆరథము నెక్కి యుద్ధమొనర్చిన నేను మరణింపకుండునటులను వరమిమ్ము" అని ఇంద్రజిత్తుకోరగా బ్రహ్మ అట్లే వరము ప్రసాదించెను. ఇంద్రుని ఇంద్రజిత్తువదలిపెట్టెను.

## ఇంద్రుడు - వైష్ణవ యాగము :

మేఘనాదునివలన తనకుజరిగిన అవమానమునుగూర్చి సురరాజు చింతించుచుండెను. అదిగాంచి బ్రహ్మ ఇట్లనెను. "మహేంద్రా! పూర్వము నేనొక అపరూప సౌందర్యవతిని సృష్టించితిని. అనాకార మేమియు లేనిదగుటచే నేనామెకు 'అహల్య'అని పేరుబెట్టితిని. అంతటి సౌందర్యరాశిని స్వర్గాధిపతివగు నీకిచ్చి పెండ్లిచేయదలచితిని. కాని కొంతకాలమామెను గౌతమమహర్షి ఆశ్రమముననుంచితిని. అతడు ఇంద్రియ నిగ్రహముతో నుండెను. నేనందుకు సంతసించి అహల్యను గౌతమునకేయిచ్చి వివాహమొనరించితిని. వారు సుఖముగ నుండిరి. ఒకనాడు నీవు కామము పట్టజాలక గౌతమాశ్రమమునకుబోయి అహల్యను చూచితివి. ఆమె అగ్నిజ్వాలవలె కన్పించెను. ఆమె నిన్నంగీకరింపకున్నను బలాత్కరించితివి. ఇది తెలుసుకొనిన గౌతముడు, "నాభార్యయగు అహల్యను బలాత్కరించితివి. కనుక యుద్ధరంగమున శత్రువు చేజిక్కెదవు. అధర్మాచరణుడవైతివిగనుక నీకును నీతరువాత వారికిని ఇంద్రాధిపత్యము శాశ్వతము కాకుండును." అని నిన్ను కఠినముగ శపించెను. "సౌందర్యవతినను గర్వముతో అకార్యము చేసి [illegible] నీవు శిలవలె ఈ ఆశ్రమమున ఆహారపానీయములు లేక పడియుండుము." అని భార్యను శపించెను. భర్త మాటలకు భీతిల్లిన అహల్య దుఃఖముతో 'నాథా! నా దోషము ఏమాత్రమును లేదు. నేను నిర్దోషి' ననెను. గౌతముడామెతో, "ఇక్ష్వాకువంశమున దశరథ రాముడు జన్మించును. ఆ మహాత్ముని దర్శనము వలన నీకు శాపవిముక్తి కలుగును. అతనికి అతిథి సత్కారములు చేయుము. తిరిగి నా వద్దకు చేరగలవు." అని చెప్పి వెడలిపోయెను.

ఆ శాపకారణముచే నీ విపుడీ పరాభవము నొందవలసి వచ్చినది. నీవు వైష్ణవయాగము చేసిన యెడల నీ స్వర్గాధిపత్యమున కర్హుడవగు

ము.' కమలాసనునకు చెప్పినరీతిగా వైష్ణవయాగమును చేసి ఇంద్రుడు మరల సురలోక నాయకుడయ్యెను.

రావణుని గూర్చి అగస్త్యుడు చెప్పిన వివరము లన్నియు దశరథ రాముడు సావధానచిత్తముతో వినెను. రాముని మనసున దోచిన అనుమానమును ఇట్లు వెలువరించెను. "మునీంద్రా! ఆకాలమున రావణుని ఎదుర్కొనగల పరాక్రమ శాలుర ఈ లోకమున ఎవరును లేకపోయిరా? లేక వానిముందు నిస్తేజులైనారా?" అనెను.

అగస్త్యుడు మరల ఇట్లు చెప్ప దొడగెను.

కార్తవీర్యార్జునుడు :

కార్తవీర్యార్జునుడను మహారాజు ఆకాలమున మాహిష్మతీ నగరము నేలుచుండెను. ఒకపరి రావణుడు మాహిష్మతిపై దండెత్తెను. కార్తవీర్యుడపుడు నగరమున లేడు. ఈ సంగతి నెఱిగిన రావణుడు సమీపమునగల వింధ్యపర్వతము వద్దకు పోయెను. అచట నర్మదానది యందు ప్రవహించు నిర్మలోదకమును జూచెను. స్నానమాడవలయునను కోరికగలిగెను. తనివి దీర ఆ నదియందు జలకమాడెను. ఎల్లప్పుడును వెంటనుండు బంగరు శివలింగము నా నదీ తీరమున నుంచి యథావిధిగ పూజచేసెను. ఇంతలో క్రమక్రమముగ నది యందలి నీరు పొంగి తీరమునకు వచ్చి ఆ వెల్లువకు రావణుడు పూజసల్పు పుష్పములు, అక్షతలు మున్నగునవి కొట్టుకొనిపోయెను. అంతటితో ఆగక ఇంకను ఆవరద హెచ్చుచుండెను. అందుకు గల కారణమేమో తెలిసికొనిరండని శుకసారణులను బంపెను. వారాకాశ మార్గమున బోయిరి.

కార్తవీర్యార్జునుడు ఆనదియందే స్త్రీలతో జలక్రీడలాడుచుండెను. అతడు తన వెయ్యి చేతులను నదీ ప్రవాహమునకు అడ్డుగా పెట్టెను. నీరునరికట్టి అతడానందించు చుండెను.

ఇదిచూచిపోయి శుకసారణులు రావణునకు విన్నవించిరి. రావణుడు కార్తవీర్యుడున్న తావునకు బోయెను. యుద్ధమునకు రమ్మని అతని మంత్రుల బిలిచి చెప్పుడనెను. ఎట్టిసమయమున యుద్ధము చేయవలెనో ఎఱుగని అజ్ఞానుడవుగ నెనున్నావు. రేపు మా ప్రభువుతో యుద్ధము చేయుదువు గాక ముందు మమ్ము గెలువు మని మంత్రులనిరి. యుద్ధము నందు రావణుని మంత్రులు అర్జునుని మంత్రులను చంపిరి. ఈ విషయము కార్తవీర్యుడు తెలుసుకొని రావణునిపై యుద్ధమునకు వచ్చెను. ఇరువురును భయంకరముగ పోరాడిరి. అందు కార్తవీర్యార్జునుడు కొట్టిన దెబ్బకు రావణుడు పడిపోగా వానిని బంధించి మాహిష్మతికి అర్జునుడు గొంపోయెను.

ఈ సంగతి వినినంతనే పులస్త్యుడు మాహిష్మతికి వచ్చెను. ఆ మహర్షి తనకడకు వచ్చుట కెంతయో ఆనందించి అర్జునుడు పులస్త్యునకు అర్ఘ్యపాద్యాది గౌరవ సత్కారముల నొసగి "మునీంద్రా! మీ రాకవలన నాజన్మ ధన్యమైనది. మీయాజ్ఞ నెరవేర్ప సిద్ధముగా నున్నాను. ఏమి సెలవు?" అనెను.

"మహావీరా! నామనుమడగు రావణుని గెలిచి కీర్తి ప్రతిష్ఠల నార్జించినావు. వానిని మన్నించి విడువుమని నిన్ను దోసిలొగ్గి అర్థించుచున్నాను.' అని పులస్త్యుడనెను. కార్తవీర్యుడు వెంటనే రావణుని బంధ విముక్తుని జేయుటేగాక అతనికి రత్నాభరణముల నొసగి సత్కరించియు, స్నేహము జేసికొనియు గౌరవించెను. పులస్త్యుడు సంతసించి వెడలిపోయెను.

రావణుడు సిగ్గుతో లంకానగరమునకు బోయెను.

వాలి :

కిష్కింధ నేలు వానరరాజు వాలి. అతడు మహాబలశాలి. ప్రతిదినమును నాలుగు సముద్రముల కడకుబోయి సంధ్యవార్చి వచ్చు

చుండును. అట్టి వానిని గెలువ వలయుననుకొని ఒకనాడు రావణుడు కిష్కింధకు వచ్చెను. అప్పటికే వాలి దక్షిణ సముద్రమునకు వెళ్ళియుండెను. యుద్ధము చేయవచ్చితినని చెప్పగా వాలి మంత్రులు ఇట్లనిరి. 'రాజా! మేము నీతో యుద్ధము చేయజాలము. వాలిని నీవు గెలువజాలవు. వృథా ప్రయాసపడక తిరిగిపొమ్ము. లేదా దక్షిణ సముద్ర తీరమునకు బొమ్ము. వాలిని చూడగలవు."

రావణుడు దక్షిణ సముద్ర తీరమునకుబోయి సంధ్యోపాసన చేయుచున్న వాలిని చూచి, వెనుకనుండి పట్టుకొననెంచి, చప్పుడు గాకుండబోయి, వాలిచంకలక్రింద చేతులనుదూర్చి పట్టెను. రావణుడిట్లు మోసమున వచ్చుచుండుటను గమనించి వాలి, అతడు చేతులు దూర్చిన వెంటనే చంకలను అదిమిపట్టెను. రావణుడెంత ప్రయత్నించినను చేతులను బయటకు తీసికొనలేకపోయెను. వాలి అట్లే ఆకసమునకెగిరి మిగిలిన మూడు సముద్రములకుబోయి తనతోబాటు రావణుని గూడ సముద్రజలమునముంచి తుదకు కిష్కింధకుజేరి చంకల నెత్తెను. రావణుడు క్రిందపడి సిగ్గుతో తలవంచుకొనెను.

రావణుడు మనసు పదిలపఱచుకొని వానరరాజా! నేను లంకాధిపతినగు రావణుడను. నిన్ను జయించవలెనను దురహంకారముతో వచ్చినాను- అందుకు ప్రతిఫలముగా పరాభవమును పొందినాను. నీ బలపరాక్రమములు, వేగము, తేజస్సు నన్ను చకితునిగావించినవి. నేను నీతో సఖ్యముతో నుండగోరుచున్నాను" అనెను.

రావణుడును వాలియు అగ్నిసాక్షిగా సఖ్యమొనరించుకొనిరి. పిమ్మట రావణుడు లంకకు వెళ్లెను.

అని రావణుని పరాభవమునుగూర్చి చెప్పిన అగస్త్యమహర్షి "రామభద్రా! అట్టిమహాబలశాలి యగు వాలి అగ్నిసిబడిన మిడుతవలె నీవుకొట్టిన ఒక్కబాణమున కాహుతియై ప్రాణములు విడచెను" అనెను.

అందులకు రాముడు, "మునీంద్రా! రావణుడు, వాలి ఇరువురు మహాబల సంపన్నులగుట నిశ్చయము. కాని వారికంటె హనుమంతుడు అధిక బలుడనుకొనుచున్నాను, కనుక హనుమంతుని వృత్తాంతము కూడ తెలియజేయుడు." అని వేడెను.

అగస్త్యమహర్షి హనుమంతుని కథ ఇట్లు వివరించెను.

హ ను మ ం తు డు:

పూర్వము కేసరియను వానరరాజు మేరుపర్వతముపై నుండెడి వాడు. అతనిభార్య అంజన. వాయుదేవుని అనుగ్రహమున అంజన ఒక కుమారుని కనెను. అంజన పండ్లకొరకై అడవిలోనికి బోయెను ఆకలితో ఏడ్చుచున్న శిశువునకు ఉదయించుచున్న సూర్యుడు కన్పించెను. ఎఱ్ఱగానుండు బాలభానుడు పండనుకొని ఆంజనేయుడు ఆకసమునకెగిరి సూర్యుని పట్టుకొనబోయెను. గ్రహణసమయమగుటచే రాహువు సూర్యుని మ్రింగవచ్చెను. హనుమంతుని ఆర్భాటమును జూచి రాహువు బెదరి ఇంద్రుని వద్దకుబోయి జరిగిన సంగతి చెప్పెను. ఇంద్రుడు ఐరావతమునెక్కి వచ్చెను. హనుమంతుడు రాహువు ఒకపండనుకొని పై కురికెను, రాహువు పారిపోయెను. ఇంతలో ఇంద్రుడు రాగా తెల్లగ నుండు ఐరావతమునుచూచి ఇది తెల్లనిపండు అనుకొని దానిపైకి దుమికెను. ఇది సహించజాలని మహేంద్రుడు వజ్రాయుధముతో ఆంజనేయుని కొట్టెను. ఆదెబ్బ ఆంజనేయుని ఎడమదవడకు తగిలెను. అతడు పడిపోయెను. వాయుదేవుడందులకు కోపించి కుమారుని దీసికొనిపోయి ఒక గుహయందు పెట్టుకొనియుండెను. లోకములో గాలిలేక ప్రాణికోటి అంతయు తబ్బిబ్బుపడెను. అగ్ని ప్రజ్వరిల్లదయ్యెను.

దేవతలు, మానవులు బ్రహ్మకడకుపోయి వాయువు లేకపోయినందున కలిగిన ఆపదను విన్నవించిరి. బ్రహ్మదేవుడు గుహవద్దకు వచ్చి ఆంజనేయుని నిమిరెను. వాయునందనుడు సుఖముగ లేచెను. వాయు

దేవుడు బ్రహ్మకు నమస్కరించెను. సంతసమున వాయుదేవుడు లేవగా లోకములో గాలివీవదొడగెను. ప్రాణికోటికి ఊపిరిసల్పెను.

ముందు ముందు ఈ బాలకుడు ఎన్నియో కార్యక్రమములు నిర్వర్తింపవలసి యున్నాడు. కావున ఇతనికి మీరెల్లరు వరముల నిండని బ్రహ్మ అనగా అనేకవరము లాంజనేయునకిడిరి. "నేటి నుండి ఇతడు హనుమంతుడని ప్రసిద్ధిజెందుగాక! (హనుమ అనగా దవడ. దవడపై దెబ్బ తగిలినందున హనుమంతుడు) నావజ్రాయుధము వలన ఇతనికి మరణము కలుగదు" అని దేవేంద్రుడనెను.

సూర్యుడు. "నాలోని నూరవ వంతు తేజస్సు ఈ బాలునకు ఇచ్చుచున్నాను. మరియు సమస్త శాస్త్రములను బోధింతును."అనెను. యముడు, కాలపాశమువలన ఇతనికి మరణము కలుగదు. ఎట్టి వ్యాధులును ఇతనిని బాధించవు." అనెను. శివుడు, 'నా ఆయుధముల వలన ఇతనికి మరణము కలుగదు" అనెను. ఇట్లే కుబేరుడు, విశ్వకర్మ, వరుణుడు మున్నగు వారును తమవలన ఎట్టి ప్రమాదము లేకుండునట్లు వరములిచ్చిరి. బ్రహ్మ, "ఈ బాలకుడు శత్రుభయంకరుడగును. మిత్రులకు క్షేమంకరుడగును. యుద్ధముల జయమును పొందును. కామరూపియు, ఆకాశగమనము కలవాడగును. మున్ముందు రామునకు ప్రియమగు పనులుచేయును రావణుడునశించుటకు తోడ్పడును"అనెను.

దేవతలెల్లరును తమతమ నివాసములకు బోయిరి.

వాయుదేవుడు హనుమంతుని అంజనకు అప్పగించి పోయెను. హనుమంతుడు పెద్దవాడయి వరగర్వమున మంచిచెడ్డల తారతమ్యమును గుర్తెఱుగక ప్రవర్తించెను. మహర్షులను బాధించెను. వారి తపస్సునకు అంతరాయములు కల్పించుచుండెను. తలిదండ్రులు చెప్పినను మారుతి వినలేదు. ఈ బాధలు పడలేక కొందరుమునులు, "నీ బలమును నీవు గుర్తింపకుందువు గాక! నీకు యశస్సు కలుగు సమయ

మున ఇతరులవలన గుర్తుచేయుబడినపుడు నీ బలము తెలుసుకొందువు గాక," అనియు శపించిరి. అంతట హనుమంతుడు సక్రమ విధానమున ప్రవర్తింపసాగెను.

కిష్కింధకు ఋక్షరజసుడు అను వానర శ్రేష్ఠుడు రాజుగా నుండెను. అతని మరణానంతరము అతని జ్యేష్ఠ కుమారుడు వాలి రాజయ్యెను. సుగ్రీవుడు యువరాజయ్యెను. తల్లి ఆనతిచ్చుటచే హనుమంతుడు సుగ్రీవునికడకు జేరి సఖ్యముతో మెలగుచుండెను.

"ఋష్యమూక పర్వతమువద్దకు నీవు వెళ్ళినపుడు హనుమంతుడు నీవద్దకు వచ్చినప్పటినుండియు హనుమంతుని కథ నీకు తెలియనిదేమి యున్నది? రామా! హనుమంతుడేగాక సుగ్రీవుడు, అంగదుడు, నలుడు, నీలుడు మున్నగు వానరులందరును నీకొరకయి జన్మించి యుండిరి." అని అగస్త్య మునీంద్రుడు చెప్పెను.

వీడ్కోలు :

రాముడును, రామానుజులును, మిగిలిన సభాసదులును అగస్త్యుడు చెప్పిన మాటలను, వృత్తాంతములను విని ఆనందించిరి. ఇందఱు మహర్షులు వచ్చినందులకు రాముడును సంతసించి మహర్షులను యథావిధిగ పూజించి, సత్కరించి పంపెను.

తరువాత కొలది దినములకు మామయగు జనక మహారాజును, మేనమామ అగు యుధాజిత్తును గౌరవించి రాముడు పంపించెను.

సుగ్రీవుడు, విభీషణుడు మున్నగు హితులును వెళ్ళిపోయిరి హనుమంతుడు రాముని పాదములపైబడి, ప్రభువరా! నీ యెడల నే నెల్లప్పుడును భక్తితో నుండునట్లును, ఈ భూమిపై ప్రజలు నిన్ను గీర్తించునంతకాలము నన్నును కీర్తించు చుండునట్లును అనుగ్రహింపుము.'' అని వేడుకొనెను. రాముడు హనుమంతుని లేవదీసి కౌగిట

జేర్చి, 'ఆంజనేయా! నాకథ చిరస్థాయిగ నుండినట్లే నీకథయునుండును' నీవును చిరంజీవివై యుందువుగాక' అనెను. మరియు రాముడు హను మంతుని మెడలో తన మెడయందలి చంద్రహారమును వేసెను.

ఎల్లరును సంతోషవారాశి దేలి యాడిరి.

తన వద్దకు వచ్చిన పుష్పకముతో కుబేరుడిట్లనెను. 'రావణుని రాముడు జయించెను. అందుచే నీవు రామునకే చెందుదువు పొమ్ము.' రామునివద్దకు పుష్పకము తిరిగి వచ్చినది. రాముడు దానిని పూజించి, 'యథేచ్ఛగా సంచరించుము. నేను తలచుకొనినపుడు నావద్దకు రమ్ము' అనగా పుష్పకము వెడలిపోయెను.

గర్భవతి :

పదివేల సంవత్సరములు సీతారాములు సుఖసంతోషముల కాలము గడపిరి. శ్రీరాము డేక పత్నీవ్రతుడు. సీత మహాపతివ్రత. వారి దాంపత్యమునకు మరిసాటిలేదు.

నందనోద్యానమును మించిన ఉద్యానమున సుమసౌరభము నలు దెసల ఘుమఘుమలాడుచుండెను. వివిధవర్ణముల పుష్పములు భ్రమర ములనేగాక మనస్సులనుగూడ ఆకర్షించుచుండెను. చల్లని గాలితెమ్మె రలు అల్లనల్లన వీవదొడగెను. ఫలభరితములైన వృక్షములు నమ్రతను సూచించుచుండెను.

లతానికుంజముచెంత, మల్లికాకుసుమముల పొంత, తిలతండుల న్యాయమున వృక్షచ్ఛాయ లెంతయో ఆనందము సంతరింప, చంద్ర కాంత శిలాఫలకముపై సీతారాములు ఆసీనులైయుండిరి. గర్భవతిగా నున్న జానకిని ముద్దుముచ్చటల దేలించుచు, మధువును మధురఫలము లను నామెచే దినిపించుచు, ఆమెవలుకువింతలను వినోదములను రాము డాలకించుచు, ఆనందతరంగ డోలికలనోలలాడుచుండిరి.

"సీతా! గర్భవతులకు కోర్కెలు మెండుగదా! నీకేమేని కోరికయున్న తెలియజేయుము. అవశ్యము తీర్చెదను." అని జానకిని రాముడు లాలించెను.

'ప్రాణప్రియా! మీ అర్ధాంగినై యున్న నాకు ఏకోరికలుండును? .... అయినను ఒక చిన్నకోరిక గలదు.

శ్లో॥ తపోవనాని పుణ్యాని ద్రష్టు మిచ్ఛామి రాఘవ
స్మితం కృత్వాతు వైదేహీ రామం వాక్యమథాఽబ్రవీత్.

మన మెన్నడో వనవాసము జేసితిమి. అప్పటి జీవితము, మహామునుల ఆశ్రమముల మునిపత్నీ సందర్శనము, చెంగుచెంగున గంతులువేయు లేళ్ళు, దుప్పులు, చరచరనడయాడు కుందేళ్ళు, చిత్రచిత్రముగ నుండు రంగులలో కిలకిలారావములుచేయు పక్షులు నామనస్సునన్ మెదలుచు ఒక్కనాడు మరల ఆజీవితము పుణ్యభాగీరథీనదీ తీరప్రాంతమున గడుప వలెనని యున్నది." అని సీతకోరెను.

రాముని మనమేలకో ఒకించుక కలతనొందినది. అయినను ఆమె కోరికదీర్ప 'అటులే' యనెను. రాముని అంగీకారము లభించినందులకు సీత సంతసించెను.

అంతకొంతవడికి సీతారాములు వనమును వీడి అంతఃపురమున కేగిరి.

లో కు ల ప లు కు లు :

రాజ్యమునందలి ప్రజలు, వారి జీవనములు, కష్ట సుఖములు పరిపాలనమునుగూర్చి వారి అభిప్రాయములు, అభిమతములు విచారించి వచ్చి తెలియజేయు వేగువాండ్రను రాముడు నియమించెను. వారు, వచ్చి రామున కెన్నియో సంగతులు మనవిచేయుచుందురు.

ఒకనాడట్టి సమావేశమున వేగులు నివేదించు వింతలకు రామ చంద్ర ప్రభువు సంతసించుచుండెను. భద్రుడనువాడు ప్రభువు నలరింప

జేయుచుండెను. రాముడంతలో 'భద్రా! రాజును గూర్చి ప్రజలు మంచియు చెడ్డయు చెప్పుకొనుచుందురుగదా! ఎంత చెప్పినను ప్రజలు నన్ను భూషించుటనే చెప్పుచుంటివి. మంచిచెడ్డల రెంటిని వివరించుము.' అనెను.

భద్రు డేదియో చెప్పబోయి కొంత సందేహించి రాజాజ్ఞ శిరసావహింపక తప్పదనుకొని, "ప్రభూ! లోకులు కాకులు వంటివారు. నోటికి వచ్చినట్లు పలుకుచుందురు... రావణుడు సీతను తీసికొనిపోయి తన ఉద్యానవనమున నుంచినాడు. రావణుని సంహరించి రాముడు సీతను తెచ్చుకొని సుఖించుచున్నాడు. రాజెట్లో మనమును అట్లే చేసిన తప్పేమిగలదు ? మన భార్య లేమిచేసినను మనము సహించి ఏలుకొనవలెగదా? అని కొందఱనగా వింటిని." అనెను.

"ఈ విషయమునుగూర్చి మీరేమి చెప్పుదురు?" అని రాముడు తదితర వేగుల నడిగెను. "వారును భయపడుచు చేతులు జోడించికొని "మేమును వింటిమి ప్రభూ" అనిరి. రాముడు వేడి నిట్టూర్పు విడిచెను. వార్తాహారుల నందఱ బంపివైచెను.

కొంతతడవు రాముడేమో ఆలోచించెను. తమ్ములకు కబురంపి పిలిపించెను. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులువచ్చి అన్నగారికి నమస్కరించి కూర్చుండిరి. రాముని ముఖబింబమును చూచికలత జెందిరి. ఆయన ముఖమున విషాదచ్ఛాయలు కన్పించుచుండెను.

## పరిత్యాగము:

భద్రుడు తనకు జెప్పిన దంతయు తమ్ములకు రాముడు చెప్పెను. "ఈ అపవాదును నేను భరించజాలను. అపకీర్తి నరకమునకంటె నీచమైనది. ఇంతకుముందు మున్యాశ్రమముల సందర్శించ వలెనను కోర్కె జానకి వెలిబుచ్చినది. లక్ష్మణా! ఈ నెపమున ఆమెను తమసానదీ తీరమునకు సుమంత్రుడు సారథిగా రథముపై గొనిపోయి

మన రాజ్యమున కావల వాల్మీకి మున్యాశ్రమ ప్రాంతమున విడచిరమ్ము. నామాటకు బదులాడకుము. ఆజ్ఞను నిర్వర్తించుము" అనెను. మువ్వురును బదులాడక విచారముతో వెడలిపోయిరి.

లక్ష్మణుడు సుమంత్రునిచే రథము సిద్ధము చేయించెను. వదినగారి వస్తువులను రథముపై బెట్టించెను. సీతతో 'దేవీ! మున్యాశ్రమముల సందర్శించవలెనని నీవు కోరితివట. నిన్ను అడవుల దించిరమ్మని రాముడు నన్నాజ్ఞాపించినాడు. రథము సిద్ధముగనున్నది.' అని లక్ష్మణుడు చెప్పెను.

జానకి సంతసముతో బయలుదేరెను. ముని పత్నులకు కొన్ని కానుకలను తీసికొనెను. ఆమె రథమునెక్కగా సాగిపోయినది. ఆమె మనమేలకో కలవరము జెందసాగెను. దుశ్శకునములు కన్పించుచుండెను. 'లక్ష్మణా! నా కుడికన్ను అదురుచున్నది. మనసేమో వికలముగ నున్నది. అందఱికిని కుశలమేకదా!' అనెను. 'అందరు క్షేమమే నమ్మా' అని సౌమిత్రి బదులు చెప్పెను. ఆరాత్రి గోమతీ నదీతీరమున విడిసి మరునాడు గంగానదీ తీరమునకు చేరిరి. లక్ష్మణునకు దుఃఖమాగలేదు. అతడేడ్వసాగెను. 'రాముని విడచి ఒక్కతోజైన నీవు ఉండలేవు. నేనుమాత్ర మటులకాదా?' అని సీత మరదిని ఓదార్చెను.

సుమంత్రుడును రథమును గంగ కీవలయొడ్డున నుండగా పడవపై సీత నెక్కించి పల్లెకారుల సహాయమున లక్ష్మణు డావలియొడ్డునకు సీతను చేర్చెను.

లక్ష్మణుడు సీత పాదములకు సాష్టాంగ నమస్కారముచేసి, చెప్పలేక, చెప్పక యుండ నేరక భోరున నేడ్చుచు, "అమ్మా! నిన్ను అడవులదించి రావలసినదని రాముడు నన్ను ఆజ్ఞాపించినాడు. ఈ అపకీర్తిని నేను పొందుచున్నాను. దుర్మార్గులెవరో 'దుష్టుడగు రావణుని యింటనున్న సీతను దెచ్చుకొని మన ప్రభువు ఏలుకొనుటలేదా?

మనముమాత్ర మటులకాదా ? భార్య ఏమి యొగ్గొనరించినను మనము ఏలుకొనవలసినదే' అని అనుకొనిరట. ఇది రామునకు అపవాదుగను, నిందగను ఉండెను. అందుచే ప్రభువాజ్ఞ నేను నిర్వర్తించితిని' అనెను. లక్ష్మణుని నోట ఈ పలుకులు వెలువడినంతనే సీత మూర్ఛిల్లెను. కొంతవడికిలేచి ఆమె, 'సౌమిత్రీ ! నేను దుఃఖము లనుభవించుటకే జన్మించినాను. ఏ జన్మమున ఏ దంపతులను విడదీసితినో, ఈ జన్మమున నాకిట్టి ఘోరమైనశిక్ష భగవంతుడు విధించినాడు. పూర్వము వన వాసము చేసినను, భర్తచెంత నుంటినిగనుక విచారమే కలుగలేదు. రావణు డెత్తుకొనిపోయినను, తిరిగి రాముని చూడగలనను ఆశచే జీవించియుంటిని. ఇపుడు నాకు ఆ ఆశయులేదు. నేనెందుకు పరిత్యజింప బడితినని ముని పత్నులతో జెప్పుకొందును ? ఇంతకంటె అగ్నిలోబడి చచ్చుటమేలు' అని విలపించుచు తనకంటె ఇనుమిక్కిలిగ ఏడ్చుచున్న లక్ష్మణుని ఓదార్చి,

"లక్ష్మణా ! నాభర్తకెట్టి నిందను నేను ఆపాదింపజేయను. నా భర్త వంశమునకెట్టి కళంకము నావలన రాకుండుగాక ! ఈ బొందిని ప్రాణమున్నంతవఱకు ఈ అడవుల నిడుములు గుడుచుచు కాలము గడ పెదను. తండ్రీ, లక్ష్మణా ! పోయిరమ్ము నీకు శుభమగుగాత !'' అనెను.

లక్ష్మణుడు ఆమెను విడచిపోలేక, ఆమె నెటుల ఓదార్చవల యునో మాటలురాక నిశ్చేష్టుడైయుండుటజూచి, సీత ఇట్లనెను.

సీ॥ అన్నలక్ష్మణ యింక - నాలస్య మేటికి
జను మయోధ్యాపురం - బునకు నీవు
ముప్పుర త్తలకును - మ్రొక్కితినని తెల్పు
మచట బంధులనెల్ల - నడిగితినను
మతి కృపాళునకు రా - మావనీంద్రునకు నా
మ్రొక్కుగా నతిభక్తి - మ్రొక్కుమీవు
తన యాజ్ఞ తలదాల్చి - జననిందతనుజెంద
నీక కానల జరి - యింతునను ము

తే. గీ. భూజనుల బాంధవుల లెస్స - బ్రోవుమనుము
తలప నాకేడుగడయును - దానెయనుము
భావమెప్పుడు దనమూర్తి - బాయదనుము
నెమ్మియొక్కయింత నామీద - నిల్పుమనుము.

(కంకంటివారి ఉత్తరరామాయణమునుండి)

లక్ష్మణుడు వదినగారికి ప్రదక్షిణముచేసి నమస్కరించెను. తల్లిని వదలిపోలేని లేగదూడవలె అతడు పోలేకపోలేక వెళ్ళెను. సీత దుఃఖమునకు మేరలేదు. పెద్దపెట్టున ఆమె యేడ్చెను. తనగోడు చెట్లతోను చేమలతోను చెప్పుకొనెను. ఆలకించువారెవరు ?

ఆశ్రమవాసము :

ఆ ప్రాంతమున సమిధలకై వచ్చిన కొందఱు మునిబాలకులు ఆమె రోదనము వినిరి. ఆమెను చూచిరి. ఆశ్రమమునకు పరుగిడిపోయి వాల్మీకి మహర్షితో ఇట్లని విన్నవించిరి. "గురువర్యా ! గంగానదీ తీరమున లక్ష్మీదేవి వంటి ఒక స్త్రీ విలపించుచున్నది. మే మామెను చూచి వచ్చినాము." అనిరి.

దివ్యదృష్టి వలన వాల్మీకి జరిగిన దంతయు తెలిసికొనెను. మునిబాలకుల వెంట నిడుకొని ఆ మహర్షి వెంటనే ఆమెకడకు పోయెను. "అమ్మా ! నీవెవరవో. నేను గుర్తెఱిగితిని. జనకమహారాజు పుత్రికవు. దశరథేశునికోడలవు. శ్రీరామచంద్రుని అర్థాంగివి ! నీయందెట్టి లోపము, దోషము లేదు. పతివ్రతాంగనవు. నా ఆశ్రమమునకు దగ్గరలో తాపసస్త్రీలున్నారు. వారునిన్ను తమ బిడ్డవలె చూచుకొందురు. విచారింపకరమ్మా" అనెను.

సీత వాల్మీకి మహర్షి పాదములకు నమస్కరించెను. ఆయన వెంటనడచెను. ఆశ్రమము కడకు పోగానే తాపసస్త్రీలు మహర్షి కెదురువచ్చి నమస్కరించిరి. ఆయన వారలతో ఇట్లనెను.

"ఈమె దశరథరాముని పత్ని జానకి. ఈమెను సగౌరవముగ నాదరించుడు."

మునికాంతలామెను సాదరాభిమాన వాక్యముల నోదార్చి తమ ఆశ్రమము లోనికి గొంపోయిరి. ఓదార్చి ధైర్యమును జెప్పి వాల్మీకి మునిచంద్రుడు తన ఆశ్రమమునకు బోయెను.

సీ. రంగారు బంగారు - చెంగావులు ధరించు
శృంగారవతి నార - చీరలూనె
భూజనంబులు మెచ్చు - భోజనంబులొనర్చు
కమలాక్షి కందమూ - లములు నమలె
చంద్రకాంత విశాల - చంద్రశాలలనుండు
జవ్వని మునిపర్ణ - శాలనుండె
మరులుతో శ్రీరాము - నురముపై బవళించు
బాలికామణి యొంటి - పవ్వళించె

తే. గీ. గన్నుసన్నల శుద్ధాంత - కాంతలాచ
రించు సేవలు మెచ్చని - కాంచనాంగి
యొగ్గె మునిముగ్ధకాంతా, కృ - తోపచార
విధికి; నెంచనసాధ్యంబు - విధికిగలదె ?

(కంకంటివారి ఉత్తర రామాయణమునుండి)

భృగు మహర్షి శాపఫలము :

విధికృతము తప్పింప నెవరితరమును కాదు. సీతామహాదేవికి వచ్చిన మార్పులను తలచుకొనుచు, విచారపడుచు సౌమిత్రిగంగానదిని దాటి సుమంత్రుడున్న రథమువద్దకువచ్చెను. గంగ కావలియొడ్డున వాల్మీకిమహర్షి వచ్చి సీతను వెంటనిడుకొనిపోవుటను చూచిన లక్ష్మణు నకు కొంత మనశ్శాంతికలిగినను, ఆమెకును రామునకును కలిగిన

వియోగము తలచుకొని ఖేదమొందుచుండెను. సుమంత్రుడు లక్ష్మణుని నోదార్చి దశరథునకు దుర్వాసుడు పూర్వమొకప్పుడు చెప్పిన వృత్తాంతము నిట్లు చెప్పెను.

పూర్వము దేవతలకును రాక్షసులకును యుద్ధము జరుగగా ఒక సమయమున రాక్షసులు పారిపోయి భృగుమహర్షి భార్యను శరణు వేడి ఆమెచాటున దాగిరి. ఈసంగతి నెఱిగిన శ్రీమన్నారాయణుడు శరణు నిచ్చిన ఆమెను చక్రాయుధముతో వధించెను. భృగువందులకు కినిసి, "నాభార్యను చంపిన నీవు భూమిపై నరజన్మమెత్తుము. నావలె నీవును భార్యావియోగముచే వ్యధనొందుము" అని విష్ణుమూర్తిని శపించెను. అని చెప్పి దుర్వాసుడు దశరథునితో మరియు నిట్లనెను. "ఆ విష్ణువు నీ కుమారుడైన రాముడు; అతడు శాపవశమున చాలకాలము భార్యా వియోగ దుఃఖమనుభవింపక తప్పదు."

"ఇది నేను విన్నరహస్యము. కనుక లక్ష్మణా! దుఃఖింపకుము; రథమధిరోహింపుము" అని సుమంత్రుడు చెప్పి లక్ష్మణునోదార్చి, తిరిగి వారు రథముపై గోమతీ నదీతీరమునకు చేరి, ఆరాత్రిగడపిరి. మరునాడు అయోధ్య చేరిరి.

లక్ష్మణుడు అన్నగారివద్దకుపోయి పాదాభివందనముచేసి జరిగిన దంతయు చెప్పెను. రాముడు మిగుల విచారించెను. లక్ష్మణుడు రాముని ఓదార్చి, "రాముడు భార్యను విడచియుండలేక బాధపడుచున్నాడని లోకులు మరల నిందావాక్యముల నాడుదురేమో, కనుక ధైర్యము వహింపుము" అనెను.

జానకిని పంపివేసినది మొదలు రాముడు విచారపడుచునే యుండెను. నాలుగు దినములనుండి అతడు రాచకార్యములు చక్కబెట్టుట లేదు. పౌరుల కష్టనిష్ఠురముల విచారించుటలేదు. ఇది గుర్తుకుదెచ్చుకొని రాముడు తమ్మునకిట్లు చెప్పెను.

నృగ మహారాజు :

పూర్వము నృగమహారాజు ధర్మాత్ముడై ఒకప్పుడు కోటి పాడి యావులను బ్రాహ్మణులకు దానమిచ్చెను. అందులో ఒక గోవు తప్పించుకొనివచ్చి రాజు గోశాలలో చేరెను. రాజు తెలియక దానిని మరల మరియొకరి కిచ్చెను. మొదటి బ్రాహ్మణుడు వెదకి వెదకి తన ఆవును గుర్తించెను. దానము పుచ్చుకొనిన వారిరువురు ఆవుకై తగాదాపడి రాజుకడకు పోయిరి. ఎంతకాలము వేచియున్నను రాజుగారి దర్శనము లభింపలేదు. వారికి కోపమువచ్చి "ప్రజల కష్టసుఖముల విచారించని నీవు వేయి సంవత్సరములు తొండవై పడియుండు" మని శపించి ఆ గోవును మరియొక బాపనికి దానమిచ్చి వెడలిపోయిరి.

నృగు మహారాజు విచారపడి, కుమారుని రావించి రాజ్యాధిపత్యమిచ్చి, అనేక హితవుల నుపదేశించెను. "మానవుడు దైవయోగమును దాటజాలడు. అనుభవించవలసినదే" అనిచెప్పి తాను నివశించుటకై రెండు గుంటలను కట్టించుకొని ఆ నృగమహారాజు తొండయై పడియుండెను.

'కనుక రాజు అయినవాడు ప్రజలను తృణీకరింపతగదు' అనిచెప్పి రాముడు మరియు నిట్లనెను.

నిమి చక్రవర్తి :

ఇక్ష్వాకునకు పండ్రెండవ కుమారుడగు నిమి వైజయంతమను పట్టణమును రాజధానిగా చేసికొని రాజ్యమేలుచుండెను.

వశిష్ఠుని ఋత్విక్కుగా నేర్పరచుకొని నిమి ఒక మహాయజ్ఞము చేయదలచెను. కాని వశిష్ఠుడు ఇంద్రుని యజ్ఞము చేయించుటకు అంగీకరించి యున్నందున అది పూర్తిచేయించి వత్తునని వెడలిపోయెను. నిమి గౌతముని ఏర్పాటుచేసికొని యజ్ఞము అయిదువేల సంవత్సరములు చేసి పూర్తిచేసెను.

పిమ్మట వశిష్ఠుడు వచ్చెను. నిమి చక్రవర్తితో అతడు సంభాషింపదలచెను. నిమి నిద్రపోవుచుండెను. వశిష్ఠమహర్షి ఎంతసేపు వేచియున్నను రాజు రానందువల్ల కోపించి మహర్షి "నన్ను పిలిచి మరొకనిచే యజ్ఞము చేయించుకొంటివి. కాన నీవు శరీరవిహీనుడవు కమ్ము" అని శపించి వెళ్ళెను. రాజు నిద్రలేచి జరిగినసంగతి తెలిసికొని "నేను నిద్రపోవుచుండగా వచ్చి నిష్కారణముగా శపించితివి కనుక నీవును నావలె శరీరహీనుడవై పొమ్ము" అని ప్రతిశాపము నిచ్చెను. ఇరువురు శరీరము లేనివారైరి.

అగస్త్యుడు, వశిష్ఠుడు - కుంభసంభవులు :

వశిష్ఠుడు బ్రహ్మవద్దకు పోయి జరిగినది చెప్పి, శరీరము లేనివానికి కర్మాచరణము లేదుగదా! కనుక నాకు దేహమును ప్రసాదింపుము. అని వేడెను. "మిత్రుని యొక్కయు వరుణుని యొక్కయు తేజస్సు పొంది, అయోనిజుడవై జన్మింతు" వని బ్రహ్మ చెప్పెను.

ఊర్వశి మిక్కిలి అందగత్తె. ఆమెను చూచి సూర్యుడు మోహించెను. సూర్యుని వద్దకు పోవుచున్న ఊర్వశినిచూచి వరుణుడు మోహించెను, "సూర్యుని వద్దకు పోవుచున్నాను. కాని నా మనసు నీయందే లగ్నమైయున్నది. శరీరము మాత్రము మిత్రుని కప్పగింతు' నని వెళ్ళెను. సూర్యుని వద్దకు వచ్చిన ఊర్వశిని చూచి, జరిగినది గ్రహించి, 'నన్ను కాదని వరుణుని మోహించినావు గాన భూలోకమున నరజన్మనెత్తుము. కాశీరాజగు పురూరవుడు నిన్ను సుఖపెట్టును పొమ్ము.' అని శపించెను.

మిత్రావరుణు లిరువురు తమ వీర్యమును ఒక కుండయందుంచిరి. కొంతకాలమున కందుండి ఇరువురు మహర్షులు కలిగిరి. మొదట జన్మనొందిన అగస్త్యుడు సూర్యుని తిరస్కరించి వెడలిపోయెను. తరువాత పుట్టినవాడు వశిష్ఠుడు. ఇతడు మిత్రావరుణుల ఇరువురి

తేజస్సును పొందిన వాడయ్యెను. ఈయనను ఇక్ష్వాకు వంశమువారు తమ పురోహితునిగా జేసికొనిరి.

మి థి ల :

శరీరములేని నిమి చక్రవర్తి చేత మహర్షులు యజ్ఞము చేయించిరి. తృప్తినందిన దేవతలు వచ్చి నీకు శరీరమిత్తుము, వరములకోరుకొనుమనిరి. నిమి అందులకు, 'నాకు శరీరమక్కర లేదు. జీవుల కన్నుల యందు నేనుండునట్లు అనుగ్రహించు' డని దేవతలను వేడెను. దేవతలు సంతసించి, 'జీవుల కన్నుల యందుండుము ; శ్రమ తీర్చుకొనుటకై ప్రాణులు నీ సాయమున రెప్పలు వాల్చుచుందురు.' అని వెడలి పోయిరి.

అశరీరుడగు నిమిపై అరణి నుంచి మథించిరి. మథనము వలన మిథి అను కుమారుడు కలిగెను. అతని పేరున ఆ పట్టణమునకు మిథిల యను పేరు వచ్చెను. విదేహుని వలన జన్మించిన వాడగుటచే మిథికి వైదేహుడనియు పేరు వచ్చెను. ఇతడే జనక మహారాజు వంశమునకు మూల పురుషుడు.

ఈ కథవినిన లక్ష్మణుడు, 'అగ్రజా ! క్షత్రియుడగు నిమి వశిష్ఠ మహర్షి నేల హర్షింపకపోయెను ?' అని ప్రశ్నించెను. 'క్షత్రియునకు ఓరిమి ఉండవలసినదే' అనుచు, రాముడు మరిక్కట్లనెను.

య యా తి :

నహుషుని కుమారుడగు యయాతి కిద్దరు భార్యలు శర్మిష్ఠ, దేవయాని అనువారలు. శర్మిష్ఠ వృషపర్వుడను దైత్యుని పుత్రిక. శుక్రాచార్యుని దుహిత దేవయాని. యయాతికి శర్మిష్ఠవలన పూరుడు, దేవయానివలన యదువు అను కుమారులు కలిగిరి. యయాతికి పెద్దభార్య, ఆమె కుమారుడు అనిన ప్రేమ అధికము. దేవయాని నతడు ప్రేమించెడి వాడు కాదు.

దేవయాని పక్షమున శుక్రాచార్యుడువచ్చి సంగతియంతయు తెలిసికొని "దుర్మార్గుడు, యవ్వనగర్వముతోనున్న యయాతి మిక్కిలి ముసలివాడై పోవునుగాక" అని శపించెను. ముదుసలి యగు తండ్రి చిన్నకుమారుడగు యదువును తన ముసలితనము గ్రహించి యవ్వనము నిమ్మనియు, కొంతకాలము భోగము లనుభవించిన పిదప మరల తన ముసలితనము తాను గ్రహింతుననియు చెప్పెను. యదువు అంగీకరించలేదు. అట్లే పూరుని అడుగగా సంతోషముతో పూరుడు తన యవ్వనము తండ్రికిచ్చి, తండ్రి ముసలితనము తాను గ్రహించెను.

యయాతి యువకుడై చాల యజ్ఞములుచేసెను. మిక్కిలి భోగములను అనుభవించెను. పూరుడు తన యాజ్ఞను నెరవేర్చినందులకు అతనికి కాశీరాజ్యము నిచ్చెను. తన ముసలితనమును యయాతి గ్రహించెను. ప్రతిష్ఠానపురము రాజధానిగా పూరుడు రాజ్యమేలెను. యదువు తనమాటను గౌరవింపని కారణమున తండ్రియగు యయాతి, "తండ్రికోర్కె తీర్చని నీకు రాక్షసులు పుట్టుదురుగాక!" అని కుమారుని శపించెను.

యదువు క్రౌంచవనమను పట్టణమును గట్టుకొని, అందు నివశించుచుండెను. ఇతని కనేకమంది కుమారులు రాక్షసులై పుట్టిరి.

శత్రుఘ్నుని జైత్రయాత్ర :

శ్రీరాము డొక దినమున ప్రజలకు దర్శనమిచ్చుటకు సభాభవనమున నుండెను. యమునానదీ తీరముననుండు కొందరు మునులు వచ్చి రాముని దర్శించిరి. రామునిచే వారు సత్కరింపబడిరి. అందు చ్యవనుడను ముని ఇట్లు చెప్పెను.

పూర్వము లోలుడను దైత్యునకు మధువను కుమారుడు గలడు. మధువు తపస్సుచేసి రుద్రుని వలన ఒక శూలమును బడసెను. శూలము నిచ్చుచు రుద్రుడు, "దేవ, బ్రాహ్మణులయెడ శత్రుత్వము లేకుండు

వలకు నీకిది ఉపయోగించును. ఈ శూలము శత్రుసంహారము చేసి మరల నిన్ను జేరును. ఇది నీకును, నీ కుమారునికి మాత్ర ముపయోగించును" అని చెప్పెను.

అనల, విశ్వావసు అనువారి కొమరిత కుంభీనసిని మధువు వివాహమాడెను. ఇతనికి లవణుడను పుత్రుడు కలిగెను. లవణుడు మొదటినుండియు క్రూరుడు. తండ్రి గతించిన పిదప శూలము చేతికి వచ్చినంతనే ముల్లోకముల బాధింపసాగెను.

కనుక 'రామా! ఆ లవణుని చంపి మమ్ము రక్షించుము' అనెను. 'లవణాసురుని నేను చంపెదనని శత్రుఘ్ను' డనెను. రాముడు సంతోషముతో వైభవముగ మధునగరమునకు శత్రుఘ్నునికి పట్టాభిషేకము చేసెను. శత్రుఘ్నునికి కొంతసైన్యమును, అమోఘమైన ఒక బాణమునిచ్చి లవణుని చంపు ఉపాయమును రాముడు చెప్పెను.

మునులును, సైన్యమును ముందుగా వెడలిపోయిరి. నెల దినములు పిమ్మట శత్రుఘ్నుడు అన్నగారి యనుమతిని ప్రయాణమై వెళ్ళెను. రెండు దినములకు వాల్మీకి ఆశ్రమముచేరి ఆరాత్రి వాల్మీకి ఆశ్రమమున విడిది చేసెను.

ఆ సమీపమున కన్పించిన యజ్ఞముచేసిన గుర్తులనుగూర్చి అడిగిన శత్రుఘ్నునకు వాల్మీకి ఇట్లు చెప్పెను.

కల్మాషపాదుడు :

ఇక్ష్వాకు వంశమున సుదాసుడను రాజునకు వీరసహుడను కుమారుడు కలడు అతని కాలమున ఇద్దరు రాక్షసులు పులి రూపములు దాల్చి మృగములను తినుచుండగా వీరసహుడు మృగములను రక్షింప దలచి ఒక పులిని చంపెను. అతడు రాక్షస రూపముతో చనిపోగా రెండవ రాక్షసుడు రాజుపై కక్ష బూనెను.

ఆరాజు కొంతకాలమునకు మరణించి మిత్రసహుడను పేర మరల జన్మించి రాజ్యమేలుచుండెను. వశిష్ఠుడు పురోహితుడుగానుండ మిత్ర సహుడు యజ్ఞము చేసెను. రెండవ పులిగానున్న రాక్షసుడు వశిష్ఠుని వలెవచ్చి మాంసభోజనము నడిగెను. రాజు వంటవానితో చెప్పి సిద్ధము చేయించెను. రాక్షసుడు వంటవానితో లోనికేగి వానినిచంపి వంట వాని రూపముతో బయటకు వచ్చెను. ఆ వంటవాని మాంసమువండి తయారుగా నుంచెను.

మిత్రసహుడు, భార్యయగు మదయంతి వశిష్ఠుని తోడ్కొని భోజనమునకువచ్చిరి. వంటవాని రూపములోనున్న రాక్షసుడు వారికి నరమాంసము వడ్డించెను. 'నీకు నరమాంసము ఆహారమగుగాక' అని శపించెను. నిరపరాధినగు నన్నేల శపింపవలెనని రాజు క్రుద్ధుడై వశిష్ఠు నకు మరల శాపమివ్వ చేతిలోనికి నీరు దీసికొనెను. కులగురువును శపిం చుట తగదని భార్య అడ్డుపడి భర్తను శాంతింపజేసెను. రాజుచేతిలోని నీరు అతని కాళ్లపైబడి అతని పాదములు కల్మషముతో నిండిపోయెను. అప్పటినుండి ఆరాజు కల్మాషపాదుడని పిలువబడెను. వశిష్ఠుడునిజమును గ్రహించి పశ్చాత్తాపపడి తన శాపము పండ్రెండు సంవత్సరములు మాత్రము బాధించును. తరువాత విముక్తి కలుగునని రాజుతో చెప్పెను.

ఆ కల్మాషపాదుడు యజ్ఞము చేసిన ప్రదేశమది; అని వాల్మీకి మహర్షి వివరించెను. ప్రొద్దుపోవుటచే మహర్షి అనుజ్ఞపొంది శత్రు ఘ్నుడు తన పర్ణశాలలోని కరిగెను.

కవల బిడ్డలు :

గర్భవతియగు సీత,

కం. ఆరాత్రియె రఘుకుల ని
స్తారకులగు సుతులఁదయఁ - తరణిప్రతిమా
కారులఁగాంచె ధరాసుత
వారిజలోచనులఁ గవల - వారలఁ బ్రీతిన్॥

( తిక్కన - నిర్వచనోత్తర రామాయణము )

ఇరువురు మగబిడ్డలు కలిగిరి. వెంటనే ముని బాలికలు వాల్మీకి మహర్షికి చెప్పిరి. ఆ పసికందులకు భూతబాధ కలుగకుండ ముందు పుట్టినవానికి కుశలతో తుడిచియు, తరువాత జనించినవానికి లవముతో తుడిచియు మహర్షి రక్షగావించెను. కుశలతో తుడువబడుటచే కుశుడు అనియు, లవముచే తుడువబడుటచే లవుడు అనియు వారలకు వాల్మీకి మహర్షి నామకరణముల చేసెను.

ఆ అర్ధరాత్రమున నే శత్రుఘ్నునకీ విషయము తెలిసెను.

శ్లో. అర్ధరాత్రేతుశ్శత్రుఘ్నశ్శుశ్రావ సుమహాత్ప్రియమ్
పర్ణశాలాంతతోగత్వా మాతర్దిష్ట్యేతి చాబ్రవీత్.

అతడెంతయో సంతోషమును బొందెను. వదినగారు వ్రసవించిన పురిటింటికిబోయి క్షేమము విచారించి ఆమెతో "అమ్మా! ఎంత అదృష్టము." అని తిరిగి వచ్చెను.

మరనాడు శత్రుఘ్నుడు వాల్మీకికడ సెలవుదీసికొని ప్రయాణము సాగించి యేడుదినములకు చ్యవనుని ఆశ్రమము చేరుకొనెను.

## లవణాసురవధ :

లవణాసురుని బలాబలములను గూర్చి చ్యవనునివలన శత్రుఘ్నుడు తెలిసికొనెను. వాని బలమునుగూర్చి చ్యవనుడిట్లు చెప్పెను. ఇక్ష్వాకునివంశపురాజైన మాంధాత గొప్ప చక్రవర్తియై దేవేంద్రుని అర్ధాసనము నధిష్టింపబోయెను. ఇంద్రుడు "రాజా! నీవు భూమిపై రాజులనందరిని జయించలేదు. లవణాసురుని జయించిననేగాని నీవు స్వర్గముపైకివచ్చు అర్హతకలుగ" దనెను. వెంటనే వచ్చి మాంధాత లవణునిపై దండెత్తెను. కాని లవణుని శూలప్రహారములకు మాంధాత తాళలేకపోయెను. శూలము మాంధాతనుచంపి మరల రాక్షసునిచేతికి వచ్చిచేరెను.

కనుక లవణుని ఉపాయముతో చంపవలెను. శూలము వాని చేతియందు లేని సమయముచూచి సంహరించవలెను. ప్రతిదినము వాడు శూలమును ఇంటికడనుంచి, ఆహారమునకై బయలుదేరిపోయి తిరిగి పట్టణమునకు చేరును. లవణుడింటికిచేరు మధ్యకాలముననే వానిని చంపవలెనని చ్యవనుడు ఉపాయము చెప్పెను. శత్రుఘ్నునకు రాముడు రహస్యముగ చెప్పినదికూడ ఇదే ఉపాయము.

లవణుడు లేచి అడవికిబోయెను. మధ్యాహ్నసమయమున పట్టణమునకు తిరిగివచ్చునప్పటికి శత్రుఘ్నుడు అడ్డుగా నిలిచియుండెను. శూలము తెచ్చుకొన లోనికి పోబోయిన లవణుని శత్రుఘ్నుడు బాణఘాతముల నొప్పించెను. రాక్షసుడు చెట్టును పెరికివైవ శత్రుఘ్నుడు మూర్ఛబోయి మరలలేచి రాముడొసగిన బాణమును ప్రయోగించెను. ఆ బాణము లవణుని గుండెను చీల్చివేసెను. పర్వతమువలె వాడు నేల గూలెను. వాడు మరణించగనే శూలము రివ్వున ఎగిరి శంకరుని వద్దకు పోయెను. దేవతలు, మునులు సంతసించిరి. శత్రుఘ్నుని కోరికననుసరించి లవణుని పట్టణము దివ్యమగు మధుపురముగనయ్యెను. శత్రుఘ్నుడా పట్టణమున పండ్రెండు సంవత్సరముల కాలముండి కొంతపరివారముతో అయోధ్యకు ప్రయాణమయ్యెను.

మధురగానము :

దారిలో వాల్మీకి ఆశ్రమమున ఒకరాత్రి శత్రుఘ్నుడు మరల గడపెను. శత్రుఘ్నునకును, పరివారమునకును మహర్షి ఆతిథ్యమిచ్చెను ఆరాత్రి ఆశ్రమమున శత్రుఘ్నుడు మధురగానము వినుటతటస్థించెను. తంబుర శ్రుతి జేసికొని పాడు లయబద్ధమగు సంగీతమది. అందునను శ్రీరామ చరితామృతము! ఆనంద తరంగ డోలికల శత్రుఘ్నుడు ఓలలాడెను. పరివారమంతయు చెవులు దోరబెట్టుకొని విని పరవశులైరి. ఈ మధురగాన మెవరిదో మహర్షి నడిగి తెలిసికొనుడని పరివారజన

మనెనుగాని, "ఇట్టి విచిత్రము లెన్నియో ఆశ్రమమున ఉండవచ్చును. మహర్షిని వాటినిగూర్చి మనమడుగుట ధర్మముకాదు." అని శత్రుఘ్నుడు తప్పుకొనెను.

అయోధ్య :

శత్రుఘ్నుడు అయోధ్యకు జేరెను. లవణాసుర సంహారమును గూర్చి అన్నగారికి విన్నవించెను. రాముడు తమ్ముని కౌగిలించుకొనెను. శత్రుఘ్నుడు అయోధ్యలోనుండ నుద్దేశించెనుగాని రాముడు "సోదరా! నీవిచటనున్న మధుపురమును పాలించువారెవరు? వచ్చుచు పోవుచు నుండుము. ఏడు దినము లయోధ్యలో గడపి మరలిపొమ్ము. అది క్షత్రియోచితము" అనెను. అన్నగారి ఆజ్ఞ ననుసరించి శత్రుఘ్నుడు ఏడు దినములుండి తిరిగి అయోధ్యనువీడి మధుపురమున కేగెను.

శంబూకుడు :

ఒకనాడు ఒక మృతకళేబరమును దీసికొని బ్రాహ్మణ దంపతులు వచ్చి రాముని రాజద్వారముకడ పెట్టుకొని దుఃఖించుచు నుండిరి. రాజు చేసిన దోషమువల్ల పెద్దవారగు తాము బ్రతికియుండగనే తమ కుమారుడు చనిపోవుట జరిగినదనియు, తామును ఇచటనే ప్రాణములు విడువ సిద్ధముగ నుంటిమనియు, ఈ పాపమంతయు రాజునకే చెందు ననియు ఏడ్చుచుండిరి.

ప్రభువగు రాముడది విని విచారపడి మంత్రులను, పురోహితులను పిలిచి యీ అన్యాయము జరుగుటకు కారణమడిగెను. నారదుడిట్లనెను. "రాజేంద్రా! కృతయుగమున బ్రాహ్మణులును, త్రేతాయుగమున బ్రాహ్మణ క్షత్రియులును, ద్వాపరయుగమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులును కలియుగమున నాలుగు వర్ణములవారును తపస్సు జేయవచ్చును. ఈ త్రేతాయుగమున ఒక శూద్రుడు నీ రాజ్యమున తపస్సు చేయుచున్నాడు. అతనిని శిక్షించిన ఈ బ్రాహ్మణ బాలుడు బతుకును.

బ్రాహ్మణదంపతులనోదార్చి, బాలుని శవమును నూనెయందు భద్రపఱచుమని లక్ష్మణు నాజ్ఞాపించి రాముడు పుష్పకమును తలచుకొనెను. విమానమువచ్చెను. దానిని రాముడధిరోహించి తపముజేయు వానికై చూడపోయెను. ఒక సరోవరమువద్ద అధోముఖుడై యున్న తాపసిని చూచెను. విమాన మవరోహించి రాముడాతని చెంతకేగి, "ఓయీ ! నీవెవరో చెప్పుము. నేనీరాజ్యమునకు ప్రభుడనగు దశరథ రాముడను, నీకోరికయేమి ?" అనెను. ఆవ్యక్తి, "ఆర్యా, నేను శూద్రుడను, నాపేరు శంబూకుడు. శరీరముతో స్వర్గమునకు పోవలెనని తపస్సుజేయుచున్నాను" అని సమాధానము నిచ్చెను.

'ఏదోషమును జేయని వానిని శిక్షించుట అధర్మమేయగును. తల్లిదండ్రులు బ్రతికియుండగా కుమారుడు చనిపోవుటకూడ ధర్మవిరుద్ధమే. నారాజ్యమున ఇట్టి ధర్మవిరుద్ధములు జరుగుట ఉపేక్షింపతగదు. దోషిని శిక్షించుట క్షత్రియధర్మము.'' అని మనసున నిర్ణయించుకొని, రాముడు "నీవు స్వర్గమునకు పోదలచికదా తపమాచరించుచుంటివి ! నాచేతిమరణము నీకు స్వర్గమునిచ్చును." అని ఖడ్గముతో వాని తల ఖండించెను.

శంబూకుని కళేబరము నేలబడగనే అయోధ్యలోనున్న బ్రాహ్మణ కుమారుడు జీవించెను. రాజ ప్రాసాదమునకు జేరిన రాముని బ్రాహ్మణులు పొగడుచు తమనివాసములకుపోయిరి.

జ ల శ య న వ్ర త ము :

అగస్త్యమహర్షి జలశయన వ్రతము చేయుచుండెననియు తాము చూడబోవుచున్నామనియు, నీవు కూడా రమ్మనియు దేవతలు రాముని ఆహ్వానించిరి.

రాముడు పుష్పకముపై అగస్త్యాశ్రమమునకు వెళ్ళెను. మహర్షికి పాదాభివందనముచేసెను. అగస్త్యుడు రామునికి అర్ఘ్యపాద్యాది ఉచితగౌరవముల చేసెను. ఒక రత్నహారమును మహర్షి రామునకు

బహూకరించెను. "ఈ దివ్యహారము రత్నహారములను, బంగారమును ఇచ్చును." అనియు చెప్పి దానిని గుఱించి అగస్త్యు డిట్లుచెప్పెను.

## రత్న హా ర ము :

పూర్వము విదర్భదేశమును సుదేవుడనురాజు పాలించెను. అతని పెద్దభార్యవలన శ్వేతుడను కుమారుడు కలిగెను. తండ్రి తదనంతరము శ్వేతుడు రాజయి వేయిసంవత్సరములు ధర్మపరిపాలన మొనర్చి తపస్సు జేసికొనుటకు ఈ వనమునకు వచ్చెను. ఈ అడవులయందు గల యీ సరస్సునందు నీరుండెనేకాని పశుపక్ష్యాదులు లేవు. శ్వేతుడు మూడువేల సంవత్సరములు తపస్సుచేసి బ్రహ్మ లోకమునకు వెళ్ళెను. కాని అతనికి ఆకలి ఉడుగలేదు. బ్రహ్మవద్దకుపోయి అడుగగా, బ్రహ్మ "నీవెపుడును ఎవరికిని దానము చేయలేదు. కనుక నీ ఆకలి తీరుటకు నీ శరీరమునే తినుము." అనెను. మరియు "అగస్త్యుడు నీచెంతకువచ్చి నపుడు శాపవిముక్తి నొందెదవు." అనియు చెప్పెను.

అప్పటినుండి శ్వేతుడు విమానముపై వచ్చి యీ కొలనుగట్టున తన కళేబరమును తానే తినుచుండెను. ఎంతకాలమట్లు తినినను ఆశరీరము తరుగక మరల నిండుగనే యుండును.

"ఇట్లు కొంతకాలమైన పిదప, నేనీ కొలను దరికి పోవుటయు శ్వేతుడు కళేబరమును పీక్కొని తినుటయు చూచితిని. నన్నాతడు చూడగనే సంతసించి ఈ రత్నహారము నా కొసగి తనను శాపవిముక్తుని గావింపుమనెను. నేనాహారము తీసికొన్నంతనే అతడు శాపము నుండి విడువబడినవాడై అనగా ఆకలిలేనివాడై బ్రహ్మలోకముచేరెను. అని రామునకు శ్వేతుని రత్నహారమునుగూర్చి వివరించెను.

ఇదివినిన పిమ్మట రామునకొక సందేహముకలిగి మహర్షినిట్లు ప్రశ్నించెను. "మునీంద్రా! శ్వేతుడు తపస్సుచేసిన అరణ్యమున నరులు లేకపోవచ్చునుగాని మృగములు, పక్షులుగూడ లేకుండుటకు కారణ మేమి?" అందుకు అగస్త్యమహర్షి ఇట్లు చెప్పెను.

దండకారణ్యము :

మనువునకు ఇక్ష్వాకుడను కుమారుడుండెను. ఇక్ష్వాకునకు నూరుగురు కుమారులు, చివరివాడు దండుడు. ఇతడు విద్యావిహీనుడు, మూర్ఖుడు. ఇక్ష్వాకుడు వింధ్యారణ్యము, శైవలారణ్యముల మధ్య ఒక రాజ్యభాగము నిచ్చెను. దండుడచట మధుమంతమను పట్టణము నిర్మించుకొని శుక్రాచార్యుని పురోహితునిగా జేసికొని రాజ్యమేలు చుండెను.

ఒకనాడు దండుడు శుక్రుడు ఆశ్రమప్రాంతమునకు పోయెను. శుక్రుని జ్యేష్ఠపుత్రిక అరజనుచూచి మోహపరవశుడై తన కోర్కెను దెలిపెను. తండ్రి అనుమతిలేనిది వరించజాలనని అరజ చెప్పెను. కామోద్రేకియగు దండుడామెను బలాత్కారమున రమించి రాజధానికి వెళ్ళిపోయెను. చింతావ్యాకులచిత్తయై పడియున్న అరజను ఆశ్రమమునకు తిరిగివచ్చిన శుక్రుడు చూచెను. జరిగినదంతయు తెలిసికొనెను. శుక్రుడు కోపముతో "దండుని రాజ్యమున్నంతమేర ఏడు దినములు బురదవర్షము కురియునుగాక!" అని శపించెను.

శుక్రుడు దండునిరాజ్యమును వీడి వేరొకచోట ఆశ్రమము నేర్పరచుకొనెను. కాని కుమార్తెను అచటనేయుండుమనియు, ఆమె యున్న ఆశ్రమ ప్రాంతము మాత్రము బురదకురియదనియు చెప్పెను. శుక్రుడు చెప్పిన ప్రకారమే జరిగెను.

అందుచే ఈ ప్రాంతమునకు దండకారణ్యమని పేరుకలిగినది. నాటికి పశుపక్ష్యాదులు లేకుండుటయు సంభవించెను. అని వివరించిన అగస్త్యమహర్షికడ సెలవుదీసికొని రాముడయోధ్యచేరెను. పుష్పక మును బంపివైచెను.

సమాలోచనము:

శ్రీరాముడు లక్ష్మణుని, భరతుని పిలిపించి ఇట్లనెను. "సోదరు లారా! మీ సహాయమున నేను రాజసూయము చేయదలచుచున్నాను. సూర్యుడు, చంద్రుడు, యముడు, వరుణుడు ఈ యాగమునుచేసి కీర్తి నొందిరికదా!"

అదివినిన భరతుడు, "అగ్రజా! రాజసూయముచేసినపుడెల్ల లోకమున వినాశమునకు దారితీసెను. చంద్రుని రాజసూయము పిదప నక్షత్రమండలమునందు యుద్ధమును,హరిశ్చంద్రుడు చేసినపుడు క్షత్రియ కులమెల్ల నశించుటయు, ఇంద్రుడాయాగముచేయగా దేవాసురయుద్ధము సంభవించెను. లోకనాశనముకంటె లోకకళ్యాణమునకై తలపెట్టుట శ్రేయముకదా!" అనెను.

భరతుడు చెప్పినదెంతయో సమంజసముగ నుండుటచే రాముడు రాజసూయాధ్వరముచేయుతలపు విరమించెను.

లక్ష్మణు డిట్లనెను, "అశ్వమేధము శ్రేయస్కరమైనది; పాపము లను నశింపజేయునది. ఈ కథ ఆకర్ణింపుడు, "మహాబలవంతుడును, ధర్మ జ్ఞుడును అగు వృత్రుడను దైత్యుడు కొంతకాలము రాజ్యమేలి మధు రేశ్వరుడను పెద్దకుమారునకు రాజ్యమిచ్చి, అడవులకుబోయి గొప్ప తపస్సు చేసెను. ఇంద్రాధిపత్యమునకై దైత్యుడు తపస్సు చేయు చున్నాడని ఇంద్రుడు భ్రమపడెను.

ఇంద్రుడు శ్రీహరివద్దకేగి తన పదవికి ముప్పుదెచ్చుచున్న వృత్రుని సంహరింప ప్రార్థించెను. నారాయణు డిట్లనెను. "నీపదవి నీకు దక్కునట్లు చేయుటయు, మిత్రుడగు వృత్రుని సంహరింపకుండుటయు నాకు ధర్మమగును. నా శక్తిని మూడుభాగములు చేయుదును. ఒక భాగము నీకును, రెండవ భాగము నీవజ్రాయుధమునకును, మూడవ భాగము భూలోకమునకు చెందును. నీకు రెండు భాగములు వచ్చినవిగనుక నీవు పోయి వృత్రునితో యుద్ధము చేయుము. సంహరింప గలుగుదువు" అనెను.

దేవతలతో గూడి ఇంద్రుడు వృత్రునికడకుపోయి తపస్సులోనున్న వానిని చంపుటెట్లని తటపటాయించుచుండెను. ఇంతలో వజ్రాయుధమే పోయి వృత్రాసురుని శిరము ఖండించెను. వృత్రుడు మరణించెను.

సురరాజునకు బ్రహ్మహత్యాపాతకము చుట్టుకొనెను. అతడు స్పృహతప్పి పడిపోయెను. మహాసంక్షోభము కలిగెను. దేవతలెల్లరు విష్ణుమూర్తివద్దకు వెళ్ళి ఇంద్రుని రక్షింప వేడుకొనిరి. "అశ్వమేధము చేసి, నన్ను పూజించిన దేవేంద్రుడు తిరిగి తనపదవి నందును" అని నారాయణు డానతిచ్చెను. దేవతలు ఇంద్రునిచే అశ్వమేధము చేయించగా బ్రహ్మహత్యాపాతకమువదలెను. ఇంద్రుడు తనపదవిని పొందెను. కాని బ్రహ్మహత్య "నాకు మార్గముచూపుడు. నేనెవరి నాశ్రయింప వలెను?" అని అడుగగా దేవతలు "నీవు నాలుగు భాగములుగా విడిపొమ్ము" అనిరి.

"ఒక భాగమున వర్షకాలమందలి పొంగి పొరలు నదులను, రెండవ భాగమున భూమిని, మూడవభాగమున బ్రహ్మహత్యచేయువారిని నాలుగవ భాగమున నెలకు మూడు దినములు ఋతుక్రమమునయుండు స్త్రీలను ఆశ్రయించి యుండునట్లు అనుగ్రహింపు"డని బ్రహ్మహత్య దేవతలనుకోరగా వారు సమ్మతించిరి.

కాబట్టి అశ్వమేధ ప్రభావము గొప్పది. అది చేయుమని లక్ష్మణుడు రామునికోరెను. అశ్వమేధమునుగూర్చి మరియొక కథ చెప్పదలచి రాముడు తమ్ములతో ఇట్లు చెప్పెను.

ఇళుడు - ఇళ :

కర్దముని కుమారుడగు ఇళుడు బాహ్లిక దేశము నేలెను. అతడొకనాడు వేటకై హిమవంతమున కేగెను. అచట పార్వతీ పరమేశ్వరులు పరివారముతోవచ్చి విహరించుచుండిరి. "పరమేశ్వరుడు స్త్రీరూపముదాల్చిన ఎట్లుండునో" అని పార్వతీదేవి అనుకొనెను. శంకరుడది గ్రహించి తాను స్త్రీ అయ్యెను. పరివారమునంతను స్త్రీలుగా మార్చెను.

ఆసమయమునకే ఇళుడు వచ్చుట సంభవించెను. ఆ ప్రదేశము చేరగనే ఆ రాజు స్త్రీగా మారిపోయెను. ఇళుని పరివారము కూడా స్త్రీజాతిగా నయ్యెను. ఇళుడు శివునివద్దకుపోయి తనకు మరల పురుష రూపము ప్రసాదింపుమని వేడుకొనెను. శంకరుడంగీకరింపలేదు. ఇళుడు పార్వతీదేవి కడకుపోయి మొరబెట్టుకొనెను. అపుడామె, "నేను సగము వరము. పరమేశ్వరుడు సగమువరమును ఇచ్చెదము. నీవు స్త్రీ రూపమున నెంతకాలము పురుషరూపమున నెంతకాలము ఉండగోరుదువో చెప్పుము" అనెను. ఒకమాసము స్త్రీగను ఒకమాసము పురుషుడుగను ఉండునట్లు ఇళుడు వరమిమ్మని ప్రాధేయపడగా పార్వతి 'సరే' అనెను. కాని అతడు స్త్రీయైనపుడు పురుషరూపమును గూర్చియు పురుషరూపములో నున్నప్పుడు స్త్రీ రూపమునుగూర్చియు మరచియుండునని పార్వతి అనెను.

చంద్రుని కుమారుడగు బుధుడాప్రాంతమున తపస్సుచేయుచు ఇళను చూచెను. ఆవర్తని యను విద్యవలన జరిగిన విషయము తెలిసి

కొని ఇళవద్దనున్న చెలికత్తెలను కింపురుషాంగనలై ఈ పర్వతమున నివసించుడని పంపివేసెను.

బుధుడును ఇళయు ప్రేమానురాగముల నుండిరి. ఆ మాసము గడచి, తరువాతి మాసము రాగానే ఇళ - ఇళుడుగ మారెను. తన పరివర క్షేమమయ్యెనని రాజు అడుగగా బుధుడు, "రాజా! పెద్ద వడగళ్ళ వాన కురిసినది. నీ పరివారమంతయు చనిపోయెను. నీవు నా ఆశ్రమమున ఒకసంవత్సరముండుము. నీకు మేలుకలుగజేసి పంపుదు"ననెను. మహర్షి మాట కెదురాడలేక ఇళుడటనే యుండెను. మరుసటి నెలలో స్త్రీయై బుధుని సంతోష పెట్టుచుండెను. ఇళ గర్భవతియై తొమ్మిదవ మాసమున స్త్రీ రూపములోనుండి ఒక కుమారుని కనెను. అతడే పురూరవుడు.

ఒక సంవత్సరము గడచెను. పురుషరూపములోనున్న ఇళునకు మేలుచేయదలచి బుధుడు కర్దమ ప్రజాపతి, చ్యవనుడు మున్నగు మహా మునీంద్రుల రావించి వారితో ఆలోచించెను. పార్వతీ పరమేశ్వరులకు ప్రీతిని కలిగించునది అశ్వమేథము. ఇళునిచే మనము యాగము చేయింతమని అందరనుకొనిరి.

మరుత్తు యజ్ఞము చేయించగా సంపూర్తి అయ్యెను. శివుడు తృప్తినంది ప్రత్యక్షమయ్యెను. "పరమేశ్వరా! ఇళుడు శాశ్వతముగ పురుషుడై యుండునట్లనుగ్రహింపుము." అని వేడుకొనిన మునులకు శంకరుడు వరమిచ్చి అదృశ్యుడాయెను. ఇళుని దీవించి మునులు వెడలి పోయిరి.

మధ్యప్రదేశమున ప్రతిష్ఠాన పురమును నిర్మించి అందు ఇళుడు రాజ్యమేలెను. ఇళుని జ్యేష్ఠపుత్రుడు శశిబిందుడు బాహ్లీక దేశమేలెను.

కనుక సర్వశుభముల నొసగు అశ్వమేధయాగము చేయుటకు రాముడు, లక్ష్మణుడు, భరతుడు నిశ్చయించుకొనిరి.

## అశ్వమేధము :

యజ్ఞము చేయుటకు కావలసిన యేర్పాటు లన్నియు చేయించ వలసినదని రాముడు లక్ష్మణున కాజ్ఞాపించెను. దేశాధీశులందరికిని లక్ష్మణు డాహ్వానములు పంపించెను. అనేకమంది భూపాలురు వచ్చిరి. సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, విభీషణుడు మున్నగువారు వచ్చిరి. మహర్షులు, బ్రాహ్మణులు, పండితులు మొదలగువారు వచ్చిరి.

గోమతీ నదీతీరమునందు యజ్ఞశాలను, కావలసినవారి కెల్లరకును విడిది శాలలను లక్ష్మణుడు ఏర్పాటు గావించెను.

సమస్త శుభలక్షణములు కలిగిన అశ్వమును రాముడు యథా విధిగ విడిచిపెట్టెను. దాని ముఖమునందు, "దశరథ రాముడు వదలిన యాగాశ్వము" అని వ్రాయబడిన ఫలకము కట్టిరి. కొందరు సైనికులు వెంటరాగా లక్ష్మణుడు అశ్వరక్షణమునకై బయలుదేరెను. ఋత్విక్కులును గుఱ్ఱము వెంట నుండిరి.

రాముడు యజ్ఞశాలలోనికి వెళ్ళెను. చాల దేశములనుండివచ్చిన రాజులందరును తెచ్చిన కానుకలను రామునకు సమర్పించిరి. ఆహూతుల నెల్లరిని రాముడు గౌరవించెను. భరతుడు, శత్రుఘ్నుడు వారి వారికి నియమింపబడిన కార్యములను నిర్వహించుచుండిరి. భోజనసదుపాయము లను గావించిరి. వడ్డనలు చేసిరి. అన్ని విషయములందును హనుమంతుడు, సుగ్రీవుడు, విభీషణుడును తోడ్పడిరి. దేవతలుసహితమువచ్చి, చూచి, ఆనందించిరి. రాముడు బంగారుసీతను ప్రక్కనుంచుకొని యజ్ఞము చేయుచుండెను.

రా మా య ణ ము:

కుశలవుల వెంటనిడుకొని వాల్మీకి మహర్షి అశ్వమేధాధ్వరము నకు వచ్చెను. మహర్షి బాలకులతో, "మీకు నేను నేర్పిన రామాయణము గానముచేయుడు. వాల్మీకి శిష్యులమని చెప్పుడు. ఎవరైన ధన మిచ్చిన తీసికొనవద్దు. రాముడు గానముచేయుడని అడిగిన తప్పక విని పింపుడు" అని పంపెను.

అచటనున్న వారందఱును మధురగానమువిని బాలకులను మెచ్చు కొనిరి. రాముడును విని ఒకసభ నేర్పాటుచేసి, బాలురచే రామాయణ కథాగానము చేయించెను. వారి మధురగానమునకలరి రాముడు ఆ బాలకులకు చెరిపదునెనిమిదివేల బంగారు నాణెముల నిచ్చెను. కాని వారు గైకొనలేదు.

ప్రతిదినమును ఇరువది సర్గల వంతున గానముచేయుచుండగా అందరును వినుచుండిరి. ఈ బాలకులు సీతకుమారులని రాముడు తెలిసి కొనెను. రాముడు వాల్మీకివద్దకు దూతలనుబంపి ఇట్లు విన్నవించు మనెను. "మహామునీ! రేపు సభయందు సీత సౌశీల్యము నిరూపించు నట్లు చేయుడు." దూతలు చెప్పినదివిని మహర్షియు మిగుల సంతసించెను, అందుల కంగీకరించెను.

మ హా స భ:

శ్రీరాముడు సింహాసనాధిష్ఠితుడయి యుండెను. మంత్రి, సామంత, దండనాయక, పౌర, జానపదులును సోదరులును సభనలంక రించియుండిరి.

వాల్మీకి మహర్షియు, ఆయనవెంట సీతయు సభలోనికి ప్రవేశిం చిరి. కుశలవులును ఆ సభయందుచితాసనాసీనులై రామునికి చేరువలో నుండిరి. వాల్మీకి మహర్షి ఇట్లనెను.

ఉ. క్షత్త్రియ పుత్త్రికాభరణ - గారవలీల వెలుంగు మేదినీ
పుత్త్రి మదాశ్రమ స్థలము - పొంత వనంబున ద్రోచివచ్చె సౌ
మిత్త్రి, తపస్వి బాలకులు - మెల్తుకఁగన్గొని వచ్చినాకు ద
న్మాత్త్రి నెఱుంగఁ జెప్పటయు - మానినియున్నెడకేనుగ్రక్కునన్॥

కం చని యనునయించి యాశ్రమ
మునకుంగొనిపోయి యచటి - మునివరపత్నీ
జనముల భంగి నుటజ వ
ర్తిని జేసిన యంతఁ గొన్ని - దినములు సనినన్.

(తిక్కన నిర్వచనోత్తర రామాయణము)

జానకి యీ బిడ్డలను కనినది.

శ్లో॥ ప్రచేతసోహం దశమః పుత్రో రాఘవనందన
నస్మరామ్యనృతం వాక్య మిమౌతు తవపుత్రకౌ॥
బహువర్ష సహస్రాణి తపశ్చర్యా మయాకృతా
నోపాశ్నీయాం ఫలం తస్యా దుష్టేయం యదిమైథిలీ॥
మనసా కర్మణా వాచా కృతపూర్వం నకిల్బిషం
ఫలం తస్యా హ మశ్నియా మపాపా మైథిలీయది॥

సీ॥ శ్రీరామా! నేను ప్ర-చేతసు పదియవ
పుత్రుండ, మదినైన - బొంకు దలప
నీపుత్రు లిర్వురు - నీపుత్రులేచుమ్ము
పెక్కు వేలేడులే - నుక్కడంపు
దప మొనరించితి - ధరణిజ దుష్టయేన్
దపముఫలంబెల్ల - దగ్ధమగుత
మనసున గర్మంబు - నను వాక్కుచేతను
గలుషంబు నేనెప్డు - సలుపలేదు.

* * *

(ఆంధ్ర వాల్మీకి రామాయణము ఉత్తరకాండమునుండి)

సీ తా రా ము లు :

రాము డిట్లనెను, "ఋషివరా! మీరాడిన మాటలయందు అసత్యములేదు. సీతశీలము నేను శంకించుటలేదు. సమస్తదేవతల సమక్షమున సీత అగ్నియందు ప్రవేశించి తన పాతివ్రత్యము నిదివరకే నిరూపించుకొనెను. ఇపుడును ఆమె తన శీలమును నిరూపించుకొనిన నేనును లోకమును సంతసించుటగును."

బ్రహ్మాది దేవతలుకూడ ఆ సభను, సీతారాముల పునస్సమాగమమును చూడవచ్చిరి. సభలోనున్న వారందఱును మరల పదుమూడేండ్లకు సీతారాములను కన్నులపండువుగ చూడగలిగినందులకు ఆనంద సంభరితులైరి.

రాముడు కుశలవుల నిరువుర తనవద్దకు చేరదీసికొని, "ఈబిడ్డలు నాబిడ్డలయినందులకు సంతసమగుచున్నది. వీరినింతవారినిగ జేయ శ్రమగైకొనిన వాల్మీకి మునివర్యున కెంతయో ఋణపడియున్నాను. కొన్ని దినములనుండి మధురగానముచే బాలకులు నన్నును, నా మాతృదేవతలగు కౌసల్య, సుమిత్ర, కైకేయి ప్రభృతులను, సభాసదులను ఆనందింప జేసిరి.

వారిగానము మరల వినకుతూహలపడుచున్న నా తల్లుల కోర్కెననుసరించి ఈనాడు సీతాకళ్యాణఘట్టము నింకొకమారు వినిపింప బాలకులకు వాల్మీకి మునీంద్రులు అనుజ్ఞనీయగోరుచున్నాను." అని శ్రీరామచంద్రప్రభువు పలికెను.

వాల్మీకిమహర్షి మహదానందముతో సమ్మతించెను. కుశలవులు సభామధ్యమున లేచి తమ సహజ మధురగానమునిట్లు వీనులవిందొనర్చిరి.

సీతారామ కళ్యాణఘట్టము :

రామలక్ష్మణులు విశ్వామిత్రయాగ సంరక్షణముగావించిరి. రాక్షససంహార మొనర్చి యజ్ఞము నిర్విఘ్నముగ సంపూర్తి అయినందులకు మునులెల్లరు ఆనందించిరి. విశ్వామిత్రుడు మిక్కిలి సంతసించినవాడయి,

శ్లో. కృతార్థోస్మి మహాబాహో కృతం గురువచస్త్వయా
సిద్ధాశ్రమ మిదం సత్యం కృతం రామ మహాయశః॥

ఓ రామా! నీవు మహాబాహుడవు, గొప్ప యశస్సు కలిగినవాడవు. నేను కృతార్థుడనైనాను. నీతండ్రియాజ్ఞను పాటించితివి. సిద్ధాశ్రమము అను యీ ఆశ్రమము పేరును సార్థకముచేసితివి, అనెను.

మరునాడు 'ఏమిఆజ్ఞ?' అని చేతులుగట్టుకొని నిలచిన రామలక్ష్మణులకు విశ్వామిత్రమహర్షి యిట్లు చెప్పెను. "జనకమహారాజు మిథిలను పరిపాలించుచున్నాడు. అతడొక యజ్ఞము చేయుచున్నాడు. ఆ యజ్ఞము చూడబోవుచున్నాము. ఆరాజువద్ద గొప్ప శివధనుస్సు కలదు. మీరు నాతోవచ్చిన ఆ మహాధనువును చూడవచ్చును. దేవతలు కూడా దానిని ఎక్కుపెట్టజాలరు. నేను ఈ యాశ్రమము వదలి హిమాలయపర్వతప్రాంతమునకు వెళ్ళగోరుచున్నాను." అనెను.

రామలక్ష్మణులు మునివెంట బయలుదేరిరి. ఆశ్రమమునందలి మునులును వెంబడించిరి. వారారాత్రి శోణానదినిచేరిగడపిరి. దారిలో విశ్వామిత్రుడు వారికనేకవింతవింత కథలుచెప్పి ఉత్సాహముకలిగించెను. గౌతముని ఆశ్రమము సమీపించిరి. అహల్యాగౌతముల వృత్తాంతమును విశ్వామిత్రుడు చెప్పెను.

జగదేక సుందరియగు అహల్యను బ్రహ్మ సృష్టించెను. ఆమెను గౌతమ మహర్షికిచ్చి వివాహముచేసెను. ఇంద్రుడామె యెడల అను రాగము కలవాడయి యుండెను.

ఒకనాడు గౌతముడులేని సమయమున ఇంద్రుడు గౌతమమహర్షి రూపమునవచ్చి ఆశ్రమమున ప్రవేశించి ఆమెను బలాత్కరించి వెడలి పోవుచుండగా గౌతముడు చూచెను. జరిగినదంతయు గ్రహించి ఇరు వురివలన తప్పిదము జరిగినదని భావించి ఇంద్రుని, అహల్యను ఋషి శపించెను. అప్పటినుండి ఆమె ఆహారములేక బూడిద, దుమ్ము కొట్టు కొన్న శరీరముతో శిలవలె పడియుండెను.

ఇట్లు విశ్వామిత్రుడు చెప్పుచుండగనే రాముని మాట చెవినిబడిన అహల్య లేచెను. రామలక్ష్మణు లామెకు నమస్కరించిరి. ఆమె రాముని పూజించెను. అంత గౌతముడును అచటకువచ్చెను. గౌతమ దంపతులు రాముని పూజించిరి.

గాధినందనుడు రామలక్ష్మణులతో మిథిలానగరము చేరెను. అచట యజ్ఞము జరుగుచుండెను. జనకుని పురోహితుడు అహల్యా కుమారుడగు శతానందుడు. జనకుడును, శతానందుడును విశ్వామిత్రున కెదురుగవచ్చి, అర్ఘ్యపాద్యాదుల గౌరవించిరి. మహర్షి రామలక్ష్మణు లను పరిచయముచేసెను.

మరునాడు రామలక్ష్మణులు శివధనుస్సును చూడగోరుచున్నా రని విశ్వామిత్రుడు జనకునితో చెప్పెను. వారలకు జనకుడిట్లు చెప్పెను.

"పూర్వము దక్షాధ్వరధ్వంసము గావించునపుడు రుద్రుడు ఈ ధనువు చేతబట్టెను. దేవతలాయనను శాంతింపజేసిరి. దేవతలవలన ఆ ధనువు దేవరాతుడను రాజునకు చెందెను. ఆ వంశములోని నా వద్ద ఇప్పటికిని ఆ ధనువు కలదు.

ఒకనాడు భూమిని దున్నుచుండగా నాగటిచాలున ఒక బిడ్డనాకు లభించెను. ఆమె పేరు సీత. నేనామెను కన్నబిడ్డవలె పెంచితిని. ఆమె నొక గొప్ప వీరపురుషున కీయవలెనని సంకల్పించితిని. శివధనుస్సును ఎవరు ఎక్కుపెట్టుదురో వారికి సీతనిచ్చెదనని చాట బంచితిని. చాల మంది రాజకుమారులు ధనువు నెక్కుపెట్ట ప్రయత్నించి విఫలులైరి."

రాజాజ్ఞపై బలిష్ఠులగు ఐదువేలమంది ధనువునుంచిన బండిని లాగుకొనివచ్చిరి. రాముడు దానినిచూచి తాను ఎక్కుపెట్ట గోరుదు ననెను. మహర్షియు, రాజును అంగీకరించిరి.

శ్లో. పశ్యతాం నృపసహస్రాణాం బహూనాం రఘునందనః
ఆరోపయత్స ధర్మాత్మా సలీల మివ తద్ధనుః.

శ్లో. ఆరోపయిత్వా ధర్మాత్మా పూరయామాసతద్ధనుః
తద్బభంజ ధనుర్మధ్యే నరశ్రేష్ఠో మహాయశాః.

అనేకమంది జనులును, వేలకొలది రాజులును చూచుచుండిరి. రాముడు ఆ ధనుస్సును అవలీలగా పైకియెత్తెను. రాముడు ధనువును వంచి నారిని కట్టజూచెను. కాని అది మధ్యకు విరిగిపోయెను.

అపుడు కలిగిన పెద్దధ్వనికి చూచువారి గుండెలు ఝల్లుమనెను. ధరణి వణకెను. తనప్రతిజ్ఞ నెరవేరినందులకు జనకమహారాజు మిక్కిలి ఆనందమునందెను.

సీతను రామునకిచ్చి వివాహముచేయదలచితినని జనకుడు తన మంత్రులను అయోధ్యకుబంపి దశరథునికి కబురంపెను. దశరథుడు సంతోషపులకిత శరీరుడయ్యెను.

సపరివారసమేతముగ దశరథుడు మిథిలానగరమునకు విచ్చేసెను. జనకుడు దశరథమహారాజున కెదురుసని స్వాగతము నొసగెను. పెండ్లి వారికి ప్రత్యేక విడుదల నేర్పాటుజేసెను.

జనకమహారాజు తమ్ముడు కుశధ్వజుడు. ఆతడు సాంకాశ్యపురము నేలుచుండెను. అతడును వివాహమునకు వచ్చెను.

జనకుడు సీతను రామునకిచ్చి వివాహముచేయు సందర్భమున తన కుమార్తెయగు ఊర్మిళను లక్ష్మణునకివ్వదలచినట్లు చెప్పెను. ఇది వినిన విశ్వామిత్రుడు, "నీ ఆలోచనము బాగున్నది. ఈ సమయముననే నీ తమ్ముడగు కుశధ్వజుని కుమార్తెలగు మాండవి, శ్రుతకీర్తులను భరత శత్రుఘ్నులకిచ్చి పరిణయముచేయుట సమంజసము." అనెను.

జనకుడును, కుశధ్వజుడును అందులకంగీకరించిరి. ఉత్తరా ఫల్గుణీనక్షత్రము వివాహమునకు శుభప్రదమని పెద్దలు చెప్పుదురు. నలుగురి వివాహములును ఒకేనాడు జరుపవచ్చును అనుకొనిరి. భరతుని మేనమామయగు యధాజిత్కూడా తెల్లవారుసరికి మిథిలకు చేరెను.

వధూవరులకు మంగళ స్నానములు చేయించిరి.

ఉభయవర్గములవారును శోభాయమానముగ నలంకరింపబడిన వివాహ వేదికపైని ఉచితాసనాసీనులై యుండిరి. వశిష్ఠుడును, శతానందుడును పురోహితులుగ వ్యవహరించిరి. అగ్నిహోత్రము జ్వలించుచుండగా వేదోక్తమగు హోమము జరిగెను. వేదికపైకి గొనిరాబడిన సీత సర్వాభరణ శోభితయై యుండెను. జనకమహారాజు ఇట్లనెను.

శ్లో. ఇయం సీతా మమసుతా సహధర్మచరీ తవ
ప్రతీచ్ఛ చైనాం భద్రంతేపాణిం గృహ్ణీష్వ పాణినా॥

నా కుమార్తెయగు ఈ సీత నీకు సహధర్మచారిణి, ఈమె పాణిగ్రహణము చేయుము. అనుచు రాముని చేతియందు ఉదకమును విడిచెను. సీతారాముల వివాహము జరిగెను.

ఇట్లే అదేసమయమున ఊర్మిళా లక్ష్మణులకు, మాండవీ భరతులకు, శ్రుతకీర్తీ శత్రుఘ్నులకు వైభవోపేతముగ వివాహములు జరిగినవి.

కళ్యాణ మహోత్సవ సందర్భమున బహువిధ వాద్యములు మ్రోగెను. భూసుర వేదమంత్ర పఠనము దిక్కులు పిక్కటిల్లెను. దేవ దుందుభులు మొరసెను. గంధర్వులు గానము చేసిరి. అప్సరసలు నాట్యమాడిరి. పుష్పవృష్టి కురిసెను.

సీతారాముల కళ్యాణము లోకకళ్యాణము

శ్లో. ఆదికావ్య మిదం త్వార్షం పురా వాల్మీకి నాకృతమ్
యః పఠేచ్ఛృణు యాల్లోకే నరః పాపాత్ప్రముచ్యతే॥

శ్లో. మంగళమ్ కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్.

కుశలవులు మంగళవాక్యములతో తమ రామాయణ కథాగానమును సంపూర్ణ మొనరించిరి. పెద్దలెల్లరకును నమస్కరించిరి.

మధురగానము నింకను వినవలెనని శ్రోతలు అనుకొనుచుండిరి. కౌసల్య, సుమిత్ర, కైకేయి తమకోరిక తీరినందులకు సీతారామకల్యాణ ఘట్టము మరల తనివిదీర వినినందులకు సంతృప్తి నొందుచు మనుమలను పుత్రపౌత్రాభివృద్ధిగ నాశీర్వదించిరి.

శ్రీరాముడు బాలురను చేరదీసికొని దీవించి, శిరములను మూర్కొనెను.

సీత తన బిడ్డలు మహాజనమును మెప్పించి శుభాశీస్సులనందినందుకు మనమున ఉప్పొంగిపోయెను. రాముడు కుశలవుల నాలింగనము చేసికొనినందులకు ఆనందబాష్పముల రాల్చెను.

వాల్మీకిమహర్షి పలికినది ఇటులు :

శ్లో. చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరం
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్.



రామాయణం తథాశ్లోకం పాదం చార్ధంచయః పఠేత్
పాపాన్యపి సదా సర్వాన్ సపహా తేనలిప్యతే.



రఘురాముని చరిత్రము శతకోటి ప్రవిస్తరమైనది. ఇందలి ప్రతిఅక్షరము మహాపాతకమును సహితము నశింపజేయును. రామాయణమును, ఒక శ్లోకమును, శ్లోకములోని ఒకపాదమునైనను లేక పాదములోని సగమునైనను చదివినవారు సదాపాపములు చేసినవారైనప్పటికిని ఆ పాపములు వారినంటవు.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః

గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినోభవంతు.

ప్రజలెల్లరకు శుభము కలుగునుగాక! భూపాలురు న్యాయమార్గమున పరిపాలింతురుగాక! గోవులకును, బ్రాహ్మణులకును ఎల్లప్పుడు శుభములు కలుగునుగాక! సమస్తలోకములు సుఖమునొందునుగాక!

సమస్త సన్మంగళానిభవంతు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ హనుమల్లక్ష్మణ భరతశత్రుఘ్న సమేత
శ్రీ సీతారామచంద్రార్పణమస్తు

ఓం తత్ సత్